# అభివందనములు

శ్రోతర కళాకారుల, సాంస్కృతిక సంస్థల, తదితర కళా హృదయులైన మిత్రుల ఆకాంక్షాభ్యర్థనల కనుగుణంగా నన్ను ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి రాష్ట్ర గవర్నరు నామినేట్ చేసినారు. ఈ 'గౌరవము' కళలకు ముఖ్యముగా సంగీత, నృత్య, నాటక కళలకు చేసిన గౌరవముగా నేను భావిస్తున్నాను. ఈ సందర్భమున మన రాష్ట్ర గవర్నరునకు, ముఖ్యమంత్రికిని అభ్యర్థనలు, అభివందనలు అందజేసిన అభిమానులకు, కళాకారులకు, కళా సంస్థలకు నా మనః పూర్వక ధన్యవాదములు తెల్పుకొంటున్నాను. వివిధ కళల పురోభివృద్ధికి నా సాయశక్తులా శాసనమండలి ద్వారా కృషి చేయగలనని హామీ యిస్తున్నాను.

ఇట్లు,

పసల సూర్యచంద్రరావు

సంపాదకుడు.

జూలై 1968

# నాట్యకళ

మాసపత్రిక





సంపుటి 1 సంచిక 7

వెల 1-00

## ఈ సంచికలో

# 100 వ రోజు

శ్రీదేవి ప్రొడక్షన్స్

వారి

# పరమా నందయ్య శిష్యులకథ



రచన: సదాశివబ్రహ్మం. దర్శకత్వం: సి. పుల్లయ్య సంగీతం: ఘంటసాల నిర్మాత: తోట సుబ్బారావు

ఛాయాగ్రహణం: సి. నాగేశ్వరరావు, కళ: వాలి, నృత్యం: వెంపటి, మేకప్: పీతాంబరం, సురేష్: రమేష్,

కూర్పు: బి. గోపాలరావు, దుస్తులు: బి. నారాయణమూర్తి, స్టిల్సు: డి. రాధాకృష్ణమూర్తి,

అసోసియేట్ డైరెక్టర్: B. L. N. ఆచార్య, నిర్మాణ నిర్వహణ: చిట్టూరి గాంధి



సాగర్ టాకీస్, హైదరాబాదు
దసపల్లచిత్రాలయ, విశాఖపట్నము
న్యూపూర్ణా థియేటర్, విజయనగరము
శ్రీరామా టాకీస్, విజయవాడ
పద్మనాభ పిక్చర్ ప్యాలెస్, కాకినాడ
శ్రీకృష్ణా పిక్చర్ ప్యాలెస్, రాజమండ్రి
మారుతీ టాకీస్, భీమవరం
దుర్గామహల్, మచిలీపట్నం
లీలామహల్, అమలాపురం
షామహల్, ఏలూరు
శేషమహల్, గుంటూరు
వినాయకసినిమా, వెల్లూరు
సాయిబాబాటాకీస్, కర్నూలు
మినర్వాపిక్చర్ హౌస్, బెంగుళూరు
అలంకార్ టాకీస్, తెనాలి



## సంపాదకీయం

ఒక దేశానికికాని, వ్యక్తికికాని సక్రమమైన రీతిలో గుర్తింపు జరిగినదంటే, నిజముగా వాటి ఔన్నత్యాన్ని చాటుతుంది. అందులోనూ ఆ గుర్తింపు కేవలము భౌతిక పరిణితులలోనేగాక వాటి సాంస్కృతిక, ఆధ్యాత్మికోన్నతులను పురస్కరించుకొని జరగటం అనేది చాల అపూర్వ విషయము. ఇట్టి ఆదర్శ చర్య-గుర్తించు వ్యక్తులయొక్క సహృదయతమీదను - వారి సాంస్కృతిక దృక్పథము మీదను - కళా సంసర్గమునందిన హృదయ పరిణామము మీదను ఆధారపడి ఉంటుంది. మే మెన్నో పర్యాయములు వ్రాస్తున్నాము, కళా సంపదవలన పరిపుష్టముకాని మానవ హృదయము, సక్రమ రచన ఏ రంగములోను సాధించజాలదని. సుకౌశలమగు కర్మాచరణా ప్రావీణ్యము కళా సంస్కారము నందిన వ్యక్తికే సుసాధ్యము.

తాను చేబట్టిన, తనకు జన్మాంతర వాసన వలన లభించిన, దేశ కల్యాణ కారకములగు అధికార బాధ్యతలవలన, అనవద్యమగు, నిరంతర కార్యభారమున కృంగక నిత్య నూతనోత్సాహమునలయించు భాగ్య మొక కళా హృదయునకు మాత్రమే లభించుననుట సత్యదూరము కాదు. ఏ కళా శ్రవణ, మనన సందర్శనమున; చీకాకు నందిన, డోలాయమానమగు హృదయము తపన, కోప, అహంకార విషయముల మరచి, స్థిరతనంది వాసనాత్మకమగు ఈ జీవిత నిర్వాహణాలో, ఎచ్చటో అంతరాంతరాళముల మరుగుపడిన ప్రకృతి స్థితములగు శాంతి ప్రేమ గుణములు వెలుపలకు విరియ, వాటి ప్రసన్న భావమున తాను ధన్యుడగును.

కాలము అనంత మయినది, అవిభాజనమైనది. అట్లే కాలాంతర్గత నిత్య సత్య పదార్థము అనంతరాయముగ, అనవద్యముగ వెలుగుచునేయుండుట గమనార్హము.

'సత్యం, శివం, సుందరం'. సౌందర్యోపేతమగు సత్యము శక్తివంతమగు శాశ్వత తత్వము. దీనిని ఏ విరుద్ధ అసుర శక్తులు నశింప జేయజాలవు. దీని తత్వము మానవాంతర్గతమగు రహస్యము. ప్రకృతియందు మరుగుపడియున్న సత్యము. ఇట్టి సత్యము వలన జీవరాసి జనించుట - మనుట - లయించుట జరుగుచున్నది. నాదాత్మకమగు ఈ సృష్టి, లయాత్మకమగు ఉనికి (మనుగడ), నృత్యాత్మకమగు ప్రస్థానములు, ఈ సత్యముపైననే ఆధారపడియుండుట తెలిసికొనదగినది. నిత్య ప్రవర్ధమానమగు సృష్టిలో అంతర్లీనమై జీవశక్తికి చైతన్య శక్తిని ప్రసాదించు కళాతత్వము, పూర్వ జన్మ సుకృత

మున గాక గోచరము కాదు, లభ్యము కాదు. కళా ప్రసాదిత ఆనందానుభూతి వలన సంస్కారము నలవరించుకొన్న మృదుల హృదయము నిత్య నూతన వైలక్ష్య భావ సంపూర్ణమై నిరంతరము ప్రేమాన్వితములగు సంఘ శ్రేయస్సాధనలైన కార్యాచరణమునకే లక్ష్యమై యుండును. ప్రేమ సాధన వలన లభ్యము కానిది యీ సృష్టి క్రమములో లేదు, ఉండజాలదు. ఏ కళా రసాస్వాదనమున ప్రేమోత్పత్తి కల్గునో ఆ కళోన్నతికి దోహదము నొసగు కాంక్ష జనించుట పూర్వ పుణ్య ఫలము. ఐహిక సుఖానందమున లభించు ఆనందమును క్షణికముగ భావించి, కళాజనిత శాశ్వతానందమును కాంక్షజేయు జీవి, నిత్య యౌవ్వనుడై వీర్యవంతుడై, సృష్టిని శాసించగల సామర్థ్యము నంది శాశ్వతుడగును. పరమ కల్యాణ గుణ సమన్వితములగు కళలు, ఆరాధ్యములు. ఆరాధ్యముల నారాధించు ధీ విశేషము ప్రశంసా పాత్రము కాగలదు. దైవికములగు రాజయోగములు, సంస్కృతవంతములగుచో దానికి నలవరించుకొని - కీర్తిని సంపాదించుకొని సర్వాత్మ మన్ననల నందుటలో సందియము లేదు. ప్రతి క్షణమున వివిధములగు పరిణామముల నందు దేశ సంపద, సంస్కృతిపరుల హస్తముల భద్రత నందుట తగు. రమణీయమును - మంజులమును - సౌందర్య శోభితమును అగు కళా లక్ష్మికి ఈ సమయమున - ఈ వాతావరణమున - ఇట్టి అఖండమగు ఆదరణ, గౌరవము రాష్ట్రమున సంగీత నృత్య నాటక కళోద్ధరణకు, సేవకు సర్వ కళాకారులచే నియమితులైన మా సంపాదకులకు రాష్ట్ర శాసన మండలిలో ప్రాతినిధ్య పరముగ లభించుట ముదావహము. ఈ సత్క్రియా నిర్వాహణ బాధ్యులగు, రాష్ట్ర గవర్నరు శ్రీ పట్టం థాను పిళ్లే, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగార్లు సదా వందనీయులు. వారికి మా నాట్య కళద్వారా, రాష్ట్ర కళాకారులు సర్వులు అభివందనములు చెప్పుకొను చున్నారు.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి."

—గీత



# సంగీతోపాసన ప్రాప్తి

శౌరి నాగభూషణం

సంగీతము అనగా సమ్యక్ గీయతే ఇతి, సంగీతము బాగుగా గానము చేయుట. ఈ బాగు ఎంత? పశువులను మేపుకొనుచు యాదవకుర్రడు నొక్కొక్కప్పుడు హాయిగా మంచి శారీరములో • కులాసాగా పాడు చుండును. అది విన సొంపుగా నుండును. అలాగే ఒక్కొక్క యానాది బాలిక (వీధి భాగవతముల నాడువారు) లేక యే భిక్షుక బాలుడో ఎంతో హాయిగొల్పు పాటలను ఎచటనో విన్నవి, కర్ణ రసాయనముగా పాడును. అంతమాత్రముచే నది సమ్యక్ గీత మగునా? మనకు ప్రస్తుతము అనుభవములో నుండు నాటకములలోని కొంతమంది పాత్ర ధారులు ఒక్కొక్క పద్యమును ఉచ్ఛ స్థాయిలో గుక్క తిప్పకుండా అంతులేని చిరకాలతో గిరగిర గిరగిర శారీర సౌష్టవ ముతో త్రిప్పి ఎంతో బ్రహ్మాండముగా చప్పట్లు చరచువరకూ పాడెదరు. కాని ఏదోనొక రాగములో మొదలుపెట్టి అంత్య మయ్యేలోపుగా ఒకటి, రెండు అన్య రాగ ములలోనికి దిగి, ఎచటను వచ్చి ఆగినది తెలియదు. ఐన నేమి? వినుటకు హాయిగా నుంటచే ఎంతబాగా పాడినాడు! అని చాల మంది సంతోషిస్తారు. అంతమాత్రము చేత అది సంగీతమా?

గనుక ఈ బాగు అనేది నిర్వచించాలి అంటే "సామవేదాది సంగీతం సంజగ్రాహ పితామహః; నిగమోత్తమ సామ వేద సారం" అన్నటుల వేదములలో ఉత్తమ మైన సామవేద సారం సంగీతమని తెలుపు చున్నది. వేదాధ్యయనము చేయు నపుడు ఉదాత్త, అనుదాత్త స్వరిత ప్రత్యయములని కొన్ని నాదనియమముల ననుసరించి ఉచ్ఛ, సమ, నీచ, దీర్ఘస్వానములచే క్రమము తప్ప కుండా, నిర్ణయించిన విధమును, గురు ముఖతా, సంతల జెప్పించుకొని తద్వారా నేర్వవలసినది. ఇందు నిర్దేశించిన దానికి భిన్నముగా అపస్వరములతో నుచ్చరించి నచో అందుకు శిక్ష రౌరవాది నరకము అని వేదము శాసించినది. అలాగే వేదములో నుద్భవించి, ఉపవేదమైన, గాంధర్వ వేదము అనగా సంగీతమును క్రమము దప్పి, గాన మొనర్చినచో పైని చెప్పబడిన శిక్షనే పొందునని సంగీతశాస్త్రము తెలియ జేయుచున్నది. అందువలన దీనిని ఉపాసించు నపుడు కట్టుబాట్లకు బద్ధుడై, లోనై అభ్య సించవలెను.

దీని నెవరెవ రుపాసించిరి? శృంగి, నకుల, [illegible]రజ, ఘటజ, మతంగ, నారద, [illegible] అర్యమా(బ్రహ్మ)సురపతి, శరణ్య(ఉమా[illegible]

స్వామి) గణేశాది మహా మహులు ఉపాసించిరి. సప్త స్వరములు వాటి భేదములతో గూడిన రాగములను, వాటి వివరములను బాగుగా నెరిగి, చిత్తశుద్ధితో ఈశ్వరార్పణముగా నాదోపాసన జేయువారికి ఆ సప్త స్వర దేవతలు సర్వదేవతలు అమృత ఫలముల నిత్తురని దెలియుచున్నది.

అది భక్తివినా సన్మార్గము లేదు. ఇచటి భక్తిని గూడ మిళితము చేయాలి. మిళితమేమి? అదే ప్రధానము. అనగా చిత్తయేకాగ్రత నలవర్చుకోవాలి. సంగీతాభ్యాసము వలన అలవడేది ఏకాగ్రతే గనుక భక్తియోగం ద్వారా చిత్తవృత్తి విరోధము 'మోక్ష కారణ సామగ్ర్యాం భక్తి రేవ గరీయసి' అన్నటుల ఈ సంగీతోపాసన ప్రాప్తి కేవలము ముక్తి యని తేటపడుచున్నది.

సామాన్యముగా ఈ సంగీతము జగన్మోహనమైన విద్య, మిక్కుమిక్కిలి కళ. కళ యనగానే సర్వులను, చేతనములనే గాక, అచేతనముల సైత మాకర్షించు సత్తా కలది. శ్రీకృష్ణ పరమాత్మ మురళీగాన మొనర్చినపుడు మోడులు సయితము చిగిర్చినవే యని వినలేదా! భక్త హనుమాన్ గుండక్రియ రాగ మాలపించినపుడు కొండ బండ రాయి కరిగి నీరై ద్రవించినదని వినమే! అక్బరాస్థాన గాయకుడు తాన్‌సేన్ దీపక రాగమాలపింప ప్రమిదలో తైలముచే తడిపి యుంచిన వత్తి తానంతటది వెలిగి జ్యోతియై ప్రకాశించలేదా! అలాగే అందరను ఆకర్షించు స్వభావము నవరసభరితమైన ఈ సంగీతకళకు గలదనుట నిర్వివాదాంశము.

వేదము ఒకచో నిట్లు దెల్పుచున్నది. "తస్మాత్ గాయంతగ్ స్త్రియః కామయంతే కాముకాయేవగ్ స్త్రియో భవంతి. య ఏవం వేదా" గాయకులను (కొంచెము మనస్సు మెత్తనిదైన వారిని ఇంకా) స్త్రీలు (అందరు కాదనుకోండి) కొందరు కోరి ఆకర్షిస్తారు.

బలవాన్ ఇంద్రియ గ్రామో
విద్వాం సమపికర్షతి...

జ్ఞాన సంపన్నులైన మహా విద్వాంసులు కూడా (అపి) ఇంద్రియలోలురై పతితమగుట కలదు కనుక ఏ జితేంద్రియులో తప్ప సర్వ సామాన్యముగా చాలమంది ఇందుకు గురియై మోక్ష ప్రాప్తికి తారకమైన సంగీతమును యిలా దిగజారిన స్థాయికి దెచ్చి పతితులై పతనమౌతారు. గనుక ఇటుల జారిపోకుండా ఏ పూర్వజన్మ సుకృత లేశమువల్లనో సంగీత కళ నుపాసించుదామనే తలంపు గలిగి, దానిని నేర్చి పరమోత్కృష్టమైన యే పరమావధి గలదో దానిని అందుకోవలెను గాని అన్యము గాదు.

ముక్తి పొందిన సంగీత త్రిమూర్తులిందులకు తార్కాణము, వారి కీర్తనలే మనకు సాక్ష్యము. కారణజన్ములై, నారద, చిదంబర, సంగీత స్వాములను గురువులుగా బడసి, ఎవరి రచన వారిదిగా, ఆచంద్రతారార్కము నిలబడే ఆధునిక సంగీతశైలుల సృష్టించి, వారివారి యిష్టదైవముల ప్రసన్నుల జేసికొని అన్యోన్య సంభాషణల గావించి, అజరామరములైన కీర్తనలద్వారా తారకమార్గము ప్రసాదించి, అంత్యకాల అవసాన దినముల దెల్పి బ్రహ్మైక్యమంది ముక్తిం జెందిరి.



మే 4 నుంచి 7 వ తేదీవరకు విజయనగరంలో జరిగిన నృత్యోత్సవానికి అధ్యక్షతవహించిన శ్రీ చింతా కృష్ణమూర్తిగారి
“భరత కళాప్రపూర్ణ” బిరుదంతో అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావుగారు సత్కరిస్తున్న దృశ్యం
ఎడమ ప్రక్కన ఉన్నవారు ఉత్సవం జాయింట్ కన్వీనర్ శ్రీ డి. వై. సంపత్‌కుమార్

నృత్యోత్సవానికి 4 వ తేదీన రాష్ట్ర మంత్రివర్యులు శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారు ప్రారంభోత్సవం జరిపారు. అనంత
నృత్య పోటీలను తిలకించారు. ప్రేక్షకులలో ముందువరుసవారు ఎడమ నుంచి కుడికి: శ్రీమతి సుమతీకౌశల్, శ్రీమతి శాం
రాజేశ్వర్, శ్రీ పసల సూర్యచంద్రరావు, శ్రీ ఎం. ఆర్. అప్పారావు, శ్రీ పెద్దింటి రామస్వామి





నృత్యోత్సవంలో ''భాగోతం''లోని ''జడవర్ణన'' భాగాన్ని
ప్రదర్శించిన శ్రీ పటిదా ఆదినారాయణ భాగపతులు

నృత్యోత్సవంలో ప్రత్యేక ప్రదర్శనమిచ్చిన
ఒడిస్సి నర్తకి కుమారి కుంకుందాస్



# మరుగుపడిన ముత్యాలు: మన నాట్యసంపద

సి. ఆర్. ఆచార్య

ప్రాచీనులగు మన పూర్వులు సంగీత నృత్యాది లలితకళలయందు మహా విజ్ఞానమును ఆర్జించి, తాము ఆర్జించిన విజ్ఞానమును కళాభిమానులకు సులభముగ తెలియునటుల జేసి, పండితపామరాది జనసామాన్యలను ఉత్తేజవంతులుగ జేయుటకు అప్పటి కాలాను సారముగ పగటి వేషములు, తోలు బొమ్మలాటలు కీలుబొమ్మలాటలు, బుట్టబొమ్మలాటలు మొదలుగాగల అనేక విధములగు వినోద క్రీడలను నాట్యకళకు అంకితములగునటుల జేసిరి. పండిత పామరాదుల సహితము రంజింపజేయు నీ క్రీడలు ఆరాధించుటకు అనేక కుటుంబములవారు ఆంధ్రదేశములో అంకితమైరి. వారిలో కూచిపూడి బ్రాహ్మణకుటుంబములవారు అనేకులు, ప్రత్యేకము పగటివేషములందు అందెవేసిన చేతులు. కాగా శ్రీరామపరము జంగమవారు ప్రసిద్ధులని చెప్పవచ్చును. గొల్ల భాగవతులు గూడ అనేకులు పగటివేషములతో తమ జీవితములు గడుపుచుండెడివారు.

"నాట్యం భిన్న రుచేర్జనస్య
బహుధాప్యేకం సమారాధనమ్"

అని భరతుడు నాట్యశాస్త్రములో చెప్పినటులుగ సామాన్య ప్రజానీకమగు ఆబాలగోపాలమునకు సులభముగ అర్థమగుట కొరకు చాల సులభమగు శైలిలో పగటివేషములందలి రచనలు లిఖించబడినవి. కాని కొన్ని కొన్ని తావులలో కఠిన పదములుగూడ మాతృకయగు సంస్కృత భాషలో లిఖించబడినవి. శివపురాణములకు సంబంధించిన అంశములు, విష్ణుపురాణ సందర్భములు, హాస్యరసపూరితములు, అర్ధచంద్రికలు, నిందాస్తుతులు, చమత్కార బాంధవ్యములు, చాటువులుగూడ అనేకములు గలవు. భిన్న భిన్న అభిరుచులుగల ప్రజానీకమును ఒకే అభిప్రాయము లోనికి తెచ్చునదియు, అమాయకులకు విజ్ఞానమును కలుగజేయునదియు సర్వమానవ సమానత్వము జేసి తీర్చిదిద్దగలిగినదియు నాట్యకళయే. లలితకళల యందు ముఖ్యమైనదని చెప్పవచ్చును. అందులకే భరతుడు

"సమస్త విద్యలు, ధర్మములు, నీతి, విజ్ఞానము, శిల్ప సంపదలతో కూడిన వేద విద్య ప్రదర్శనా యోగ్యమగునటుల రచించబడినదే నాట్యకళ" అని చెప్పెను.

సాతానివైష్ణవులు ధనుర్మాసము (సంక్రాంతి) పండుగ దినములలో నంబి, నాంచారమ్మ వేషములు ధరించి భగవన్నామస్మరణ సలుపుచు గాన నృత్యములు సలుపుచుండుటయేగాక; మానవ జన్మమును శ్రీమహావిష్ణువుయొక్క దశావతారాత్మకముగ జేసి గాన నృత్యాదులు సలుపుట వైష్ణవ వేషమగు పగటి వేషముల యందు ప్రసిద్ధము. సాతానివారి కుటుంబములు సంప్రదాయముగ ప్రతి సంవత్సరము సంక్రాంతికి వీధులవెంట, ఇంటింటికి వచ్చి ఈ రీతిగ సలిపి సంక్రాంతి పండుగ దినములలో సంభావనలు

సంస్థానములలో సన్మానములు బొందుచుండెడివారు. కాలక్రమముగ సంస్థానములు సన్నగిల్లినవి. కళాభిమానములేని ప్రజలు ఆదరించరైరి. ఆశ్రయించి అర్థించినను అనుగ్రహము పొందలేని విద్య దరిద్రులను కళాకారులను దరిద్రనారాయణుల నాశ్రయించి ప్రజాచరణమునకు దూరమైనది. సంక్రాంతికి సాతానులు గాన నృత్యముల నలుపు మానవ జీవిత దశావతార కీర్తనము:—

రాగము—కేదార.

చ॥ పాలకడలిలోని వటపత్రశాయి
తూగుటుయ్యలలోను బాలవైనావా॥
కమలములనుబోలు నీ కాలుసేతులను
అల్లనల్లన కదుపు మత్స్యావతారా॥

ముత్యాలతొట్టెలో బోర్లాపరుండి
ముసి ముసి నవ్వుల మై పులకరించి
భూమండలము బరువు మోయు రీతిగను
కలిమాయలను మోయు కమఠావతారా॥

నీలాలుగారు నీ నిండుచందురు మోము
పైకెత్తి వసుంధరను ధరించు బాల
మాగారు పాపాయి గుమ్మాలు దాటకే
కరవాలముల నలుపు నరసింహబాల

తప్పటడుగుల గొలుచు చిట్టి వామనబాల
చిటిపొటి యలుకల రామ భార్గవరామ
విద్యలను నేర్చి సంసారారణ్యమును దిరిగి
రాజ్యమేలిన శ్రీరామభూపాల.

అని యీ రీతిగ యింకను చాలా చరణములు గలవు. పరమాత్మలో నుండి అణు రూపముగ ప్రకృతిలో ప్రవేశించి పరమాత్మయొక్క దశావతారముల వలె మానవశరీరములో నున్న జీవుడు జీవితమును అనుభవించి ఎట్టకేలకు పరమాత్మలో జేరుటయే ఇందలి అంతరార్థము.

నెలలోపు శిశువు కాలు చేతులు కదలించుట మత్స్యము. బోర్లపడి కాలుసేతులు కదిపి నేలపై ప్రాకుట కూర్మము. ప్రాకుచు తల పైకెత్తి ముఖమును నేలకు పైకి కదల్చుట వరాహము. గుమ్మముల వరకు ప్రాకి చేతులతో గుమ్మములు పట్టుకొని నిలబడుట నరసింహము. బుడిబుడి నడకల బుడుతడు వామనము. విద్యాభ్యాస దశ శ్రీరామ. వివాహము చేసికొని సంసార బాంధవ్యములు నడుపుట కృష్ణః యుపక రక్తములో ఆవేశము, ఇచ్ఛా విశేషములో అనురాగము బలరామ. జీవితమునందలి కష్ట సుఖములు అనుభవించి తుదకు జ్ఞానమును ఆర్జించుట బుద్ధ. కలి అంతముగా అనుభవించు నిర్యాణము మోక్ష ప్రాప్తి అను నీజీవిత పరమార్థమును గూర్చి వివరించి ఉపదేశించునదే నంబి, నాంచారమ్మ వేదములు. దీనిని రచియించినవారు సింహాచల సంస్థాన పండితులు ముదుంబ నరసింహాచార్యులుగారు. సుమారు నూట ఎనుబది సంవత్సరముల పూర్వము వారు. జంగమ భాగవతులు, సాతానులు గూడ వారి శిష్యులై పగటి వేషములవలన జీవించెడివారు. ఇందలి అంశము వైష్ణవమతాభిమానము. అందులకే "వైకుంఠం రంగమందిరం" అని ప్రారంభించబడి:

నాంచారమ్మ: దాసోహం స్వామీ! పెరుమాళ్లయ్యావారు తమరు వేషములకేనా? లేక యదార్థముగ స్వాములవారా?

పెరు: అట్లా ఎట్లా నాంచారు? శంఖ చక్రములు ధరించిన శ్రీ మహావిష్ణువువలె చక్రాంకితములు కాబడి పన్నిద్దరాళ్వారులవలె ద్వాదశ ఊర్ధ్వపుండ్రముల ధరించి, "విష్ణో అలంకార ప్రియః" అని చెప్పినటుల పూలమాలలు ధరించి ఆచార్యులమైతిమి.

వాంచా: ఆకారములు ధరించినంత మాత్రమున మది గట్టుకొని ఆచార్యులమనిపించుకొనిన మాత్రమున ఆచార్యులెట్లా అయ్యారు? మీలోనేగాక పరమాత్మ అందరిలోను అణగియున్నాడని తెలిసికొని, పరులను తనవలె జూచి, పర దుఃఖము తన దుఃఖముగా అనుభవించు ప్రహ్లాదుని భక్తికల వారే శ్రీవైష్ణవులు గదా! వారే రామానుజ దాసులు — అని మానవ పరమావధి రహస్యమును బోధించును. ఈ యంశము గొల్లభామ కలాపమును బోలియున్నది. గొల్లభామ కలాపము శైవము. ఇది వైష్ణవము.

వాంచారమ్మ ప్రవేశ దరువు:—

రాగము - నాదనామక్రియ

ప. వైష్ణవులైతే శరణు వేడెదను
విష్ణు విలాసము తెలుపరయా॥

అ. ప. తిరుమణి తిరుచూర్ణపు ఊర్ధ్వపుండ్రముల
మేలుగ దిద్దిన విష్ణుమాయ అననేమొ
వివరముగ తెలుపరయా।
మాకది తెలుపరయా॥

చ. రామానుజయను నాల్గక్షరములు
వేదాక్షరములు గావా
ఆత్మలోన పరమాత్మను తలపుచు
విధి విలాసముల ఆనందములలో
శ్రీరంగని ధ్యానము తక్కిట ధిమికిట
దిక్కిట తోమని తాండవ నృత్యము గాదా॥

పగటి భాగవతుల తరువాత అంశము చమత్కార సంభాషణములతో గూడిన అప్పంభొట్లు పాత్ర. దీనితో సోమిదేవమ్మ సోమయాజులు ప్రవేశించుదురు. ఇది కేవలము హాస్యపూరితమైన సంభాషణములతో నిండియున్నది. దీనిని గుడిపూడి జంగమువారు, గొల్లభాగవతులు ఏలూరు శివాయి పగటి భాగవతులు ప్రదర్శించెడివారు --

సోమయాజి:-

సోమి ఆంథ
ఏమి? అంథ!

అప్పంభొట్లు వస్తారషరయ్య - సంభావనకి
పోస్తారషయ్య పొల్లి చారెడు నింద
నెయి వేస్తారషరయ్య-॥

"ఐతే సోమిదేవి?"
"ఏమి సోమయాజీ?"
"యజ్ఞానికి అన్ని సిద్ధం చేశావా?"

సోమిదేవి: తమ యజ్ఞానికి తిధి వార నక్షత్రాలు. జాతక మార్తాండాలు, వస్తుసంబారాలు, యజ్ఞ విధానం సెలవియ్యండయ్యా, సోమయాజులు గారు!

సోమయాజి: అలాగైతే సోమి, తిధి వారాలు నిద్దట్లో మఱచిపోయాను గాని జ్ఞాపకం ఉన్నంత మటుకు చెపుతాను విను.

నిన్న ఆదివారం, కులానికి బ్రాహ్మణవారం
వచ్చిమిరపకాయకారం, వుల్లయ్యయాయవారం
గుడిచుట్టు ప్రాకారం, గుళ్లో లింగాకారం
బ్రహ్మచారి గ్రహచారం

ఇవాళ్ల శనిపట్టిన వారం, వర్జ్యం తెల్లవారు ఝామున చెంబెడు నీళ్ళతో తెల్లగా వెళ్ళిపోతుంది.

జాతకమార్తాండం:

వృశ్చికం పిడకలలో వున్నది
తుల కొత్త సుబ్బయ్య కొట్లో హెచ్చుతగ్గులు
మిథునం దంపతులై పడకగదిలో వున్నారు
కన్య రాజాగారి పూలతోటలో వున్నది.

యజ్ఞ సంభారం:

పనసకాయంత మెతుకులను బానెడు
పప్పుతో కలిపి లోపలకు వెళ్లే ముద్దే గాని
బయటకు వచ్చే ముద్ద లేదు.

యజ్ఞము:

పిళ్లారాయనమః పీటేసుకొని కూర్చోండి
పూలంగట్లో పూలు సమర్పయామి
కొత్వాలు కొట్లోని బట్టలు సమర్పయామి
ఆఖరుకు ఉళక్కి నైవేద్యం సమర్పయామి.

అని సకల జన ఆహ్లాదకరమగు హాస్య నటనము సోమిదేవమ్మ సోమయాజులగార్ల పగటి వేషము.

జానపదవాసుల సింగి, సింగడు హాస్యము:

సింగడు: చింత చిగురు సొబగుదాన
కొమ్మిపూల కొప్పుదాన
తమ్మిరేకుల కమ్మలదాన
నమ్మికమ్మగ యేడ బోతివే?
నీ కొప్పులనిండ విప్పపూవుల
దండలెక్కడివే?
ఓ ఒయ్యారిదాన వంటి నిండ
గంధమెక్కడిదే?

సింగి: నీ జాడ తెలియక చెలికాడ
నడియాసల మెదుక బోతె
కొమ్మ కొమ్మకు కొంగు తగిలి
గుత్తిపూలతో కొప్పునిండె
నేరమెంచి నన్ను వంచకురా
ఓ ముసలి మొగడ
పూల గంధము మేను నిండెనురా!

ఇక జంగమదేవర వేషము పలనాటి న... మరాజు కాలమునాటిది. వీరశైవము విజృంభించిన రోజులలో గురు సిద్ధలింగముగారిచే రచించబడి శివరాత్రి పర్వ దినములలో పలనాడు సీమవాసులచే నరసారావుపేట ప్రభువులచే ఆదరింపబడి నంద్యాల, గురజాల, వినుకొండ మొదలగు తావులలో శివరాత్రి ఉత్సవములందు శివాలయములలోను, వీధులలోను ప్రదర్శిస్తూ వచ్చిరి.

సాంబశివా! మహాదేవ! దేవా!
ఉమయాదివ్య సుమంగళ విగ్రహా!
ఆలింగిత వామాంగ విభో!
ఝణు ఝణు ఝుం తిణి ఝణుత కిటతక
శబ్దయిర్నటసి మహానటభో!
ధరికిట కిటతక - ధిరికిట కిటతక
తాండవవినోది!
ఝేకిట ఝెంతరి - ఝెణకిణ ఝెంతరి
నందివాహనా నాగభూషణ॥
గుబ గుబ పొగలతో గరళము రాగా
గళ గళమవి కంఠంబున నిలిపిన
సాంబశివా! మహాదేవదేవా!

అని శంఖములు తప్పెటలు వాయించుచు, వీరభద్ర శరభలు నడిపి వారి శివభక్తిని ప్రకటించుకొనెడివారు.

చమత్కారము యదార్థము కూడి తదుపరి వేషము గొల్లవేషము. పగటి వేషములందలి గొల్లవేష రచనలు కొన్నిచోట్ల అచ్చ తెలుగు పదములు మరి కొన్నిచోట్ల దేశి తెలుగు అక్కడక్కడ సంస్కృత సిద్ధాంతములు గలవు. గొల్లల పుట్టుక, గొల్లల యందలి జాతులు వివరింపబడినవి. ఏ కులమువారు ఆ కులమే గొప్పదని చెప్పుకొనుటలో విశేషము లేదనియు అన్ని కులములకు కర్త పరమాత్మయైన శ్రీకృష్ణమూర్తి జన్మించిన కులముగనుక (యాదవ) గొల్ల కులమే గొప్పదనియు ఇతరుల చేత వీరు

త్రాగని చతుర్వర్ణములవారు గొల్లలు. పాలు మజ్జిగలలో నీరు కలిపిన త్రాగుదురనియు, అందువలన అగ్రజన్ములైన బ్రాహ్మణులు గూడ గొల్లవారి చేతి మజ్జిగ త్రాగుచున్నారు గనుక అన్ని మతములు, కులములకంటె గొల్లకులమే గొప్పదనిన యదార్థ వాదమును, అన్ని కులములకు కర్త వాసుదేవుడే గనుక మతముల కొరకు మనము తగువులాడ కూడదను నీతిని పండిత పామర రంజకమగునటుల యాదవకులములో జన్మించిన భాగవతుల యాదవ దాసు రచించెను. దీనిని పాలగూడెము(ఏలూరువద్ద) వగటిశేషగాంధ్రు, సున్నపు వీరయ్యగారు (19 వ శతాబ్దము మధ్యకాలమునాటివారు) వారి శిష్యులు పారంపర్యముగ ప్రదర్శించుచు వచ్చిరి.

హరి హరీ నారాయణ ఆదినారాయణ
కరుణించి మమ్మేలు కమలలోచనుడః
దేవతలు దానవులు పాలవెల్లిని తలువ
నవనీతమును దెచ్చు నళినాక్షదేవ।

ఆ అయ్యవారు త్రిపురాసుల సంహారానికి వెళుతూ వుండగా రథసీల విరిగి తెల్లబోయి కూర్చున్నాడయా, ఆ సమయములో నేను ప్రొద్దునే లేచి, నామముంచుకొని, చద్దితిని, ముంత బుజాన బెట్టుకొని చల్లో యమ్మ చల్ల అనుచుండగా ఆ గొల్లోరి పిల్లా! ఇలా రాః అని పిలిచాడు.

మాః అని వెళ్లాను. అప్పుడు చలవచేసే మజ్జిగ ఇమ్మని త్రాగి, సంతోషించి, శంఖం పూరించి, ఆ శంఖమువలె మజ్జిగ ఎప్పుడూ తెల్లగ వుండాలని దీవించి, శంఖము బహుమతి యిచ్చి మళ్లా రథసీల బిగించుకొని వెళ్లాడు. ప్రపంచాన్ని సృష్టి జేసిన బ్రహ్మదేముడే ముంగల మా మజ్జిగ త్రాగాడు. ఇక మా పుట్టుపూర్వోత్తరాలు:

వామాక్షి రేపల్లె వాడలో మేకు
కామర తంపతై తనరి యుండుదుము

మా కులంబునను శ్రీ మధుసూదనుండు
శ్రీకృష్ణుడై పుట్టి చెన్నొందె గనుక
పరమేశ్వరుడు గొల్ల పరమేష్టి గొల్ల
సోదరి ధర్మజుడు నర్జునుడును గొల్ల
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగ ముఖ్యులు పలుగొల్లవారు

అని యీ విధంబున పరమేశ్వరుడు, పరబ్రహ్మ సూర్యాది దేవతలు, అర్జునాదులు గొల్లవారైన కారణమేమంటే —

పరగుహరియైన కృష్ణుని బావ గనుక
నతని నాభిని నుదయించు సుతుడు గనుక
సందె యందలి విష్ణుత్వ మొందె గనుక
మరియు కృష్ణునిచెల్లెలి మగడు గనుక

ఆ అయ్యవారు ఇవన్నియు ఇలా వుండగా ఏ కులమువారైతేనేమి. అందరికి

ఫలస్య కారణం పుష్పం
ఫలం పుష్ప వినాశకం
జ్ఞానస్య కారణం కర్మ
జ్ఞానం కర్మ వినాశకం॥

అని చెప్పిన విధముగ చెట్టునకు మొగ్గలు పై చి, ఆ మొగ్గలు చక్కటి పువ్వులుగా పుష్పించి, ఆ పుష్పములే పసికాయలై సంతట పుష్పములు రాలిపోయి కాయలు ఫలించును. అదే విధముగ మానవ జీవితమనెడు మహా వృక్షమునకు, కర్మలచే సంక్రమించిన కష్ట సుఖములు అనుభవించిన పిమ్మట జ్ఞానోదయము కలిగి సంసారేచ్ఛయను పుష్పములు రాలిపోయి వైరాగ్య మేర్పడును. దానివలన ఇచ్ఛా విశేషములు నశించిపోయి పరమాత్మలో కలియు ను. ప్రపంచ మంతయు గొల్లమయమని హేళన ేసిన గొల్లెత "జ్ఞానోదయము వలన కర్మ నాశన వ ను

గనుక వెట్టిగొల్లలని చెప్పబడే గొల్లవారేగాక జ్ఞానము లేని ఏకులజులైనను వెట్టివారేననియు జ్ఞానము కలిగిన గొల్లలైన ఉత్తమజాతి వారనియు చెప్పును.

పాములవాని వేషము, నాగిని నృత్యములు గూడ పగటివేషములలో ప్రసిద్ధములు. వీనిలో తంజావూరును పరిపాలించిన విజయరాఘవుని ఆస్థానములో ప్రదర్శించుచు వచ్చిన పాముల ఆటలలో గూడిన ప్రబంధ నృత్యము ఉలూపి - అర్జునుల నాట్యము దీనిలో పాములను కట్టుమంత్రములు- పాము కాటునకు వైద్యములు, పాములలోని జాతులు గూడ వివరింపబడినవి.

ఉలూపి - అర్జున

శబ్దము:-

భళి భళిర భళిర - భళి భళిర
శ్రీ విజయరాఘవ భళిర
రూపమున మన్మథుడవేర
శారదాపీఠ సంస్థాపక భళిభళిర
దాన రాధేయ - రాజ బహద్దర్
శభాష్ - సలాం

హే మాధవీ తక్షక రాజ పుత్రియైన ఉలూపి అను నాగిని మిసమిసలాడు మేనితో, పట్టుపీతాంబరముల కాంతితో నాగకన్య నృత్యము సలుపువిధ మెట్టిదనిన.

నాగ దిగరా! నాగన్నా దిగరా
ముదముతో రేపల్లె ముద్దుల నాగా
నాగా దిగరా

దరువు:-

ఉవిద వచ్చెను - ఉలూపి వచ్చెను
చర చరమని - ఘన ఘనమని
సుర సుర యరుగులు తడబడ
సర సరమని, సరసుని వెదకుచు

అర్జునునితో క్రీడలనాడు ఉలూపి - తనపాముల జాతి, అందు అపాయమైనవి, నిరపాయమైనవి, వానికి కట్టు కాటునకు మందుఇకూడ చెప్పును. తెల్ల ఈశ్వరీ వేరును తాపేతుగా కట్టుకొనిన పాములు దరిజేరవనియును, వసకొమ్ము ధూపము వేసిన యెడల శత్రుపాములు దరిజేరవనియు, పాము కాటునకు సున్నము పొగాకు రసము మందుగావేసిన విషము విరుగుడుగా నగుననియు చెప్పును. తన రాజ సౌధములోని పహరాలు కాయుచున్న నాగులను కట్టుటకు గరుడ మంత్రములు చదువవలెననియు, గరుడుని పేరు వినిన మాత్రమున ఎక్కడకు రమ్మని అక్కడకు పాములు తమ వశమై వచ్చుననియు అనేక విషయములను అర్జునునకు ఉలూపి బోధించుచు. పగటివేష రూపములలోనున్న నాగుల చరిత్రయైనను సామాన్య ప్రజానీకము తమకు శత్రువులైన పాముల బారినుండి సులభముగ రక్షించుకొనుటకు సామాన్యమైన రీతులిందులో గుర్తించబడినవి. తులసి, కరివేప కలిపిన మాత్రలు పాము విరుగుడునకు మంచి మందుగా తెలిపినది: గరుడుని స్మరణ పాము మంత్రముగా చెప్పినది. వేపచెక్క కషాయము నిత్యము త్రాగుచుండినను, తులసి తీర్థము దినమునకు రెండుసార్లు, (ఉదయ సాయంత్రములు) పుచ్చుకొనువారిని పాములేమియు చేయజాలవని హితోపదేశముగా సలిపిన వాక్యములకు జడధారిగానున్న పాండవ మధ్యముండైన

కిరీటి-దరువు :-

బాలా, హేమచేల, నాగేల, నిస్వీదబాల
నే వారాయణాయంచు తులసీ సేవించువాడ

ఓహో! అటులనా

దరువు :-

మీసాలవారెల్ల గ్రాసాలకొరకే
యెరుగనా మీవంటి కొంటెసన్యాసులను
ఆ రామములుదాటి ఈ రామయింటికి
యేరామ యనుకొనియుంటివిన్నాళ్ళు

అని హేళనగ మాట్లాడును.

సంగీత, సాహిత్య, జానపద, వైద్యము మున్నగు అనేక అంశములతో ప్రదర్శింపబడు ఈ నాట్యము ఆంధ్రులలో ప్రదర్శించెడు వారరుదైరి. రీటాదేవి మాత్రము కొంతభాగ మిటీవల ప్రదర్శించు చున్నది. ఆమె ఈ నాట్యము తమ విదేశ పర్యటనలలోకూడ ప్రదర్శించి విదేశీయుల మన్ననల బొందినది.

ఇంకను బుడబుక్కలవాని వేషము, యెరుకలసాని వేషములుగూడ తెనుగునాట పగటి వేషములలో ప్రసిద్ధములు. యెరుకలసాని దేశములో తాను యేయే తీర్థములు చూచినది, అందలి విశేషములు వర్ణించుచు. హస్త సాముద్రికములు ముఖరేఖలు వాని ఫలితములు చెప్పును. దీనిలో సాముద్రిక, పుట్టుమచ్చల శాస్త్రముగూడ వచ్చును.

ఇది వజ్రరేఖ : అవ్వోయప్పొ దీనగలుంగు శుభము నీకు
ఇది గృహరేఖ: దీన అష్టసిద్ధిగలుగు పార్వతి నీయింట బండి పెట్టింది.
ఇది శంఖరేఖ : దీనికే నీయింట పాడిపంటలు గలుగు
ఇది చక్రరేఖ : ఏకచక్రము భోగము—
రెండు చక్రములు రాజపూజితమవ్వ
చక్రములు మూడు మజగములు
తిరుగుతావవ్వ

నాల్గు చక్రాలు వేదాలు విద్యలబ్బు
అయిదు వేళ్ళకు చక్రాలు అంబుజాక్షి

అందలమెక్కించగ బొదు వోయవ్వ. పగటి వేషములందలి మగనాలి తగవులు (రాధాకృష్ణులు) నిందాస్తుతులు, అవి యదార్థములయ్యును పండిత పామర రంజకము బొందుటకు నిందాస్తులుగ వ్రాయబడినవి.

దరువులు :-

రాగము :- జంఝూటి

రాధ :-

ఆ విపరచారి-మనుమకు జడధారి - మరిది
క్షీణాకారి: కొడుకు జారి-మామచోరి
పడగనీయన్న హలధారి పరమపురుష
నేడు నన్నేలు నీ సిగ్గు గాపాడుకొనుము

కృష్ణుడు సమాధానము :-

దరువు-రాగము:-, కాంభోజి.
ఆలి అపదలలో నాదరించు, మనుమడు
నారదమౌని.
మరిది చంద్రుడు, కొడుకు సంపంగిమన్న
మామ భోజనములకు రుచించు క్షీరమిచ్చు
పరగనాయన్న భూమిని ఫలింపజేయు
రపకాగ్ని పై పలుకుచేలనో! చాలుపో!
రాజవదన—

ఇవియన్నియుగాక పగటివేషములలో యింకను వేగులవారని మందులవారి వేషములని. కోయవారని దాదాపు సంప్రదాయసిద్ధమైనవి ముప్పదిరెండు వేషములుగలవు. ఆనోట ఆనోటబడి యీ అంశము లిటీవల చాల తప్పులు గలవిగా ప్రదర్శింపబడు చున్నవి. నాట్యకలయందు ఉత్సాహవంతులైనవారు కూచిపూడివాసులవద్దగాని శ్రీరామపురము, పాలగూడెము వారివద్దగాని, సజీవములుగ తప్పులులేకుండ అభ్యసించి తగిన పద్ధతులలో పగటి వేషములుగా కాగ, రంగస్థల అంశములుగ ప్రదర్శించేయెడల మరల యథాస్థితిలో ప్రజాదరణమును బొందుటకు సందేహములేదు.

# కళాభ్యుదయ పరిణామములు

రూపనగుడి నారాయణరావు

ఆర్యులాదిమ జనులు కారు; వారు నాగరకులు. వారు సింధు నదిని దాటి యార్యావర్తమును నాక్రమించుట కొన్నేండ్లకు పూర్వమే, వేదములు పుట్టినవి. వేదములు పౌరుషేయములని చెప్పుదురు. వేదములను రచించినవారు సామాన్యమగు మానవ బుద్ధిచే ప్రబోధితులు గాక, యంతరుత్పన్నమగు ప్రజ్ఞానమునకు భగవదనుగ్రహము తోడుపడగా బొడమిన దివ్యప్రజ్ఞతో వానిని రచింపగలిగినవారు; వానిని రచించిన మహర్షి బృందము మానవదేహముతో గోచరించు భగవంతుడే యగును. కనుకనే వేదములు పౌరుషేయములని ప్రసిద్ధి. వేద ఋక్కులను రచించినవారు మంత్రకర్తలనబడక మంత ద్రష్టలనంబడుదురు.

హైందవార్యులనాగరకులు గాక ప్రతిభోన్నతులై యుండిరి. ఆర్యశబ్దమే వారి సంస్కృతిని సూచించుచున్నది. వీరు మధ్యాసియానుండి వచ్చినట్లు చరిత్రకారులు నుడువరాదు; 'తిలకు' మహాశయుడు ఉత్తరధృవ మండలమునుండి వచ్చిరని వచించువారు. ఎక్కడనుంచి వచ్చినను వీరి సంఖ్య యధికము కాగా, శ్రుతిపాఠంపర్యముగా వచ్చు వేదములనే యాధారము చేసికొని కళలను వికసింప జేసిరి. ఋగ్వేదమునుండి సంవాదమును (Dialogue), వాద్యమును, యజుర్వేదమునుండి యభినయమును; సామవేదమునుండి గానమును; అధర్వవేదమునుండి రసమును గ్రహింపగలిగిరి. ఇట్లు తాము గ్రహించిన గత నృత్య, వాద్య, గానరసములను మేళవించి సంగీత విద్యను గనుగొనిరి. మతవేదములు ఛందోబద్ధములు. అంతేకాక వేదఋక్కులందు గవిత్వము గోచరించును. ఇందలి కవిత్వమే యాది లౌకిక కవిత్వమున కాదర్శకమై యుద్బోధకమయ్యెను. వేదములందు చిత్రకళా ప్రశంస లున్నవి. కావున హైందవ చిత్రకళాభ్యుదయమునకును వేదములే యాధారభూతములు. వేదములు విరాటస్వరూపుని విశ్వావన అనగా భగవచ్ఛక్తిస్వరూపములు కావున సర్వమున కవియాధారభూతములు. భగవచ్ఛక్తి వలననే ఇంద్రియములు ఇంద్రియార్థములనగు స్పర్శశబ్ద రూప రస గంధములు, మనస్సు, జ్ఞానము, చైతన్యము - సర్వము సముత్పన్నమైనదని హిందువు లంగీకరించువారు. హైందవకళా శిల్పాభ్యుదయమునకు వేదమో లేక విశ్వకర్మయో యాధారమని చెప్పినచో పాశ్చాత్య కళాభ్యుదయమునకు ఏది యాధారభూతమని చెప్పవలయును. సర్వమునకు గారణమైన యొకానొక యాదిశక్తియె సకల కళాభ్యుదయమునకును గారణమని చెప్పుటవలన మనము మూలకారణముల గూర్చి యెక్కువగా తెలిసికొన్నవారమగుట లేదు. అనురాగరసమునం దేలుచున్న క్రౌంచ మిధునమందొక దానిని వ్యాధుడు గూల్చినప్పుడు, ఆ దృశ్యముంజూచిన వాల్మీకి హృదయము ద్వేగయుతమై, ఆ యుద్వేగము లయాన్వితమగు శ్లోకరూపమున బయలు వెడలెనను గాథ.

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠామ్త్వమగ దుశ్శీర్వస్సమాః
యత్క్రౌంచ మిధునాదేకమ్ అవధీః కామ
మోహితమ్

గాన కవిత్వాభ్యుదయమునకు, ఇక్కాని మూల కారణమును దెల్పుచున్నది. ఈ గాధవలన దేటపడు విషయములను వేఱు కొన్ని నిదర్శనములంగైకొని వివరింప గడంగెదము.

గానము :—

తల్లి యొడిలోని శిశువునకు రంగుల గిలకను జూపినప్పుడు, అది నవ్వుచు జెంగనలు వెట్టును. ఇంత దప్పటడుగులిడు శిశువు క్రొత్త కుక్కను గాంచుచో, భయమున నఱచుచు దల్లి పజ్జకు బరుగిడును. అడవిలోని నెలుగుబంటిని గాంచిన బాటసారి దిగులున గెలార్చుచుదాటిపోవును. తలుగు గొలికి సడలింపబడిన దూడ యుల్లాసముతో 'అంబా' యని యఱచుచు గంతులు వైచును. రణరంగమున గురు సేనలం గనుగొన్న యుత్తరుడు "గడుపాఱిన మేనును, దలకు మనమును, జిచ్చపడిన చూపునునై తొట్రుపడుచు, దిసలు సొచ్చి బృహన్నలతో, 'దేరు మరల్పు. ప్రాణములు తీపు' అని నుడివెను. కీచకుడు కావించిన యవమానంబునకు సంతప్త హృదయ యగు ద్రౌపది రాత్రి వంటయింట నిద్రించుచున్న భీమునికడకు జని మంద మంద భాషణంబుల నతని సంబోధించెను. ఈ నిదర్శనములంబట్టి చూడ హర్షామర్ష శోక భయాది మనోవికారములు గలిగినప్పుడు దేహమందలి కొన్ని కండరంబులు సంకోచించి, స్వరభేదములను, ఇంగచేష్టలను గలిగించుచుండుననుట స్పష్టము. మనసునకుల్లాసము గలిగి మనుష్యుడు నవ్వును, కేకలు వేయును, కేకిసలు గొట్టును; కోపము గలిగినప్పుడు, మోమును నేత్రములను నెఱ్ఱనగును. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు తీవ్రమగును. గుండెదడ హెచ్చును. కంఠస్వరము బిగ్గరయగును. శోకతప్తయగు స్త్రీ తన రొమ్ము మోదుకొనుచు బనలి వనలి యేడ్చును. భయమువలన వైవర్ణ్యము, వణకు, స్తంభము, పలాయనము కంఠ గద్గదము కలుగును. ఈ బాహ్య చిహ్నములకనుభావములని పేరు. ఈ బాహ్యచిహ్నములన్నియు దేహమందలి కండర చలనములవలననె కల్గుచుండును. రొమ్మును (Chest) స్వరపేటికను (Larynx) కంఠనాళములను గదలించు కండరములు మనోవికార తీవ్రతలుంబట్టి సంకోచమందుచుండును. ఈ కండర సంకోచ భేదముల బట్టి యుచ్చనీచ సమాన స్వర భేదముల నందుచుండును. కావుననే రసభావములు తీవ్రమైనప్పుడు కంఠస్వరము సైతము తీవ్రమగుచుండును. హర్షామర్షాశ్చర్య భయములు గలిగినప్పుడు ధ్వని యుచ్చగతినొంది మాటలు గట్టిగను, అనునాద యుతముగను (Sonorous) కంచు మ్రోగినట్లు వెల్వడుచుండును. రహస్యములు పల్కునప్పుడు [రహస్యము పల్కుటయు నొక యావేగ వశముననె కావున) ధ్వని నీచగతిని బొంది మాటలు గుసగుసలు వోవును. సామాన్య సంభాషణమునందెట్టి యావేగమును లేకపోవుటవలన ధ్వని సమానగతిని నుండి, తత్సంభాషణము శ్రమరహితమై యుండును. ఉచ్చనీచగతులందు బయలువెడలు వాక్కులు ఆవేశపూర్ణములై యుండుటవలన శ్రమైక సాధ్యములై యుండును.

ఆవేశమనగా మనోవికారము. ఇది కలిగినప్పుడు భాషణము ఉచ్చనీచ గతుల బొందుచుండునట్లే, రాగము సైతము మనస్సునందుఁ బొడమిన యావేగము ననుసరించి యుచ్చనీచ గతుల నందుచుండును. కావున శృంగారాది రసముల కాశ్రయభూతములగు హర్షామర్షాది భావములను ప్రకాశపఱచునదై నియత నియమములతో గూడిన స్వరసమ్మేళనమే గానము. మానవుల యాయా భావ ప్రభేదములంబట్టియు,

వాని యతిశయముల బట్టియు స్వరము మంద్ర మధ్యతారము లనెడి స్థాయి భేదములను ఆరోహణావరోహణగతులను బొందుచుండును.

ఈ స్వరగతి ప్రభేదములె శాఖోపశాఖలుగా పెరిగిన గానవృక్షమునకు బీజాంకురము. ఈ స్వరగతి భేదముల యావిష్కరణము చిత్తావేగమునకును గుణముగానుండుట యవశ్యము గావున గీతముసుందర పదనిబద్ధమై, ఆ గీతమును ప్రకాశపరచు రాగ మా గీతమందలి రసభావద్యోతకమునకు ననురూపమై యుండవలయును. అప్పుడే యది యాహ్లాదజనకమై యుండును. సంగీతమును ప్రేరేచుటకుఁ జాలినంత రసపోషకములు కాని భావములను గీతములందు బొందుపరచి యట్టి గీతములను బాడగరంగుటవలనను, భావములు రససంవర్ధకములై యుండియు వానికినురూపములుగాని పదములంగూర్చి గీతము లల్లుట వలనను నెట్టి ప్రయోజనము నుండదు. ఇట్టి గీతములు స్వాభావికములు గావున శాస్త్రీయములై అశాస్త్రీయములు గావున నసమీచీనంబులై యుండును. వైద్య జ్యోతిషాది గ్రంథములందలి శ్లోకములిందులకు నిదర్శనములు. అనురూప స్వభావ సమ్మేళనము గలిగి గేయమానములుగ నుండు గేయంబులే యత్యుత్తమములైనవి.

గానాభినయాది కళలు బహు ప్రాచీన కాలమునుండి మన భారతదేశమునందాదృతి గాంచుచున్నవి. తుంబుర, నారదులు, రంభాద్యప్సరసలు గాన నాట్యములం దారితేఱిన వారలెకదా. అర్జునుఁడు విరాటరాజ తనయయగునుత్తరకునాట్యమును నేర్పినట్లుభారతము నందుఁ జదువుచున్నాము. మౌర్యుల కాలమందు ఉత్తర హిందూస్థానమున గానాదికళలు, శిల్పములు వతిశయించినట్లే, దక్షిణమున జోళపాండ్య రాష్ట్రములందు వర్తమాన కాలమున గానాది కళలు శిల్పములు [illegible] యుండెను. ఆంధ్రులు సంగీత నాట్య చిత్ర [illegible] కళలయం దాదరము కలవారని 'గాథా సప్తశతి' లోని యనేక గాథలు నుడువుచున్నవి. గుప్తుల కాలమున [క్రీ. శ. 330-600] సకల కళలకును నుత్తేజనం బుండెను. సముద్రగుప్తుడు సంగీత సాహిత్యములందు మిక్కిలి ప్రవీణుడై "కవిరాజ" అను బిరుదు వహించెను. విక్రమాదిత్య శ్రీ హర్షుల కాలములందును, తరువాత రాజపుత్రుల కాలమందును గానాది కళల కాదర ప్రోత్సాహములుండెను. జయదేవుఁడు 'గీతగోవింద'మను గేయ గ్రంథమును పండ్రెండవ శతాబ్ద్యారంభమున రచించెను. అజంతా, సాంచీ యందలి చిత్రము లాకాలమందలి రాజన్యుల సంగీత నాట్యాది కళల కెంత ప్రోత్సాహమొసంగిరో వెల్లడి చేయుచున్నవి. 'శివకవులు' రచించిన "శివతత్త్వసారము" "బసవ పురాణము" "పండితారాధ్య చరిత్రము" "పల్నాటి వీరచరిత్రము" మున్నగు గ్రంథములం జదువ గాకతీయుల రాజ్యపాలనమునందు సంగీత నాట్యకళల కధిక ప్రాప్తియు, జనాదరమును నుండినట్లు తెలియుచున్నది. 'గురునానకు' (1469-1539) గానము చేయుచు జనులకుఁ బ్రబోధించుచుండెను, శ్రీకృష్ణదేవరాయల కాలమందును దానికిఁ బూర్వాపరములందును కళలకు బ్రోత్సాహముండినది. 'రామరాజ భూషణకవి' "సంగీత కళా రహస్యనిధి"యై యుండెను. మొగల్ చక్రవర్తులును కళాభివృద్ధికిఁ బాటుపడినవారె, బాబరు కవియు, గాన కళాభిజ్ఞుడునై యుండెను. హుమయూన్, అక్బరు, జహంగీరు పాదుషాలు గానచిత్ర కళలను, స్థాపత్యమును మిక్కిలి ప్రోత్సహించినవారు. ఔరంగజేబొక్కఁడే రాగవిరాగియై యుండెను షర్షా సైతము గానాభిజ్ఞుఁడై యుండెను. అక్బరు గేయములను దానే రచించి తానే పాడుచుండెడివాఁడు. అతని యాస్థానమునఁ బెక్కండ్రు గాయకగాయను లుండిరి, వారిలో 'తాన్‌సేన్' (ధనసేనుడు) ప్రఖ్యాతి గాంచిన గాయకుఁడు. ఇతఁడు హిందువుగానుండి మసల్మాను మతమును స్వీకరించినవాడు. ఇతడు గానాలాపము చేసి మత్తిల్లిన ఏనుగును సాదుచేయగల్గెను. మఱి మేఘ

రంజిని, మలయమారుతము అను రాగముల నాలాపము చేసి మేఘములు గర్జించునట్లును, చల్లగాలి వీచునట్లును జేయుచుండెనట. అక్బరు కాలమున గానకళాభిజ్ఞురాలును, భక్తురాలును నగు రాణీ మీరాబాయి యుండినది. అక్బరునకు గానరసాస్వాదన ప్రీతి యధికముగా నుండినదనుటకు కీ కథ నిదర్శనమై యున్నది. అక్బరు చక్రవర్తి యొక సామాన్య హైందవ పౌరుని వేషము వేసుకొని, తన యాస్థాన గాయకుడగు 'తాన్‌సేన్‌ని' వెంటగొని, మీరాబాయి భక్తిగానమును వినుటకై హైందవాలయమునకు వెళ్లి, యామె పరవశత్వమున జిలుకు గానరసమును గ్రోలి కృష్ణుడై తన కంఠమందలి రత్నాలసరమును పుష్పమాలతో జేర్చి యామె దోసెను విడెనట. పీష్వాల కాలమందును కళలకు వెనుబాటు కలుగలేదు. కర్నాటక గానకళను నభివృద్ధిచేసిన త్యాగయ్యగారును బందొమ్మిదవ శతాబ్ద్యారంభమున నుండిన వారె. విదేశీయులైన యాంగ్లేయుల ప్రభుత్వకాలమున గళలకంతగా ప్రోత్సాహముండలేదు. అప్పుడు కళాభివృద్ధియంతయు ప్రజలమీదనే యాధారపడియుండెను. 'సినిమాలు' వచ్చినతరువాత జనులకు గానరసాస్వాదనాపేక్ష యతిశయించి, ఇప్పుడిప్పుడు స్వరాజ్యము వచ్చుటవలనను, రేడియోల సంఖ్య హెచ్చుట వలనను కళోత్సాహము ప్రబలుచున్నది.

**అభినయము — నాట్యము**

ఉపన్యాసకుల భాషణధోరణి వారి చిత్తావేగముల బట్టి మారుచుండును. ఒక ప్రవక్తచేయు నుపన్యాసమును వినుచో, అభిరుచిలేని సామాన్య విషయముల గూర్చి పలుకునప్పు డతని స్వరము కాల్వయందలి జలమువలె నావేగము లేక తిన్నగా బారుచుండును. ఉదాత్తవిషయములగూర్చి వక్కాణించునప్పు డతడు ఆవేశవ్యగ్రుడై యుండి చూపుల రువ్వును, చేతల త్రిప్పును, చిందుల ద్రొక్కును; మఱియు నతని కంఠస్వరము ఉచ్చగతిని బొంది సముద్రమందలి యలలవలె కాలపరిమాణగతులతో స్పందించుచుండును. ఈకాలపరిమాణగతులే యేక త్రిపుటరూపకాది వివిధ తాళగతులకు మూలములు. ఈ తాళగతుల నాశ్రయించి యభినయమును, రతిభ్రేరణీ దండలాసకాది నృత్య భేదములను నుద్భవించెను.

అవస్థానుకరణమె అభినయము. అభినయము చతుర్విధము. ఆహార్యము: వాచికము, ఆంగికము, సాత్వికము అని. భూషణాదులచే గలిగినది యాహార్యము, వాక్కులచే గల్గినది వాచికము అంగ విన్యాసముచే గల్గినది యాంగికము. సత్వము చే రోమాంచాదికముచే గల్గినది సాత్వికము. ఈ చతుర్విధాభినయముల వలన భావార్థములు దజ్జన్యరసంబులు బ్రకటింప బడుచుండును. అభినయమునకు లోకమే ప్రమాణము.

నటరాజయిన పరమేశ్వరుడు నాట్యమునకు మూలపురుషుడు. నాట్యకళయందు బ్రసిద్ధులు బ్రహ్మ, మాధవుడు నందికేశ్వరుడు, నారదుడు యాజ్ఞవల్క్యుడు హనుమంతుడు, విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు, రావణుడు, రంభాద్యప్సరసలు ఉత్తరమున్నగు వారెందరో యుండిరి.

మన భారత గ్రంథమును బట్టి చూచినను, సంస్కృత నాటకములబట్టి విచారించినను, ఆ యా కాలములందు నాట్యకళకు బ్రోత్సాహముండినట్లు తెలియుచున్నది. మధ్యకాలమున నది కొంత యధఃస్థితిగాంచి యుండినను, ఇప్పుడు తలయెత్తుచున్నది. వంగదేశమునను, దక్షిణా పథమునను, భరతశాస్త్ర ప్రకారము భావరాగతాళములతో గూడిన నాట్యము వాడుకలో నున్నది. కేరళదేశములో భావతాళ ప్రధానమైన 'కథాకలి'యను నామమున నాట్యము వెలయుచున్నది. గుజరాతునందు భావరాగ ప్రధానమైన 'గర్భా' నాట్యమువలె దెక్కువగా స్త్రీలే వాడ్గొను

చున్నారు. వీరు రాసక్రీడ, గోపికా వస్త్రాపహరణము మున్నగు మధుర రసకలితములైన విషయములను గూడ నభినయించి శృంగార రసము మొలికింప జేయుచుందురు. అస్సాములో రాగతాళము లంతగా లేక భావము మాత్రము ప్రధానముగాగల 'మణిపురా' నృత్తము వ్యాప్తిలో నున్నది. ఇందు మూకాభినయ మెక్కువగా నుండును. గాన విధి యధికతర భావనాశక్తి నపేక్షించునదై యున్నది; ఈనృత్యము కేవలసాంకేతికమై యుండును. కోయలు, ఎఱుకలు, లంబాడీలు, దోయలు, కాపులు మున్నగు గ్రామ్య జనులు పండగలందును, పెండ్లిండ్ల యందును, తేరు తిరునాళ్లయందును కోలాటము వేయుచు, చిందులు త్రొక్కుచు, పాటలు పాడుచు దమనాట్యాభిలాషను నావిష్కరించుచుండుట మనము చూడగలము.

మన దేశమందలి వంగ మహా రాష్ట్రాది ప్రాంతములలో నాట్యము గౌరవ దృష్టితో జూడబడుట చేత సత్కులీన బాలికలు నవయువతులు నాట్య కళాభ్యాస కుతూహలాయత్తచిత్తలై యున్నారు. పురుషులును ననేకు లున్నారు. వీరిలో బలువురు భరతనాట్య శాస్త్రాభిజ్ఞులే కాక అజంతాలోని నృత్త చిత్రములను లోకమును గమనించి తమ నాట్యకళను నభివృద్ధి చేసికొన్నవారలయియున్నారు. వీరు గానసమ్మిళితమగు నాట్యముతోడనే రమణీయముగా భావప్రదర్శనము చేయగలుగు చున్నారు.

ఆంధ్రదేశము నాట్యకళాభివృద్ధియందు చాల వెనుకబడియున్నది. ఆంధ్రజనుల దృష్టి నాట్యకళ మీద నింకను బడకుండుట చింత్యము. విద్యాశాలలలో బాలికలకు నాట్యకళను నేర్పుబానుట యత్యావశ్యకము. ఇటీవల బాలికా పాఠశాలలందు నాట్యకళ కొద్దిగా బోధింపబడుట శుభసూచకము.

గానమును, సంవాదమును, అభినయమును, అనుకృతిని మేళవించి, వానిని సాహిత్య సూత్రములకు బొందుపరచి కవులు నాటకములను రచింపగల్గిరి; అనగా ప్రత్యేకకళలై యున్న సంగీతము, నాట్యము, కవిత్వము నభివృద్ధిగాంచినప్పుడు అవి యొక్కచో గూర్పబడగా నాటక మాయెను. సంస్కృత నాటకములు గ్రీకు నాటకముల సంపర్కమువలనగాక స్వతంత్రముగనే యుద్భవించినవని 'బాబు శ్యామసుందర దాసు' మొదలగు పండితుల యభిప్రాయమై యున్నది. 'అమృత మథన'మను నాటకమును దేవతలాడిరట, కంసవధ, ప్రలంబవధ, బాణాసురమర్దనము అను నాటకము లప్సరసలచే ప్రదర్శింపబడినవని 'పతంజలి' చెప్పుచున్నాడు. క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్దికి బూర్వముండిన భరతముని తన నాట్య శాస్త్రములో నాట్య రంగమును, రచింపు పద్ధతులను వచించినాడు. 'పాణిని' 'శిలాలీ కృశాశ్వు'లను నాటక కర్తల పేళ్లను నుదహరించి యున్నాడు. కనుక భారతీయ రూపక రచనా సరణి పాణిని. పతంజలుల కాలము నాటికే యనగా క్రీ॥ పూ॥ రెండవ శతాబ్ది యందు సంపూర్ణముగ నేర్పడియుండెను. శ్రీ పురాణము సూరి శాస్త్రిగారు తమ "నాట్యోత్పత్తి" యందిట్లు నుడువుచున్నాడు. "మహావీర"స్వామికి రెండు వందల సంవత్సరముల పిదప నివసించిన 'భద్రబాహు' స్వామి రచించిన కల్ప సూత్రములలో నీ క్రింది కథను నుదహరించియున్నాడు. ఒక సాధు శిష్యుడు గురుసన్నిధానమున కాలస్యముగ జేరెను. ఏల నీ జాగని గురువడుగ 'దారిని నాట్యావలోకమున గొంతతడవయ్యె'నని యంతేవాసి సమాధానమిడెను. అందున గురువు 'నటులు ప్రయోగించెడి నాటకాదులను సాధకులు చూడగూడ'దని వారించెను. మఱి యొకసారి యిటులనే నటీ ప్రయుక్త రూపక మవలోకించి కాలయాపన మొనర్చి వచ్చిన శిష్యుడు నట

ప్రయుక్తమైనను, నటీ ప్రయుక్తమైనను. రూపక విలోకనము సాధువులకు గర్హ్యమగునని వారింపబడెను. ఈసంగతుల బట్టిచూడ క్రీస్తు పుట్టుటకనేక శతాబ్దులకు బూర్వమె యార్యావర్తమున నటీ నట ప్రయుక్తములగు నాటకములు వీధులలో నాడబడుచుండెనని తెలుచున్నది.

నాట్యము, చిత్రరచన, సంగీతము మున్నగు కళల యందు గౌతమబుద్ధున కభిమానముండినట్లు 'లలిత విస్తార' మను బుద్ధ జీవిత చరిత్రమందు జెప్పబడినది. బుద్ధుని సమకాలకుడగు బింబిసార ప్రభుని యెదుట నొక దాక్షిణాత్యుడు బుద్ధుని జీవిత నాటకమును బ్రదర్శించినట్లు తెలుపబడి యున్నది. శోభావతీ నగరాధీశుని సమక్షమున గూడ బుద్ధ నాటకము ప్రయోగింపబడినట్లు క్రీ. శ॥ 300 వర్షము చైనా భాషలో బరివర్తింపబడిన 'ఆవరాత' శతకములో వ్రాయబడినట్లు తెలియుచున్నది. తరువాత భాస (క్రీ॥ పూ నాల్గవశతాబ్ది) సౌమిల్ల, కవిపుత్రులు నాటకములు రచించిరి. భాసుని నాటకము ఇటీవల దొరకినవి, ఇవి తెనిగింపబడినవి గూడ. సౌమిల్ల కవిపుత్రుల నాటకము లెందైననున్నవో, ఖిలమైపోయినవో కాలము చెప్పవలసి యున్నది. భాసాదుల పిదప కాళిదాస భవభూతులు తమ యతిశయ కౌశలముతో గథా కల్పనా చమత్కృతియు రసభావ సృష్టియు, పాత్రౌచితియు గల నాటకములు రచించిరి. కాళిదాసుని మూడు నాటకములలో నుత్తమమైనది శాకుంతలము. ఇందు మర్త్యస్వర్గలోకముల రెండును జోడింపబడి సన్నిహిత మొనర్పబడినవి. ఈ నాటకము జదివి 'గీటే' యను జర్మనీ దేశపుగవి యానందము పట్టలేక నాట్యము సల్పెను. ఇందు గమ్మ రసము చిప్పిలు పద్యములుండి, యవి శిలనైన గరిగింప జాలును. కాళిదాస కవి నాల్గవ శతాబ్దమొ అంతకు బూర్వముననో యుండెనని యందురు. భవభూతి యెనిమిదవ శతాబ్దిని రచించిన మూడు నాటకములలో 'నుత్తర రామచరిత' శ్రేష్ఠమైనది. శూద్రకుడు భాసుని 'చంద్రచారుదత్త'మను నాటకమును ననుసరించి 'మృచ్ఛకటిక' నాటకమును రచించెను. ఇతడు కాళిదాసుని కంటె బ్రాచీనుడని కొందఱు చరిత్ర కారులు నుడువుచున్నారు. ఈ 'మృచ్ఛకటిక' కాళిదాస భవభూతుల నాటకముల కంటె విలక్షణమైన కథాచమత్కృతి గలిగియున్నది. క్రీస్తుశకపు ఏడవ శతాబ్దపు వాడగు శ్రీ హర్ష మహారాజు 'ప్రియదర్శిక' 'నాగానందము' 'రత్నావళి'యను నాటకములను రచించెను. ఇవి కాళిదాస భవభూతుల నాటకములవలె మిక్కిలి ప్రౌఢములు కాకున్నను స్వాభావిక వర్ణనలు గలిగి కొంత గౌరవము వడసి యున్నవి. 'వేణీసంహారము'ను, విశాఖదత్తుడు 'ముద్రారాక్షసము'ను రచించిరి. ఇవియు నూతన మార్గమును ద్రొక్కవలె. ముద్రారాక్షసమున స్త్రీ పాత్రయే లేదు. అటు తరువాత బదియవ శతాబ్దిని రాజశేఖరుడు 'కర్పూర మంజరి' 'బాల రామాయణము' 'బాల భారతము' అను నాటకములను; పదునొకండవ శతాబ్దిని 'కృష్ణ మిశ్రుడు' ఆధ్యాత్మిక విషయమైన "ప్రబోధ చంద్రోదయ" నాటకమును; పదుమూడవ శతాబ్దిని 'జయదేవుడు' ప్రసన్న రాఘవ మను నాటకమును రచియించిరి. ఇవియే సంస్కృతమందు గల ప్రసిద్ధ నాటకములు.

పదుమూడవ శతాబ్దికేవలము ముసల్మానుల రాయిడికి గాదోలు నాటక ప్రయోగము లడుగంటెను. దీని ఫలముగా హిందూదేశమున నాటక రచన విరళమయ్యెను. కాని కాశీ ప్రాంతముల 'రాసలీల'లను పేరితోడను, వంగ దేశమున 'యాత్ర'లను నామముతోడను, మహారాష్ట్రమున కీర్తనలను నభిదానముతోడను, ఆంధ్ర దేశమున భాగవతగాథలను నామధేయము తోడను, శ్రీ కృష్ణ చరితలను భాగవత కథలను బ్రదర్శింపసాగిరి. ఇందు ముద్రాభినయము తాళ ప్రస్తరణము, నృత్యము ప్రధానాంశములు

జనులీ ప్రయోగముల జూచి యానందించు చుండు వారు. ఈ నాటక ప్రయోగములు "కూచిపూడి భాగవతము" లని యాంధ్ర దేశమున వెలసినవి. ప్రాచీన సంస్కృత నాటకములు, నాటకరంగముల ప్రయోగింపబడక పఠనీయములుగ మాత్రముండినవి. కాని యాంగ్లేయుల సంపర్కము వలన మన దేశమున నాంగ్ల విద్య ప్రబలగా, సంస్కృతాంగ్లనాటకములను నాదర్శములుగా గొని కవులు తమ దేశభాషలలో ననేక రూపకములను నిటీవల రచియించి వానిని ప్రయోగింప బొడంగిరి.

సంస్కృత మందలి రసవన్నాటకము లన్నియు నాంధ్ర భాషలోనికి ననువదింపబడినవి. కాని స్వతంత్ర నాటకములు తెనుగున బందొమ్మిదవశతాబ్ది తుదివరకు నుద్భవంబందలేదు. 'ఆంధ్ర వాఙ్మయ సంగ్రహము', పెక్కు ప్రాచీన స్వతంత్ర నాటకముల పేళ్లను నుడివి కొన్నిటిని నుదాహరించుచున్నది. కాని యవి యక్షగానములై యుండి రూపకములని పేరెన్నికగన్నవి కావు. పాత్రపోషణము, కథా సంవిధానముగల స్వతంత్ర రసవన్నాటకము లుండిన నవి యెందు దాగియున్నవో! సంస్కృత మందలి 'ప్రేమాభి రామము'న కనుకరణమైన 'క్రీడాభిరామ' మను వీధి నాటకమొందు తెనుగున గలదు. ఇది శ్రీనాథుని సమకాలికుడైన వినుకొండ వల్లభరాయ కృతముగాన, పదియేనవ శతాబ్ద్యారంభమున రచింపబడినదై యుండును. ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్రనాటకముగా దలపబడుచున్నది. పందొమ్మిదవ శతాబ్ద్యంతమున శ్రీ ధర్మవరము రామకృష్ణకవియు, శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారును నాంధ్రమున స్వతంత్ర నాటకములను రచించిరి. అందు మొదటి కవి 'ఆంధ్రనాటక పితామహు'డను బిరుదమును సార్థకముగ బడయగల్గెను. అటు తరువాత దెనుగున బలు నాటకము లుత్పన్నములాయెను. కాని ప్రకృతము 'సినీమా' లనబడు వాక్సహిత చలన చిత్రములు ప్రబలి నాటక ప్రదర్శనమునకును, నాటక రచనమునకును ప్రతిబంధకములై యున్నవి.

---

స్వర్గీయ రూపనగుడి నారాయణరావుగారు ప్రముఖ నాటక కర్త, విద్యావేత్త. వీరు "విప్రనారాయణ", "గౌతమ బుద్ధుడు". "సౌందర నందము" (ముద్రితములు) "కాకతీ రుద్రాంబ", "విషాద రామ రాజీవము", "క్షమాపతి విజయము", "ఉన్మత్త రాఘవము", "మొదటి సారాయిబట్టి", "త్రాగుబోతు" "బలిదానము", "మాలిని" అనే నాటకాలు, అనేక వ్యాసాలు రచించారు. వీనిలో అనేకం అముద్రితంగా ఉన్నాయి. అట్టివానిలోనిదే "కళాభ్యుదయ పరిణామములు" అనే ప్రస్తుత వ్యాసము.

# లలిత కళల ఉత్పత్తి: పరమావధి

శంకర శ్రీరామారావు

అప్పుడు పుట్టిన బిడ్డను గిల్లితే వెంటనే ముఖం చిట్లిస్తాడు. అది అభినయం—నాట్య శాస్త్రానికి నాంది. తరువాత ఏడుస్తాడు, ఆ బాధను వ్యక్తం చేస్తూ—అది సంగీతానికి తొలి నాదం. కొంచెం పెరిగాక "అమ్మా" అంటాడు. మాతృ మూర్తికి మాటలతో తన బాధను ఆర్తిగా చెప్పుకుంటూ—అది సాహిత్యానికి బాలశిక్ష—ఇది కళలకు జన్మ స్థానం.

నాట్యం అన్నిటికన్న మొదట పుట్టింది. తొలి మానవుడు నేత్ర సంజ్ఞలతో, హస్తముద్రలతో సాటి మానవులకు తన భావాన్ని వ్యక్త పరిచాడు. నవ్వులో, ఏడ్పులో నాదాన్ని పైకిలాగాడు—తరువాత కొంత ప్రౌఢత్వం అలవరించుకుని నాదాన్ని శబ్దాలుగా అల్లుకున్నాడు అర్థవంతంగా. క్రమంగా గీతలు గీసి, బొమ్మలు చేసి చిత్ర శిల్పాది కళలకు దారులు తీసుకున్నాడు.

భావ ప్రకటనతో హృదయభారం తగ్గి ఏదో అవ్యక్త మధురమైన ఆనందాన్ని అనుభవిస్తాడు మానవుడు. అది సహృదయులైన శ్రోతలకు, ప్రేక్షకులకు ప్రతిధ్వని రూపంగా, ప్రతిస్పందనంగా సంక్రమించి రసానంద మౌతుంది.

ఏ కళకైనా నిజాయతీ ఉండాలి. అది లేనిదే రసానందాన్ని పొందనూలేదు. ఇతరులకు అందించనూలేదు. దానికితోడు ప్రతిభా వ్యుత్పత్తులు. అప్పుడు కళ రాణిస్తుంది. ఒకానొక సందేశాన్ని అందిస్తుంది. చిరస్థాయిగా నిలుస్తుంది.

నాట్యానికి అందమైన శరీరం, సంగీతానికి కమ్మని కంఠం సాహిత్యానికి నిర్దుష్టమైన ఆలోచన ఉండి తీరాలి—ఇవిలేని సాధన భూమి విడిచి చేసే సాము వంటిది, అది ఒక ఎదురీత, సహజమైన ప్రతిభా మాధుర్యములు లేనిది కళలో ఔన్నత్యాన్ని సాధించడం దుర్లభం—అది తనకు, ఇతరులకు కూడా బాధాకరమైన ఒక వ్యాయామంగా పరిణమిస్తుంది.

నాట్యానికి లయ, గానానికి శ్రుతి, కవితకు ఉదాత్త భావన గుండెకాయ వంటివి. మానవుడు పూర్ణమానవుడు కావాలంటే విశ్వ సంచలనంతో లయ కలుపుకుని, విశ్వనాదంతో శ్రుతి కలుపుకుని, విశ్వ భావనతో ఆత్మభావనను లీనం చేయాలి. ఇదే లలిత కళల ప్రయోజనం.

విశ్వలయ (Rythm of life) నాట్యంతోను. విశ్వనాదం గానంతోను, విశ్వ భావన సాహిత్యంతోను సాధించాలి. ఇంకా చిత్ర శిల్ప కళలలోని రేఖా సౌందర్యంతో విశ్వ సౌందర్యాన్ని జాగ్రత్త చేసుకోవాలి.

ఈ సృష్టి చాలా అందమైనది. సౌందర్యరాశి పరమేశ్వరుడు—సౌందర్య సాధనకు ఉపాధులు లలిత కళలు—మానవుడు ఈ సౌందర్యాన్నంతను సొమ్ముచేసుకొని పరమ లక్ష్యాన్ని చేరుకోవాలి.

కళకు జీవితానికి ఉన్న సన్నిహిత సంబంధాన్ని అర్థం చేసికుని సంచరించిననాడే ఆ సౌందర్యము, ఆ ఆనందము తనవి అవుతాయి. తీర్థానికి తీర్థము ప్రసాదానికి ప్రసాదముగా వుంచితే అనుకున్నది అందక ఆభాస మాత్రమే మిగులుతుంది. ఆనందానికి బదులు అశాంతి మాత్రమే లభిస్తుంది. కళాసౌకుమార్యం, ఉదాత్తత, ఔన్నత్యం, ప్రేమ, సౌభ్రాత్రత నిత్య జీవితంలో ప్రత్యణువున ప్రతిఫలించాలి. అప్పుడు కళ ఒక తపస్సు, ఒక ఆరాధన అవుతుంది.

కవి వ్రాసింది జీవించి చూపించాలి. గాయకుడు అపశ్రుతులులేని జీవితాన్ని నడుపుకోవాలి. నాట్యకళాకోవిదుడు తన ప్రతీ చర్యలోను నిజాయతీ నింపుకోవాలి.

"సూత్రేమణి గణాయివ" అన్నట్టు ఉన్న దీ ప్రపంచం యావత్తు—ఆ ఐక్య భావనను సముద్ధరింప చేయడమే సకల కళా సౌభాగ్యం. మనుష్యులంతా మణులైతే భగవంతుడే అందర్నీ ఐక్యం చేసే సూత్రం. ఈ ప్రేమసూత్రం ప్రతిబింబించినప్పుడే కళ కళ అనిపించుకుంటుంది. అది లేనినాడు కళ ఒక స్వార్థంగానో లేక ఒక వ్యసనంగానో నిలిచి పోతుంది. అట్టిది లోక కల్యాణాత్మకం ఎలా కాగలదు?

కళలన్నిటికీ పవిత్ర లక్ష్యం ఆత్మ సాక్షాత్కారమే. ఇదే భారతీయ సంస్కృతీ దృక్పథం. అట్టి ఆత్మ సాక్షాత్కారమును పొందిన వాడే కవి. అందుకే ఋషికానివాడు కావ్యం వ్రాయకూడదన్నారు. ప్రపంచానికి తాను అందీయగల అమూల్య వస్తువేదైనా ఉన్నప్పుడు కదా వ్రాయాలి? "తనకు నీరైనా లేదు, ఇతరులకు పాలు పంచి పెడతానంటాడు" అన్నాడు కబీర్. చెప్పవలసిన సందేశమేమీలేకుండా కవిత్వం వ్రాయడం అటువంటిదే.

మానవునిలోని సౌకుమార్యాన్నంతను పైకి తీసేదీ మానవత్వాన్ని సర్వ విధముల బలపరిచేదీ మాత్రమే కళ అనిపించుకుంటుంది. కేవలం మెదడుతో చేసే వ్యాయామం కళకాదు. అందులో రసం లభించదు. రసానికి స్థానం హృదయం. హృదయగతమైన ఆవేశంలోనుంచి స్వచ్ఛంగా, స్వేచ్ఛగా, అవిచ్ఛిన్నంగా పొంగి పొరలి ప్రవహిస్తుంది రసం. అన్ని కళలకు రసావేశమే మూలం. రస హృదయంలోనుంచే ఉత్తమ కళా సృష్టి. రసాస్వాదనలోనే సహృదయుడైన మానవునకు ఆనందం.

ప్రణవం ముందు పుట్టింది. అందులోనుంచి శాస్త్రం పుట్టింది. అక్షర సముద్భవం ముందు, వ్యాకరణాది శాస్త్రాలు తరువాత—సహజంగా మానవునినుండి వెలువడిన కొన్ని ధ్వనులను, భంగిమలను దిద్ది తీర్చి పట్టాలమీద పెట్టాడు శాస్త్రకారుడు. అందుకనే "శాస్త్రం ప్రమాణం" అన్నది భగవద్గీత.

కళ ప్రధాన వస్తువును భద్రపరుచుకుంటూ కాలానుగుణ్యంగా మార్పు చెందుతూ వుంటుంది. సృష్టిస్తంభం కాదు. నిత్య చలనం దాని సహజ గుణం. ఆ సంచలనంతోనే మార్పు. మానవ సంఘంలోని మార్పు లన్నీ కళలో కనిపిస్తాయి. ఏనాటి కానాడు మానవుడు అనుభవించే కష్టసుఖాలు, అతని ఆవేదన, ఆశయాలు అన్నీ కవి హృదయంలో పోత పోసుకుని వివిధ రూపాలుగా కళా భూమికలలో ప్రత్యక్ష మౌతాయి. అందుకనే ఒకనాటి సంఘాన్ని చరిత్రకంటే కళే ప్రస్ఫుటంగా చూపిస్తుంది. చరిత్ర యుద్ధాల తేదీలు, రాచరికం

లోని మార్పులు మాత్రమే చూపిస్తుంది. కళ మానవుని ఊర్పులు, నిట్టూర్పులు వినిపింప చేస్తుంది. విద్దష్టమైన కళ అసత్యం పలకలేదు.

కళకీ, మతానికీ, దైవానికీ ఏదో అవినాభావమైన సంబంధం ఆనాదినుంచీ వస్తూనే ఉంది. మతావేశం ఒక్కొక్కప్పుడు రాక్షసత్వానికీ, హింసకు, మారణ హోమానికీ దారి తీసినా మొత్తంమీద ఉత్తమమైన కళా సృష్టికి ప్రోద్బలం చేసిందని చెప్పక తప్పదు. అజంతా ఎల్లోరా చిత్ర శిల్ప సౌందర్యమే దీనికి ప్రబల సాక్ష్యం. శైవ వైష్ణవ భక్తి ఉద్గ్రంథాలే నిదర్శనం. త్యాగరాజాది మహా భక్త గాయకుల కృతి రత్నాలే తార్కాణం.

ఏ మతమూ పరమత ద్వేషాన్ని బోధించలేదు. ఏ మతము అసత్యమాడమని చెప్పలేదు. ఏ మతము హింసకు పురిగొల్పలేదు. అన్నీ మానవైక్యతను. విశ్వమానవ సౌభ్రాత్రతను బోధించినవే. మతము పేర జరిగిన మారణ హోమాలన్నీ మానవుని దౌర్బల్యంవల్ల జరిగిన రాక్షస కృత్యాలు మాత్రమే. వాటిని మత సూత్రాలతో ముడి బెట్టడం ఆచార్య పురుషులకు మహాపరాధం చేయడమే. సాత్త్వికమైన మతావేశం కళను ఉన్నతోన్నత శిఖరాలకు ఎక్కించినమాట ముమ్మాటికీ నిజం.

ప్రచారంతో కళను అందల మెక్కించాలని ప్రయత్నించడం కళకే మహాపరాధం, అంటించే గొప్పతనం అల్పకాలం నిలవదు. సహజ ప్రతిభా సంపన్నమైన కళకు చావులేదు. ఏనాటి భారత భాగవత రామాయణాలు! ఏనాటి దేవాలయ శిల్పాలు! ఈ నాటికీ నిత్య నూతనమై సహృదయ హృదయాలకు విందు చేయడం లేదా?

ప్రతి కళకు ప్రాంతీయ భేదం తప్పదు. కొద్దో గొప్పో భరతుని నాట్య శాస్త్రం ఆధారంగా ఉద్భవించిన నాట్య కళ, భరత నాట్యం, కథాకళి, కథక్. మణిపురి ప్రాంతీయ భేదాలతో ఎంతో వైవిధ్యం సంపాదించుకుంది. అన్నిటికీ మూలం ఒక్కటే. అలాగే గానము హిందూస్థానీ. కర్ణాటక బాణీలుగా రూపులు దిద్దుకుంది. సాహిత్యమూ అంతే—తెనుగు భాషకు పద్యం ప్రధాన రూపమై వెలసింది. జావళీ నూటికి నూరుపాళ్ళు తెలుగుదనాన్ని నింపుకుంది. ఖ్యాల్. గజల్ ఇత్యాది రూపాలు హిందూస్థానీ ప్రాంతాలలో ఎంతో పలుకుబడి సంపాదించుకున్నాయి. దక్షిణాదిని కర్ణాటక సంగీత త్రిమూర్తులైన త్యాగరాజు, శ్యామశాస్త్రి, దీక్షితార్ కృతులు బహుళ వ్యాప్తినొంది సహృదయులకు అమృతభాండాలైనయి. చిత్ర కళనూ బెంగాలీ స్కూల్, మొగల్ స్కూల్ మొదలైన విభాగా లేర్పడ్డాయి. ఈ వైవిధ్యం కన్నుల పండువుగా వుంటుంది.

పాశ్చాత్య సంపర్కంతో ఇంకా కొన్ని కొత్త రీతులు మోసు లెత్తాయి. అన్ని కళలలోనూ. ప్రాచ్య ప్రాశ్చాత్య దేశాల్లోని కవులు, గాయకులు, నటులు, చిత్రకారులు, శిల్పులు ఒకరినొకరు అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. క్రొత్త క్రొత్త పోకడలు పోతున్నారు. ఒక విధమైన "Synthetic outlook" అంతటా కనిపిస్తోంది. ఇది మంచి లక్షణమే.

ఎప్పటికైనా సంస్కృతి వల్లనే ఆదర్శ పౌరుడు రూపొందాలి, విశ్వశాంతి లభించాలి. మానవైక్యత సిద్ధించాలి. "ఒక నది పోయి పోయి సముద్రంలో కలిసిపోయింది. మరొకటి అదే ప్రవహిస్తోంది. అందరి ప్రయాణం అక్కడికే" అన్నాడు కబీర్—నిజమే—అన్ని కళలకూ అదే పరమ లక్ష్యం.

సంస్కృతికి ప్రతినిధులైన కళోపాసకుల బాధ్యత అతి పవిత్రమైనది. దాని సక్రమ నిర్వహణ పైననే లోక కల్యాణం ఆధారపడి ఉన్నది.

———

అపూర్వ రాగములు :

# పున్నాగవరాళి

నూకల చినసత్యనారాయణ

శ్లో॥ మంద్రషడ్జ నిషాదోర్ధ్వ
ధైవతాంత ప్రమాణకం
స్యాత్పున్నాగ వరాళేస్తు
సగ్రహా సార్వకాలికా ।

8 మేళకర్త హనుమత్తోడి జన్యం.

మూర్ఛన :—స ని స రి గ మ ప ద
ద ప మ గ రి స ని సా

భాషాంగ రాగము, సంపూర్ణము, షడ్జగ్రహము, రక్తి రాగము. ఎల్లప్పుడును పాడదగును. రాత్రి కాలమందు శ్రేష్ఠమని కొందరి మతము.

ఈ రాగమునకు మంద్ర స్థాయి నిషాధమునకు క్రిందను, మధ్యస్థాయి ధైవతము మీదను ప్రయోగ ములు లేవు. ఒక స్థాయికే ఈ రాగము పరిమితి చెందినది.

మధ్యస్థాయి ధైవతముమీద ప్రయోగము లేదని చెప్పబడినప్పటికి ఈనాడు వాడుకలో నున్నది.

స్వర సప్తకము షడ్జమమునుండి నిషాధము వరకు పరిమితి చెందియున్నను, తారస్థాయి షడ్జ మమునుకూడ కలిపి స్థాయి అనుచున్నారు. పాశ్చాత్య సంగీతమునందుకూడ రెండు షడ్జమము లను చేరినదానికి అనగా ఎనిమిది స్వరముల Range కి Octave అని అందురు.

అటులనే నిషాధమునందు మొదలైన ఈ రాగము ధైవతముతో సరి అయినను నిషాధమునుకూడా తీసి కొనుట సమంజసము.

వీణయందు ధైవతమునందే ఈ నిషాధమును పట్టుట ఆచారమైనందున మధ్య స్థాయియందుగల నిషాధమును లెక్కలోనికి తీసికొన లేదు.

మధ్యస్థాయి యందుగల ఈ నిషాధము ఈ రాగమునకు రాగచ్ఛాయ స్వరము.

పా ని ద ని దా ప — ద ని ని దా ప అను ప్రయోగములు సాంప్రదాయ శుద్ధమైనవి. ఇందు నిషాధములు కైశిక నిషాధములు (శ్రుతులలో)

మంద్ర స్థాయియందు నిషాధము కైశిక నిషాధ మునకు ఒక శ్రుతి మించి యుండును. అనగా శ్రుతులలో 9/5 భిన్నమై యున్నది.

ఈ రాగమునందు చతుశ్రుతి రిషభము అన్య స్వరము.

ఈ రాగము జానపద రాగములనుండి శాస్త్రీయ సంగీతమున చేర్చ బడినది. ఒక స్థాయి రాగము లన్నియు. జానపద సంగీతము నుండియే వచ్చినవి. ఈ రాగమునందు జోల పాటలు, నాగ స్వరము, తమిళ కావిడిచిందు పాటలు, తిరుపుగళి పాటలు ఉన్నవి.

భైరవి రాగమునందు పంచమము గ్రహస్వరము చేసికొనినచో ఈ రాగము వచ్చును.

చతుశ్రుతి రిషభ ప్రయోగములు :—

మ గ రి గ మా — స రి గా
స రి రీ స రి స రి గా గ రి రీ సా — మా, గ గ రి రీ, ప మ గా
గ రి రీ సా —

శుద్ధ రిషభ ప్రయోగములు :—

సా మా, గ గ రి రీ సా — రి స ని స రీ సా —
సా రి రి స నీ —
రి స ని ని స రి సా రి ని సా —

రాగ రంజక ప్రయోగములు :—

పైని ఉదహరించిన ప్రయోగములు గాక
సా స మా మ ప మ ప గా రి — రి గ మ పే దా పా
పా ని ద ని దా ప

రాగచ్ఛాయ స్వరములు :—

నిషాధము, దీర్ఘశుద్ధ, రిషభము, చతుశ్రుతి రిషభము, గాంధారము.

రిషభ దైవతములు న్యాస స్వరములు కావు.

కరుణ రసము ఈ రాగమునందు కలదు. అన్నియు కోమల స్వరములే అగుటచేత— మధ్యమ శ్రుతి చేసికొని ఈ రాగమును పాడుట సౌకర్యము.

కొన్ని ప్రసిద్ధ రచనలు :—

| | | | |
|---|---|---|---|
| 1. | ఏహి అన్నపూర్ణే | ఆది | దీక్షితర్ |
| 2. | కమలాంబికాయాః | రూపకం | ,, |
| 3. | కనకశైల విహారిణి | ఆది | శ్యామశాస్త్రి |
| 4. | ఇందుకా ఈ తనువు | మిశ్రచాపు | త్యాగరాజు |
| 5. | ఏనోము | రూపకం | ,, |
| 6. | కృపా మాకేమి | మిశ్రచాపు | ,, |
| 7. | గంధము పుయ్యరుగా | ఆది | ,, |
| 8. | వినుజూచి నాలుగైదు వెలలాయె | త్రిపుట | క్షేత్రయ్య |

———

# హిందుస్థానీ ఘరానాలు

ఎం. ఆర్. శాస్త్రి

భారతీయ సంగీతము సామ వేద జన్యము. దీనిని గాంధర్వ వేద మనికూడా అంటారు.

వేదకాలములోనే సంప్రదాయములు, శాఖలు లేక మతము లనేవి ప్రచారములో నుండేవి. సామగాన శాఖలలో రాణాయణీయమనీ, కౌతుమి యనీ శాఖలు వివిధములు గలవు. ఐత్తరేయ, దాక్షిణాత్య పద్ధతులలో ఈ శాఖా భేదాలు శ్రవణ గోచరము లగుచున్నవి.

ఆలాగుననే సంగీతములోగూడ 21 శాఖలు గలవని ప్రతీతి. వీని ఆవిష్కర్తలు, భరతుడు, నారదుడు, శివుడు, హనుమంతుడు, శ్రీకృష్ణుడు మొదలగువారు. ఈ శాఖలనే మతాలనీ, బాణీలనీ, ఘరానాలనీ వేర్వేరు పేర్లతో బిలుచు చున్నారు. కాని వీటిలో ప్రస్తుతం నిలిచినవి కర్నాటక, హిందూస్థానీ బాణీ లనేవి రెండే. దక్షిణ భారతమంతా, ఆంధ్ర, ద్రవిడ, కర్నాటక, కేరళ లందు ప్రచారమందున్నది కర్నాటక బాణీ. దీనిని నారద మతము లేక కర్నాటక గాన మంటున్నారు. వింధ్యాద్రి ఉత్తర దిశగా నున్న దేశస్థు లందరికీ హిందుస్థానీ లేక హనుమన్మత మన్నది ప్రశస్తి గాంచినది. కర్నాటకు లందరికీ ప్రమాణ గ్రంథములు సంగీత మకరందం, రాగ విబోధ, స్వర మేళ కళానిధి, చతుర్దండి ప్రకాశిక ఆదిగాగలవి. శైవ మతం ప్రకారం ఔమాపత్యం లక్షణ గ్రంథంగా వ్యవహరింప బడుతున్నది. దీని ప్రకారమైతే శివుని పంచ

ముఖములనుండి అయిదు రాగాలు, పార్వతి ముఖము నుండి ఒక రాగము ఆవిర్భవించెనట.

శివశక్తి సమాయోగా ద్రాగాణాం
సంభవోభవేత్ పంచాశ్యాత్ పంచరాగాస్యుః
షష్ఠ్యస్తు గిరిజా ముఖాత్
సద్యోవక్త్రాత్తు శ్రీరాగో వామదేవాద్
వసంతకః
అఘోరాత్ భైరవో భూత్తత్పురుషాత్
పంచమోభవేత్
ఈశానాఖ్యా న్మేఘరాగో నాట్యా రంభేశివాద్
భూత్ గిరిజాయా ముఖాల్లాస్యేనట్ట
నారాయణీ భవేత్ ।

అనగా శివుని పంచముఖములనుండి శ్రీరాగ, వసంత, భైరవ, పంచమ మేఘరాగాలున్నూ, తాండవ నృత్యమున్నూ, పార్వతి ముఖమునుండి నట నారాయణ రాగము, లాస్య నృత్యము లావిర్భవించెనవి గలదు. దీనిని శ్రీ త్యాగరాయలవారు సద్యోజాతాది పంచ వక్త్రం అని కృతిలో వర్ణించినారు. ఈ రాగములనుండి అనేక ఉపరాగములు లేక జన్యము లుద్భవించినవి. ఈ మూల సిద్ధాంతమునే ప్రాచీన వాగ్గేయకారులగు హరిదాసస్వామి, బైజుబావారా, తాన్‌సేన్ ఆదిగాగలవారు పాటించినారు. రాను రాను, ప్రాచీన సంగీతాచార్యులలోనే మత భేదము లేర్పడినవి. వానినే బాణీలు లేక మతము లంటున్నారు.

16 వ శతాబ్దిలో తాన్‌సేన్ 16 వేల రాగాలమండి 200 ముఖ్య రాగాలను. 300 తాళాలమండి 92 తాళాలను గైకొని సెనియా బాణీని ఏర్పరచినట్లు చరిత్రలు చెప్పుచున్నవి.

In his Risale–Tansan the sgnificant symbolism beauty and subtlety of each raga and tala is as certained, hearing no doubt any where making music intensely popular and progressive. This is the arrangement which has been followed more or less, since and has influenced modern Hindus-thani music. Next follows the various Banis or Mathas of Dhrupad, an off spring of Prabanoha Gayan. Viz: Khandari, Gobarhari, Nohar & Dagurbani.

" బాణీచారోంకే వ్యవహార్
సునవీజే హోగుణిజన్
తబపావే యహ విద్యాసార్
రాజా గోబర్‌హారీ
ఫౌజ్‌దార్ ఖండార్ దివాన్ డాగూర్
బక్షి నోహార్" ।
కహే మియా తాన్‌సేన్.

సంస్కృత భాషలో ప్రబంధ వస్తు రూపకాది గీతములు వెలసినట్లుగా సంగీత రత్నాకరము రుజువు పరచుచున్నది. పైని వ్యవహరించిన నాలుగు బాణీలకు ప్రత్యేకంగా నాలుగు పేళ్ళున్నవి, అవి 1. గోబర్‌హరి లేక శుద్ధ బాణీ ఇది రాజు వంటిది. 2. ఖండారి లేక బేసర ఇది సేనాని వంటిది. 3. భిన్న లేక డాగూర్, ఇది మంత్రి వంటిది. 4. గోహర్ లేక సాధారణ, ఇది సేవకుని వంటిది. వీనిలో గోబర్ హరి బాణీని నేర్చిన పిమ్మట, తతిమ్మా బాణీల నభ్యసించ వలసినదని తాన్‌సేన్ ఆజ్ఞాపించెను. ఇది ప్రబంధములనుండి మారుపేరుతో జనించి నటువంటి ధృవ పదాలు, వీనికి అస్థాయి, అంతర, సంచారి, అభోగ్ అని నాలుగు అంగము లున్నవి. వీనినే ఉద్గ్రాహ, మేలాపక, ధృవ, అభోగము అన్నారు. వీనికి రాగాలప్తి, రూపకాలప్తి గలవు. గనుకనే ధృపద్ గాయకుడు "నోం తోం"తో ఆలాపన ప్రారంభించి స్థాయి నెత్తుకొని, రాగ సంచారము చేస్తూ తాళ చమత్కారమును జూపును. ఈ ధృపదులలో నితి వృత్తము సాధారణముగా దేవతా స్తోత్రములు. రాజుల వంశావళి, గుణగణాదులు. ఎక్కువగా హరిదాసస్వామి, బైజూబావరా, చింతామణి మిశ్ర తాన్‌సేన్ ఆదిగాగల సిద్ధ పురుషులు వీనిని తమ ధృపదులలో వర్ణించిరి, ధృపద్ శైలికి ప్రక్క వాద్యములు వీణ మృదంగాదులు. గనుకనే గమకాలంకార స్ఫూర్తి తాళ విన్యాసము ఎక్కువగా గోచరించును. దీనిలో సంగతులు వేయరాదనే నిబంధన గలదు. వేసినచో రాగ శుద్ధము నశించునని వారి నమ్మిక. అపార ధృపద సంగ్రహము నేడు ధృపద్ స్వరలిపి, నాద వినోద్, రాగమాల గ్రంథములలో గానవచ్చుచున్నది. ఔత్తరేయుల కు లక్షణ గ్రంధములు రాగ దర్పణము. సంగీత పారిజాతము, మారిఫుర్ నగ్మత్ ఆదిగా గలవి. ధృవద్ యొక్క చలనము స్థిరముగా నుండును, గనుక నది పామరుల నాకర్షించ లేదు. రాజుల స్వేచ్ఛాచారాలను. విలాస వృత్తిని వర్ణించు సాహిత్య ముండదు. గనుక అది రానురాను లుప్తమైనది. మొన్న మొన్నటిదాక ధృపద్ శైలిపైని ప్రార్థన గీతాలను నాటకాలలో పాడుట కది ఆచారముగ నుండినది. ఉదాహరణకు పరబ్రహ్మ పరమేశ్వర; కినార్; సీతారామచంద్ర సేవక్, ధృపద్ యొక్క ముఖ్యోప కరణములు, రాగము, తాళము, లయ విన్యాసము, సాహిత్యభావమని ధృవపడుచున్నది. పర్యాయవర్జ స్వరాలు. వాది సంవాదులు, అల్పత్వ బహుత్వము [illegible]నాత్మక తత్వములు

ద్రుపద్‌లో పూర్తిగా పాటింపబడు చున్నవి. లయ యొక్క వివిధ రూపాలు అనగా సమ. విషమ. (కువాడి) అతీత, అనాగత, గ్రహాదుల ప్రయోగము గాయకునికి శుద్ధ రాగతాళ జ్ఞానము నలవరచు చున్నవి. గనుకనే వీరు క్లిష్టమైన బ్రహ్మతాళ. రుద్రతాళ గణేశ, లక్ష్మీతాళ ఆదిగాగల వానిలో పాడి శ్రోతలను మెప్పించెడివారు. ద్రుపద్ గానక్రియలో వివిధ గమక ప్రయోగముల అవసర మున్నది. ఘన సంపుట, చచ్చుర్పుట, చాచీర్పుట ఆదితాళాల్లో గమకాలు, కాకు స్వరప్రయోగాలు, చేసినచో ద్రుపద్ గానము భావోత్పన్నమై రక్తి కట్టును. బ్రిటిష్ పరిపాలనా కాలములో హైందవ గాయకులు లక్షణ గ్రంథ పఠన ముపేక్షించి తమ యిచ్చవచ్చిన రీతుల స్వేచ్ఛగా ప్రవర్తించి పాడుటచే నానాటికి గానకళ పతనదశకు వచ్చినది. ఇంతలో అగ్నికి వాయు దేవుడు తోడైనట్లు స్వేచ్ఛాచారులగు గాయకుల ప్రవర్తనకు గ్రంథపఠనమైని ఉదాసీనత దోహద మిచ్చుటచే గానము స్వేచ్ఛావర్తియయ్యెను. మొగల్ పఠాన్ ప్రభువుల విలాస ప్రవర్తన కుచితరీతిని ఖ్యాలులను రచించి, శృంగార పదాలను కొప్పించి సర్దారంగ్, మహమ్మద్ షా రంగీలా నబాబును ప్రసన్నుని జేసెను. ఇంతకు పూర్వము అనగా 12వ శతాబ్ది ద్వితీయ భాగములో ఇంద్రప్రస్థ (ఢిల్లీ) మత స్థాపనాచార్యుడగు అమీర్ ఖుస్రూ పర్షియన్ రాగ ఫణతులను భారతీయ రాగ పునాదులపైని స్థాపించి జిల్లాఫ్ సర్పర్దా హమ్మీర్ కల్యాణి, సర్పర్దా ఆదిగా గల రాగాలను సృష్టించి భారతీయ సంగీతానికి కళంకము దెచ్చెను.

బాణీల విశిష్టత—వాని ప్రతినిధులు :

డాగూరు బాణీ : దీని సృష్టికర్త హరిదాస స్వాము. ఇతను మధురమగు వ్రజ భాషలో విష్ణు పదావళీ ప్రబంధాలను రచించి కృష్ణార్పితము గావించెను. మరియు హోలీ, ధమార్ శైలులను, రాస నృత్యమును ఆవిష్కరించెను. భక్తి ఇతని ప్రధాన రసము. ఇతని శిష్యులగు నాయక్ గోపాలు, బైజూ బావరా, తాన్‌సేన్లు ద్రుపద్ శైలి ఘనతను పెంపొందించిరి. నాయక్ బైజూ, రాజా మాన్‌సింగ్, తోమర్ గాయక శాలకు ప్రధానాచార్యత్వమును వహించి తాన్‌సేన్ వంటి దురంధర శిష్యులను తయారు జేసెను. మరియు తన ప్రేలిక యగు రాజా మాన్ పట్టపు రాణికి సంగీతమును నేర్పి గౌరవచిహ్నముగా మంగళ గుజరి, గుజరీటోడా రాగాలను సృష్టించెను. ఇతను హుమయూన్, అక్బర్ చక్రవర్తుల కాలము నాటివాడని ప్రతీతి. ఇతను ద్రుపద్‌కు రూపురేఖలను తీర్చి దిద్దెను. బహద్దర్‌షా గుజరాత్ నవాబ్ ఆస్థానములో నున్నప్పుడు హుమయూన్ నితనిని బందీ గావించెను. ఒక రాజపుత్ర సర్దార్ శిఫార్సుపై నితనిని విడుదల చేసినపుడు ఇతను "కసీనామండ్‌కే దిగర్ బతేగా నాజ్ కసీమగర్ తూ జిందాపనో అమ్మీన్ బాజ్ ఖుషీ" అను పారసీ కవితను గూర్చి చక్రవర్తిని లజ్జితుని గావించి విముక్తుడయ్యెను.

బసంత్ : ధీ — 12 మాత్రలు.

స్థాయి : చంద్రవదన మదనసార ।
సుందర సుఖ సోపనార॥

అంతరా: ఆయె ఋతురాజ ఆజా ।
సాజ సుఖ సహేరీ॥

సంచారి: గ్రీషమ బొర శిశిరకాల । ఋతు వసంత సుధరలాల । బైజూకే లన మన సుఖ రూపకే అల బేవీ।

లలత్ : జయకాళీ, కల్యాణీ, ఖప్పరధారిణీ గిరిజా ఘన శ్యామా । చండి కాముండా త్రిశూలధారిణీ.

సంచారి: జగజ్జనని, జ్వాలాముఖి, ఆదజ్యోతి, అనంతాదేవి, అన్నపూర్ణ ఆనందీ తరుణ తారిణీ జయ.

**ఆభోగ్:** హిమగిరిజా, హైమవతీ, కాశ్మీర శరద
మాత, కామరూప, కామాఖ్యా, కులజా,
బైజూ, భక్తసుఖకారిణీ:

తాన్సేను గోబర్‌దాణీ ప్రవీణుడు. ఇతను సర స్వతీ వీణ, రబాబులను ప్రచారములోనికి తెచ్చెను. ఆ కారణముచే ఇతని వంశీయులు సెనియారీ, రబాబీ, బీనకార్‌లను ఉపనామములను ధరించిరి. తాన్సేను బాణీ అతి శుద్ధమైనది. గమకప్రయుక్తమై, గాంభీర్య ధారణము చేసినది. రబాబియాలు, గాఢ బాణీ ప్రతినిధులు. నౌహర్ బాణీ ప్రవీణులు — జైపూర్ ఘరానా స్థాపకుడు మజీద్‌ఖాను — బైరాంఖాను డగర్ అతని వంశీయులు అలాబందే జక్రుద్దీనులు గొప్ప రాగాలాపన ప్రవీణులు.

**ఖందార్బాణీ:** దీని ప్రచారకుడు మిశ్రిసింగ్ (నౌబత్‌ఖాను) తాన్సేను అల్లుడు. సరస్వతి భర్త. వైణికుడు, ఇతని వంశీయుడగు వజీరుఖాను యొక్క మనుమడు, ఉస్తాద్ డబీర్ఖాను, అధునిక సుప్రసిద్ధ వీణావేత్త. ఈ బాణీలో కంపిత గమకం ప్రధానము. వీణా గమకములు ఎక్కువగా వచ్చును. అలంకారాలు పొదిగి శోభింపజేయుట.

**నోహర్‌బాణీ:** కేవలం జానపద శైలి. మిశ్ర బాణీ. ప్రస్తుతం ఖందార్బాణీ బెంగాలులో విష్ణుపూర్‌లో నున్నది. దానిలో వీరరసానికి చెందిన హుందర్, లహర్ అంగములు ఎక్కువగా నుండును. అలాపన భాగము హెచ్చు. రబాబ్ వాద్య గమకాలుండును. దీని చివరి ప్రవక్త ముహమ్మద్‌ఖాను. ఇతను ధృపద్ రబాబు ప్రవీణుడు.

ఈ బాణీకు చెందిన సుప్రసిద్ధ గాయకులు ధోండూమీరా మధనాయక్, ప్రేమదాసు, చింతామణి మిశ్ర మొదలగువారు.

బాబారాదాస్, ఖుషాలఖాను, విశ్రాంఖానులు ధృపదులు పాడినపుడు బైరాంఖాను, షాజహానులు అశ్రు బిందువులను రాల్చిరట.

### ఖ్యాలు

ఖ్యాలు (పారసీ) శబ్దానికి అర్థము మేధాశక్తి. దీనికున్న విశిష్టత ఏమనగా విలంబిత కాలంలో పల్లవి నెత్తుకొని (అంతరా) చరణంలో జాగా చేసి సంగతులను నెరవులను వేయుట మధ్య, ధృత ఖ్యాలులలో స్వరచిత్రాలను తాళానుగుణ్యంగా భిన్న గతులలో పాడుట. వీనిలో కొందరు అస్థాయి లేక పల్లవి ప్రవీణులు, తాళ శాస్త్రజ్ఞులు గలరు.

"Khyal is a beautiful synthasis of Alapana, Bolbant of Dhrupad, Tanam of Tappa & Emotional appeal of Tumri;. the Poetical Stanzas – Anthay's and Antara are very brief."

ఖ్యాలును అమీర్ ఖుస్రూ సృష్టించెనని ప్రతీతి గలదు. కాని హైందవ ప్రాచీన సాధారణ గీతి, భిన్నగతుల మిశ్రణచే ఉద్భవించినదే. అధునిక ఖ్యాలు మధ్యయుగంలో రూప కాలప్తిలో స్వేచ్ఛగా స్వరప్రస్తరణ జేయుట కవకాశ మిచ్చినది. కర్నాటక పల్లవి. హిందూస్థానీ ఖ్యాలులు రూపకాల లిప్తి యొక్క అనుకరణములు. ఖ్యాలులో తాన్లు వేయుట ఒక విశిష్టత. ఈ కాలములో స్వర లయలద్వారా సూక్ష్మ భావములను వెల్లడిజేయుట అంతరించినది. దానికి బదులుగా తాళ చమత్కారమును జూపి తబలా వానిని ఓడించుట అచరణలోనికి వచ్చినది. అమీర్ ఖుస్రూ, సుల్తాన్ హుసేను షర్కీలు (15 వ శతాబ్ది) ఈ ఖ్యాలు బాణీని ప్రచారములోనికి తెచ్చిరి. దీనిని 17 వ శతాబ్దిలో సదారంగ్, అదారంగ్ ప్రభృతులు ప్రకాశింపజేసిరి. నాటినుండి ఖ్యాలు ఘనత కెక్కినది. అనేక ధృపదములు ఖ్యాలులుగా పరివర్తన

గాంచినవి. ఏకతాల, చారుతాలాలు ధృపద్ ఖ్యాలుల రెండిటికీ సమానమే. వీని మాత్రలు, విభాగాలు, ఉపి, దెబ్బ, (తాలి, ఖాలి) అనే సాంకేతికాలు కూడా సమానమే. ఆఖరి భాగములో తానుల ప్రాముఖ్య మున్నది. ఇది ఎక్కువగా ధృత ఖ్యాలులలో గోచరించును. ఖ్యాలుల సాహిత్యమున నవాబులను రంజింపజేయుటకు శృంగార రసపూరితములు గాజొచ్చెను.

ఉదాహరణ : తోడి - ఎక్కా

స॥ కైసీ సుఖ సోవే నాదరియా శామ మూరత చిత్త చఢీ

చ॥ సోచ సోచ సదారంగ అకులావే యాబిధ గాటపరీ॥

" శ్రీకృష్ణుని కొరకు హృదయము పరితపించు చుండుటచే నాయికకు సుఖనిద్ర ఎట్లు వచ్చును? ప్రియునిచే గలిగిన అశాంతి యను బంధములో ఆమె చిక్కినది " అని సదారంగని వాక్యము.

సదారంగ్ ధృపదాచార్యుడైనా, మహమ్మద్ షా రంగీలా నవాబును ప్రసన్నుని జేయుట కీ విధంగా శృంగార కీర్తనలను సృష్టించి తన శిష్యులగు మానజ్ ఖాన్, చాంద్ ఖానులకు నేర్పి ప్రవీణులుగ జేసెను. ఈ ఖ్యాలులను పాడుటకు అమీరు ఖుస్రూ సితార్, తబలాలను సృష్టించెనట.

" Kushro's innovation of Khyal and Tarana have become part & parcel of Hindusthani Music. Sultan Husen Shirque of Jaunpur (1458–77) has almost monopolised the best brains for many centuries and incorporated in his compositions the best forms of Indian Styles. The Khyal Type evolved with a new style and embellishments to suit the progressive society. in the time of Mhd. Shah Rangila and was developed by Nrija Sadarang."

షాఆలం చక్రవర్తి కాలానికి పిమ్మట గాయకులు రాజాశ్రయం కొరకు ఉదయపూరు, జయపూరు, అల్వారు, గ్వాలియరు, రాంపూరు, దతియా, లక్నో నగరాలకేగిరి. మొగల్ రాజ్య పతనానంతరం 20వ శతాబ్దిలో ఈ గాయకులు రాజాశ్రయంచే మదించి, అనేక ఘరానాలను స్థాపించిరి. వానిలో ముఖ్యమైనవి హద్దూహస్సూఖాన్ ఘరానా (గ్వాలియర్): బైరాం ఖాన్ ఘరానా (జైపూరు): కిరానా ఘరానా, నాయక్ దోండూ; గులాం అబ్బాస్, గగ్గే ఖుదాబక్ష్, రంగీలా ఘరానా (ఆగ్రా): కవ్వాలి బచ్చే ఘరానా (ఢిల్లీ): మియా అచపక్, తాన్‌రసఖాన్; పటియాలా ఘరానా అలయ్యా, ఫత్తూ, బడేగులాం అలీ; షాంబేరాలీ (పంజాబు): ప్రతినిధి సలామత్, నజాకతలీలు: రాందాన్ ఘరానా (ఖుర్జా): అల్తాఫ్ హుసేన్ ఖాన్; సహసవాన్ ఘరానా: ఉస్తాద్ ఇనాయత్ ఖాన్; ముస్తాక్ హుసేన్. ఈ విధంగా ప్రత్యేక విశిష్టతతో తబలా, సితార్ ఘరానాలుకూడా ఆవిర్భవించెను.

సదారంగు ఖ్యాలు బాణీకి జన్మదాతయైనా, పైని చెప్పిన గాయక వరేణ్యు లంతా తమ మేధాశక్తిచే ప్రత్యేక బాణీలను స్థాపించిరి. ఇటను ధృపద్‌లోని సంచారీ, ఆభోగ్ అంగములను లుప్తచేసి, వాని స్థానంలో తాన్‌లను జొప్పించెను. విలంబిత ఖ్యాలులో ఆలాపన భాగము, ధృత ఖ్యాలులో తాన్ భాగము హెచ్చు పాలుండును. ఈ తానులను ఫికర్‌బందీ అంటారు. ఇక అకారతాన్, బోల్తానులు వీణలోని గమకము, జోడుల అనుకరణమే.

తరానా ప్రవీణుడగు తాన్‌రసఖాన్ ఈ ఢిల్లీ బాణీయొక్క ముఖ్య ప్రతినిధి. పటియాలా ఘరానాకు చెందిన అలయా, ఫత్తుఖానులున్నూ, వారి

పుత్రులు ఆషిక్అల్లి, అమానల్లి, అలీబక్ష్, అక్తర్ హుసేన్, ఆషికల్లి, బడేగులాం అలీఖానులు. తాన్‌రసఖాన్ సంప్రదాయానికి చెందినవారు. గనుక ఢిల్లీ, పటియాలా సంప్రదాయాలకు సన్నిహిత సంబంధ మేర్పడినది.

## బాణీ విశిష్టత

సాంకేతిక భాగములో స్వేచ్ఛ, వీణా గమకముల అనుకరణ, శుద్ధ రాగాలాపన, మధుర స్వర సమ్మేళన, భిన్న భిన్న అంశాల విన్యాసం, సపాట్‌తాన్ ఖులాన్, బానావ్, లచావ్, మలోప్, ఝరత్, ఫరత్, ఉపజ, లయబంద్ అనునవి ముఖ్యాంశాలు. విలంబిత ఖ్యాలులో జనానీ, మర్దానీ, సవారీలు తిల్వాడా, ఝూంరా, ఎక్కా, సులఫక్తా, (ఉసూలే-ఫక్త్, లేక పందూల్ పక్షి శబ్దగతి) ఆడాచా తాళములున్నూ ధృత ఖ్యాలులో దాద్రా, త్రితాల, రూపక, జంపె, షరోదస్త్, ధుమాళీ తాళాలను వాడుదురు. వీరు వేసే తానాల పేర్లు జోడ్‌తోడ్, ఝూలా, ఝకోలె, ఉఖేడ్, విలంబిత లయలో, పాలకా, సవారీ, పటరీ, ఖానో, పురీలు, ధృత లయలో తాన్ విస్తారాన్ని చక్కగా చేస్తూ తాళ చమత్కారమును జూపుదురు. తాన బంధనాలో చక్కని ఆకారమును బలికింతురు. సుందర స్వర కూర్పులో కళాత్మక అంగ దిగ్దర్శనం జేతురు. ఖవ్వాలీ బచ్చే-ప్రతినిధి. ప్రస్తుతము ఉస్తాద్ చాంద్‌ఖాన్ ఢిల్లీలో నున్నారు.

గ్వాలియర్ ఘరానాను, బడే మహమ్మద్‌ఖాన్ను అనుకరించిన హద్దూ హస్సూఖాను, నత్థూఖాన్లు (నత్థన్ పీర్‌బక్ష్ మనుమలు) దౌలత్రావు సింధియా దర్బార్ గాయకులు, ఈ బాణీని జాజ్వల్యమానంగా ప్రదీపింప జేసినవారు, నిసార్ హుసేన్ కోటేవాలె, భూ గంధర్వ రహమత్‌ఖాను, శంకర పండిత్, రాజాభయ్యా, పండిత కృష్ణారావులు. బాలకృష్ణ బువాగారి శిష్యుడు, విష్ణు దిగంబర్‌చే ఈ బాణీ వన్నెగాంచి పండిత ఓంకార్‌నాథ్, వినాయకరావు, నారాయణ వ్యాసులచే జగత్ప్రసిద్ధి గాంచినది.

బాణీ విశిష్టత :— గంభీర గాత్రం, స్పష్టోచ్చారణ ద్రుపద్ అంగానికి సంబంధించిన ఖ్యాలు ప్రకటన సపాట్, బోల్తాన్ ప్రయోగాలు లయవారిగా చేయుట, భక్తిరస ప్రకటన, మధ్య కాలీన సంత్ రచనలు (సూర్, మీరా, తులసీ, నానక్, కబీర్ ఖ్యాలు బాణీపైని పాడుట ప్రత్యేకత. (సంగీత విజ్ఞాన—వినాయకరావు పట్వర్ధన్) జైపూర్ ఘరానా: జన్మదాత మనరంగ్, ఉరఫ్ మహమ్మద్‌ఖాన్, రాజా రామసింగ్ దర్బారులో ఆలాబందే బక్షుద్దీను సోదర్లు ధృపదాచార్యులు, అలంసేన్ గోలేబాయి, ఆషికల్లిఖాను, ముబారకలీఖాను, రజబలీఖాను మొదలగువారుపవిష్టులై గానము నభివృద్ధి చేసిరి. పటియాలా తిల్వంతి ఘరానాలకు దీనికి పరస్పర సంబంధ మున్నది. ఉస్తాద్ బైరాంఖాను (రహముద్దీనుఖాను డగర్ తాత) సంగీత శాస్త్ర విఖ్యాత వద్దను అలియా ఫత్తేఖానులు (పటియాల) గాన మభ్యసించిరి. అనంతరం వీరు తాన్ రసఖాను వద్దను ఖ్యాలు గానమును నేర్చిరి. కొల్హాపూర్ స్టేట్ విద్వాన్ అల్లాదియాఖాను పిన తండ్రికూడ జయపూర్ గాయకుడే. అల్లాదియాఖాను తాన్ ప్రవీణుడు. ఇతని శైలి వక్ర సంచారాల గమకాలతోగూడి చాల జటిలంగా నుండును. ఇతని ఖ్యాలు సంగ్రహ మతి విస్తారము. ఆరాధము, అనేక సంకీర్ణ అపూర్వరాగ కృతులు వచ్చును. సపాట్ దాణేదారు (రవ్వ) తానులు భిన్న రాగాలలో పాడేవాడు. గొప్ప వేదాంతి. ఇస్లాం మతాన్ని అవలంబించినా హిందూ ధర్మాలను తప్పక ఆచరించేవాడు. గాన బోధ, తులసీ రామాయణము లితనికి నిత్య పాఠ్య గ్రంథాలు. ఆపస్తంభసూత్ర, కౌండిన్య గోత్రీకుడు.

గాయక విశిష్టత

వక్రతాన్ ఆలాపన, పేచిదా, తాన్ ప్రస్తార్ ఛోటా ముర్కీలు, ఘసటు, మీండు, హుంకర గమక ప్రయోగం. షుజెకాను, బుర్జెకాను, భాస్కర్‌బువా, కేసరిబాయి, మోగుబాయి కుర్డేకర్, మల్లికార్జున మనుసూర్ ఈ బాణీ ప్రచారకులు.

కిరానా కురుక్షేత్ర గాయకి

రాజా మానసింగ్ ఆస్థాన గాయకుడగు నాయక గోంబా, ఖాసూ సోదరులే ఘరానా స్థాపకులు. వీరి స్వగ్రామము పానిపట్టువద్ద నున్న కిరానా. పశుపులను సైతం మాకర్షింప జాలినట్టి గాయకి గనుక పిరగాయకి, గోహార్ న్ గాయకి లేక కిరానా గాయకి అని పేరు వచ్చినది. ఈ సంప్రదాయానికి చెందిన గాయకుల సంఖ్య బహుళము. వీణాచార్య బందె అలీఖాన్, రజ్జబలీఖాను, వహెన్ఖాను, అబ్దుల్ రహీంకాను, సురేశమానె, అమీరుకాను (ఇందూరు) హీరాబాయి మొదలగువారు ఈ ఘరానా ప్రతినిధులు. అబ్దుల్ కరీంకాను శిష్యశాఖ బాగా పెంపొందినది. ఇతను రహమత్ కానును బాగా అనుకరించెను. క్యాలు ఆలాపనలో జంట స్వరాలను పల్కిస్తూ భావ పూర్ణతానులు వేసేవాడు. దీనికి ఆలాపన ప్రధాన గాయకి. ఠుంరీ ఛాయలు చాలా ఉంటవి. ఇతని గాత్రము స్త్రీ గాత్రమును బోలి యుండెను. శ్రుతి సిద్ధాంతములో అద్వితీయ పండితుడుగనుక 'సూర్‌కా బాదుషా' అని బిరుదు వచ్చినది. వీణ సాధన చేయుటచే గాత్ర మాధుర్యం వచ్చి శ్రోతలను ముగ్ధులను జేయును. శిష్యులు నవయుగగంధర్వ, బహరే బువా. కపిలేశ్వరి. రంగీలా ఘరానా (ఆగ్రా). నోహర్ ధ్రుపద్ బాణీనుండి ఇది ఉత్పన్నమైనది. 700 ధ్రుపదములను రచించిన సుజానుకాను ఈ ఘరానా స్థాపకుడు, గాంభీర్యం, ఔదార్యం, విశ్వ లత్వం దీని విశిష్ట లక్షణాలు. రసస్ఫూర్తిలోనూ, భాషలోనూ, మార్దవ లావణ్యాలున్నవి. గగ్గే ఖుదా బక్సుచే దీనికి గ్వాలియర్ గాయకలో సంబంధ మేర్పడినది. చతురంగ గవయ్యా షయాజ్‌కాను ఈ ఘరానాకు గొప్ప ప్రతిష్ఠ నార్జించెను. ఇతను క్యాలు, ధమ్మార్, ఠుంరీ, గజలు ప్రవీణుడు. ఇతనొక స్వరాన్ని ప్రధానంగా తీసికొని, దానిచుట్టూ ఖట్కా అను తాన్ను అల్లివేయును. ఇది ఆగ్రా సంప్రదాయ విశిష్టత. ఇతను ఆలాప్, బంట్, బఢల్ తాన్, తర్కాబ్‌లో చతురుడు.

The Agra Gangaki is not straight laced and spartan in outlook, but highly–romantic in expression and interpretation.

ఇదిగాక పోంచేరాజా (తిల్వంరీ) సాహసనాన్, ఆత్రేరీ ఖుర్జా) మేవాడ ఘరానలుకూడా ప్రసిద్ధమైనవి.

ఠుంరీ సంప్రదాయము

ధ్రుపద్, క్యాలు, ఘరానాల వలెనే ఠుంరీ సంప్రదాయాలు ప్రత్యేకంగా రెండు గలవు. అవి పూరబి (బనారస్); పంజాబీ,

ఈ ఠుంరీలు మన శృంగార జావళీల వంటివి. 'ఠుమర్' అను హిందీ శబ్దానికి అర్థము. సున్నితంగా గంతులు వేయుట అని. శ్రీకృష్ణ బాల్య క్రీడలు-గోపికలతో చెరలాటం ఇందలి ఇతివృత్తము ఠుంరీ అనే శబ్దం "ఠుమర్" ధాతువునుండి ఉత్పన్నమైనది. ఈ ఠుంరీలలో హావభావ ప్రకటన విశేషముగా నుండును ద్వితీయ దశలో ఆంగికాభినయం త్యజించి కేవల భావ పరివర్తన మైనది. దీనిని కోమల గాత్ర స్వరంతో పాడి ప్రకటింతురు. ఉస్తాద్ మౌజుద్దీన్‌కాను, భయ్యా గణపతిరావు, వజిదల్లి నవాబులు దీని ప్రవక్తలు. మహారాస నృత్యములో హోలీలను హరిదాసస్వామి రచించెను.

వానినుండి ఈ ఠుంరీలు పరివర్తనమైనవని ఇంకొక అభిప్రాయం గలదు. ఈ ఠుంరీలను లక్నోలో 18-19 శతాబ్దముల మధ్యను కరాబిందాదిన్ అను నృత్యాచార్యులు భావపూర్ణ ఠుంరీలను రచించి కథక్ నృత్యంలో పదవిన్యాసం చొప్పించి మెరుగు పెట్టెను. వీరి శాఖ యొకటి జయపూరులో విభిన్న సంప్రదాయమున నలరారుచున్నది. క్యాలులో వలెనే దీనిలోగూడ స్వరవిస్తారం మాత్ర మగు పడదు. తృతీయ దశలో స్వర విస్తారముగూడ పెంపొందించిరి, అప్పుడది భావ సంగీతము లేక శబ్ద ప్రధానమై యొప్పెను. అలహాబాదు నివాసి పండిత భోలానాధ భట్టు యీ మార్పు ను దెచ్చెను. ఠుంరీలలో విలంబిత, ధృత లయ గలవి రెండు విధములు, వాటిని బడా, ఛోటా ఠుంరీలందురు. బడా లేక విలంబిత ఠుంరీలో స్వర విస్తారము గలదు. ఛోటా ఠుంరీని ధృతగతిలో పాడుదురు. బడా ఠుంరీ భావ ప్రపూర్ణమై రసోత్పత్తితో నలరారును. వీనిలో ఆలాపన, తాన్, సాంప్, ముర్కి, సూల్, కన, కంకి, ఖటాలు, రాగ ఛాయలలో సమృద్ధికరంగా నుండును. ఆలాపన తానులు స్వల్పమాత్రముగ నుండినను, రాగ ఛాయలు మాత్రమధికంగా నుండును. దీనిని దీప చంది లేక ఖటాకా తేకా (తాళం)లో పాడుట పరిపాటి. ఛేద్ లేక పకడ్ అనే చిన్న ఆలాపనతో ప్రారంభించి. పల్లవి (స్థాయి) నెత్తుకొని బోల్ జవాబ్ (శబ్దా లంకారం) తో రాగ స్వరాలు ప్రకటింపబడును. అనంతరం అంతరా లేక పేర్ బంద్ నెత్తుకొని దానిని ధృతలయలో వివిధ స్థాయులలో పాడుచు తబలావాని చాతుర్యానికి అవకాశమిత్తురు. తబ్జి, త్రితాళ్‌ను 4 కాలాలు పొడిగించి వాయించి చూపును. ఎట్టి పునరుక్తి సంగతులూ లేకుండా, వివిధ రకాలుగా చాలసేపటివరకు పాడగలరు. ఛోటా ఠుంరీని త్రితాళ్ ధృతలయలో పాడుదురు. దానిలో బోల్ బనావ్ ప్రాగ్యము. తాన్‌బాజీ లేకుండా ఛోటా క్యాలు వలె పాడబడును. పాటలోని శబ్దములు మార్చి, మార్చి భావ విన్యాసముతో బాడుదురు. అక్కడక్కడ దీని రసోత్పత్తిని వృద్ధిచేయుటకు ఉర్దూ పద్యములను వాడుదురు.

దీనినిబట్టి ఠుంరీలోని ముఖ్య విశేషము భావమనీ, దానిని చక్కగా నిరూపించుటకు గాయకుడు ఠుంరీ లోని భావమును బాగుగా నవగతం చేసుకొనవలెనని తెలుచున్నది. దీనిలోని ముఖ్య రసములు శృంగార, కరుణ యగుటచే కోమల గాత్రజ్ఞులు రస పూర్ణముగా వాటిని వ్యక్త పరచగలరు. ఈ ఠుంరీలలోని ఇతి వృత్తము బహుధా విరహవేదన, విప్రలబ్ధ శృంగార ములతో నిండియుండును. ఇట్టి నాయికా నాయికీ భేదములు గీతగోవిందములో కూడ గలవు. గనుక 12వ శతాబ్దిలోనే దీనికి ప్రాతిపదిక పడినట్లు ధృవ పడుచున్నది. ఉదాహరణ- "కోమల కాంతా పదా వళీమ్ - జయదేవ - రతిసుఖసారే", తురుష్కుల పాలన హిందూ దేశములో స్థిరపడినప్పుడు నీచ శృంగార ప్రదర్శనకు ఇవి బాగా ఉపకరించినవి. వీనిని వేశ్యలు హావభావములతో మొగల్ దర్బార్‌లో తాయిఫా (సభల)లో అభినయించుచుండిరి. గనుక వీనిని ధూన్ (క్షుద్ర గీతా) లనీ, దాద్రాలనీ పిలిచే వారు. పాంచాల గ్రామీణులు ఠుంరీలను, టప్పా లను, జానపద గేయాలను పాడి ఆనందించేవారు. వ్రజ దేశస్థులు బృందావనం, మీర్జాపూరు గ్రామాల లోని పల్లె పదాల కనుకరణముగా వీనిని గూర్చి పాడదొడంగిరి. లక్నో నవాబు వజీదలీషా (1848-67) గొప్ప నటుడు, రచయిత. దర్శకుడు గనుక ధృపద్, క్యాలు సాధారణ ప్రజలను రంజింపజేయలేని లోపమును గవిపెట్టి తన నాటకా లలో ఠుంరీలను ప్రవేశపెట్టి అంతఃపుర వేశ్యలచే పాడించెను. క్రమేపి ఇవి పాట్నా, అలహాబాద్, కాశీ, కలకత్తా నగరాలకు ప్రాకి తిష్ఠవేసినవి. ప్రఖ్యాత గాయనీమణులగు బొహరాబాయి, జిలన్

బాయి, మల్కా జానులు, మౌజుద్దీనుకానువద్ద వత్య సించి సభావేదికలపైని ప్రచారమునకు గడంగిరి. శుద్ధ శాస్త్రీయ గాన ప్రచారకులగు బహిరాంకాను, అల్లాదియాఖాను, హస్సూకాను వంటివారు వానివి పాటకచేరీలలో బహిష్కరించారు. కాని అబ్దుల్ కరీం కాను, ఫయ్యాజుకాను, బడేగులామలీకానులు తమ చాతుర్యముచే వీనిని బహిరంగ వేదికలపైని ప్రదర్శించి ప్రజాభిరుచిని జూరగొని గౌరవింపబడిరి.

## ఠుంరీ గాన లక్షణములు

ఘన రాగాలైన మియాకితోడీ, కిదారా, దీపక్, మేఘ్, శ్రీరాగ్ వంటివి, చౌతాల, జుంరా, ఢీంటా, మల్ తాల్ వంటి క్లిష్ట తాళాలు వీని కుపకరించవు. ఈ ఠుంరీల ప్రధాన గుణము రాగ రంజకము గనుక కోమల స్వర ప్రయోగము గల బిహాగ్, జంఝూటి, వహాది, సింధుభైరవి, జోగియా, ఆసావరి, పరజ్, కామాగడా, తిలంగ్, కమాచ్, కాఫీ, పీలు, తిలక కామోద్ వంటి ధూను రాగాలలోను, దాద్రా, కహర్వా, పంజాబి టాలాలతోను, పాడుట సర్వ సాధారణము. సహజ మాధుర్యం, కోమలత్వం, ఆర్ద్రత్వం వీనికి అవసరము. అట్టి సున్నితమైన గాత్రజ్ఞులే వీనిని పాడ సాహసింతురు. ఇవి చపలయకు చెందినవి గనుక చిన్నచిన్న ముక్కలు ఆవిర్భావ తిరోభావం, రసనిష్పత్తి చేయుట అత్యవసరము. చక్కని రాగజ్ఞానముండేనేగాని సరసమైన రాగ మిశ్రణచే భావము ద్యోతకమగునట్లు చేయుట అసాధ్యము. ఈ లక్షణాలు గలవారే కరీంకాను, జమీరుద్దీనుకాను, బడేగులామల్లీలు గనుక వారు వీనిని చక్కగా పాడ గల్గిరి ఈ ఠుంరీలను "జనానా గానా" అని సంబోధించుట పరిపాటయినది. నిజమాలోచించిన ఖ్యాలు పాడి మెప్పించుటకన్న ఠుంరీని పాడి రంజింప జేయుటయే దుర్లభము.

ప్రతినిధులు: మధ్యప్రదేశ్, సంయుక్తప్రాంతం, జోరాబాయి (ఆగ్రా), సిద్ధేశ్వరీదేవి, రసూంకబాయి, విద్యాధరిబాయి (కాశీవాసులు), అఖ్తరీబాయి (ఫయిజాబాద్), ఇందుబాల (కలకత్తా), జానకీబాయి (అలహాబాద్) వీరు పూరబిబాజి ఠుంరీ ప్రయుక్తలు.

పంజాబీ ఢంగ్- బడేగులామల్లి, సలామతల్లి, ఆషికల్లి వీరిగానములలో అపూర్వ రసమాధురి ఉన్నది. గనుక పూర్విబాజ్‌కన్నా దీనిలో స్వేచ్ఛ గలదు, కాశీ నివాసురాలు సిద్ధేశ్వరీదేవి ఠుంరీ ప్రదర్శన గోహర్జాను మున్నగు గాయకులను స్ఫురణకు దెచ్చును. దీనిలో స్వరములపైని స్థాపన ఉంటూ క్రమపద్ధతిలో జారు (మీండు) వచ్చును. దీనిలో చిలిపిచేష్టలూ, అనభ్య శృంగారమూ ఉండవు. ప్రేమీ ప్రేమికుల దుర్భర సంయోగ వియోగ అవస్థలు, దూతిక నర్మ సంభాషణలచే ప్రియురాలు ఓదార్చి, బుజ్జగించి, ధైర్యము చెప్పును. విరహోద్రేకము హెచ్చునపుడు తాళము ధృతముగా నడుచును. విరహ వేదనను వ్యక్తీకరించుటకు ఆయా వాక్యములను నెమ్మదిగా పాడి శోకము రగుల్చ జేయును. పంజాబీవారు విలాసప్రియులు. పార్వతేయులు గనుక వారి శృంగార లీలలను సంతోషముతో ప్రకటించుటకు ఠుంరీలను వాడుదురు. అబ్దుల్‌కరీంకాను "నాదే స్వరోకి దేవతా" బిరుదాంకితుడు తన "పియాబినా, ప్రియా మిలనేకి ఆస్, జమునాకే తీరే, గోపాలా! కరుణా కిం నహీ ఆయే!" అనే ఠుంరీలను భావస్ఫూర్తిలో బాడిశ్రోతల హృదయాలను కరిగించి, అశ్రుబిందువులరాల్పించెను.

రచయితలు: వీరి ఠుంరీల ఆఖరు చరణంలో పియా, రంగ్, ముద్రలను వాడిరి. ఉదాహరణ: వజీదహిషా, అఖ్తర్పియా, సుఘునుపియా, సనద్ పియా, చాంద్ పియా దరస్ పియా, ప్రేమ పియా, సబరంగ్, ఇష్కరంగ్, కోడీరంగ్, శాఖల్ పియా, అమర్ పియా, మౌజ్ పియా, కుమార్‌షా, నావలకాం, చాంద్‌షా, బడే రామదాస్, రూపనారాయణ మొదలగువారు సుప్రసిద్ధ ఠుంరీ రచయితలు.

# శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి

వెల్దండ ప్రభాకరామాత్య

రామ కథా నాటకములలో శక్తిభద్రుని ఆశ్చర్య చూడామణికూడ చదువ దగినదే. దిఙ్నాగుడు కుందమాల నభిజ్ఞానముగా సీతను గుర్తించుటకు ప్రవేశ పెట్టెను. కాళిదాసు అంగుళీయకము నభిజ్ఞానముగా శకుంతలను గుర్తించుటకు ప్రవేశ పెట్టెను. ఆ పూర్వ కవుల ఛాయల ననుసరించి శక్తిభద్రుడు సీత ధరించిన చూడామణికి ప్రాధాన్యము నిచ్చి తన నాటకమున కాశ్చర్య చూడామణి యని నామకరణ మొనర్చెను. ఆ చూడామణిని రాక్షస సంహారము గావించిన శ్రీరామునకు పారితోషికముగా ఋషు లిచ్చిరి. అంతేగాక యంగుళీయకము నొక దానినికూడ నిచ్చిరి అంగుళీయకమును రాముడు తను ధరించి చూడామణిని సీతచే ధరింప జేసెను. చూడామణి ప్రభావముననే రామ వేషధారిగా వచ్చిన రావణుని రాక్షసునిగా సీత గుర్తెరింగినది. చూడామణి ఆశ్చర్యకరముగ నితరుల మాయలను మాయింపజేయు ప్రభావము కలదై యుండ దాని కాశ్చర్య చూడామణియని తన నాటకమునకు లోక ప్రాచుర్యము కలిగించినవాడు శక్తిభద్రుడు. శక్తిభద్రుని గురించిన వివరములు పూర్తిగా తెలియవు. శక్తిభద్రుడు ఆది శంకరుల శిష్యుడని ప్రస్తుత కేరళ నాస్తవ్యుడని క్రీ. శ. 8 వ శతాబ్దివాడై యుండనోపునని సంస్కృత సాహిత్య విద్వద్మణు లభిప్రాయ పడుచున్నారు. ఒకప్పుడీ నాటకము లుప్తమైనప్పు డాదిశంకరులు, తనయ సాధారణ ధారణా పటిమతో నాటక మంతటిని వల్లించి పునరుజ్జీవింప జేసెనను కింవదంతి కలదు. ఏలకో భామహుడు కాని తదితరాలంకారికులు కాని యీ నాటకము నందలి శ్లోకములను తమ గ్రంథములం దుదహరింపరైరి.

రామాయణేతి వృత్తములు గల నాటకములలో భవభూతి ఉత్తర రామ చరితము మకుటాయమానము, ఆకోవకు చెందిన తదితర రామ నాటకములలో నాశ్చర్య చూడామణి రంగస్థలమున ప్రదర్శనానుకూలమగు నుత్తమ నాటకమని ప్రాజ్ఞు లభిప్రాయ పడుచున్నారు. అందువల్లనే కేరళ రాష్ట్రములో నాటకములాడు శక్యార్ తెగ వారికి నాటకమునకు మంచి గౌరవము కలదు. భవభూతి కరుణరస ప్రధానముగా తన గ్రంథ

మును కూర్చి, తదనుకృతిగా శక్తిభద్రుడాశ్చర్య చూడామణి నద్భుతరస ప్రధానముగ రచించెను. అందువల్లనే యేతన్నాటక వ్యాఖ్యాన కర్త, “వీర కార్యాద్భుత భూయిష్ఠత్వేన ఆశ్చర్య కారణం చూడామణిః, రిత్యాశ్చర్య చూడామణి రితి సంజ్ఞా” అని వ్రాసినాడు. ఆశ్చర్యచూడామణి సప్తమాంక పరిమితము. దండకారణ్యమున శూర్పణఖ ప్రవేశముతో నాటకమారంభ మగును.

శక్తిభద్రుడు వాల్మీకమున లేని మార్పులు చేసినాడు. శూర్పణఖకు సీత వేషము, రావణునకు రాముని వేషమును, రావణ రథచోదకునికి లక్ష్మణుని వేషమును కల్పించి పఠితలను పాత్రలను భ్రమింప జేసినాడు. తన నాటకమున కనుకూలమగున ట్లుచితమగు మార్పులు చేయు స్వేచ్ఛ కవులకున్న మాట వాస్తవము. కాని యింత విచ్చలవిడిగా కథా భాగమును మార్చుట సమంజసము గాదు. అందుకు వాల్మీకి రామాయణ మాన్య ప్రోక్తము ఏతన్నాటక ప్రారంభమున :—

“ఆర్యే దక్షిణాపథాదాగత మాశ్చర్య చూడామణిం, నామనాటక మభినయామే డిత, సౌభాగ్యమఖిలమామితి” అని వ్రాసినాడు. ఈ నాటకములోని యంకముల కథా భాగము నీ శ్లోకమున సూక్ష్మీకరింప బడినది.

పర్ణశాలా శూర్పణఖా, మాయాసీతా తతఃపరమ్, జటాయుషోవధోశోక, వనికాప్యంగులీయకమ్, సప్తమోఙ్కస్తతశ్చైత్థం, చూడామణ్యఙ్కకర్తనమ్. ఈ శ్లోక పాదములు నాటకాంతమున నుండుటం జేసి తత్కర్త లెవరో తెలియ రాకున్నది. పూర్వ రామ కథకు సంబంధించిన యీ నాటకము మహావీర చరితము మొదలగు వానికన్న భిన్న మనియే చెప్పవలయును.

శూర్పణఖ లక్ష్మణుని గ్రహించి విహాయసమున కెగురుట, రామ వేషమున రావణుడు సీతను సంగ్రహించుట మొదలగు నాశ్చర్యకరమగు విషయము లిందు బొందుపరచ బడినందున యేతన్నాటక నామధేయము సార్థకమైనది. శక్తిభద్రుని శైలి కాళిదాసు శైలిని తలపించు చుండును. విష్కంభముల వలన ఖరదూషణాదుల వధను, రావణ వధను సూచించి కథను పొడిగించకుండ నేర్పుతో శక్తిభద్రుడు తన నాటకమును పూర్తి చేసినాడు. ప్రదర్శన యోగ్యముగా నున్నందున దీనికి కేరళ రాష్ట్రమున నున్న శక్యారీ అను నాటక వృత్తిగల వారి యందు దీని కధికతరమగు గౌరవము కలదని యింతకుముందు చెప్పబడినది. ఏది ఎట్లున్నను చింతనచేయు మాట నటుంచి యెల్లవారు చదువదగిన నాటక మాశ్చర్య చూడామణి. ఆశ్చర్య చూడామణి కథా సారము నిందు సూక్ష్మముగా నిచ్చుచున్నాను.

## కథా సారము

పర్ణశాలను రక్షించుచున్న లక్ష్మణుని వద్దకు శూర్పణఖ రాకతో ప్రథమాంకము

ప్రారంభమగును. కోదండపాణియగు సౌమిత్రివద్దకు లలితసుకుమార వేషమున శూర్పణఖ వచ్చి యతడే సౌమిత్రియని రూపరేఖాలావణ్యములవలన గ్రహించి లజ్జనభినయించెను లక్ష్మణుడు శూర్పణఖను చూచి తనలో తానేదియో చింతించుచు మాట్లాడుకొను చుండెను. శూర్పణఖ లక్ష్మణుని చూచి శరణాగతిపొందిన నన్ను గ్రహింపుమనికోరెను. అందులకు రామానుజుడు తన గుర్వాజ్ఞవలన నది సాధ్యపడదనెను. అందులకు గురుజనాజ్ఞనుల్లంఘనీయమనియెను. లక్ష్మణు డామె మొదటనే రాముని దర్శనముచేయుట దలంచి శూర్పణఖను రాముడానతిచ్చిన విధానమును తెల్పుమనెను. శూర్పణఖ లక్ష్మణుని పరిచర్య చేయుమని సెలవిచ్చెననియె. అరణ్యావాసము చేయుచు, కందమూలములు తినుచు నాశ్రమవాస జీవితము గడుపుచున్న మావద్ద నీ యరణ్యావాస మనర్హమని ప్రత్యుత్తరమిచ్చెను. అందులకు రాముడు సీతతో నుండుటలేదా, అట్లే నేను నీ పరిచర్య చేయుదునని బదులు చెప్పెను. దాస్యము వలదని బుధులు వాంఛింప నీవు కావలయునని కోరవలదని లక్ష్మణుడు శూర్పణఖను వారించెను. రాముడు పర్ణశాలను జేరిన పిదప సంకేత స్థానమున నామెను ద్యాంతునని యంతవరకు నిరీక్షింపుమని కోరెను. శూర్పణఖ నిష్క్రమించిన పిదప "నామెను పరీక్షింపవలె; నేలనన ఘోర విపినమున నియ్యాబాక్షి యుండునేల? నిందేదియో మోసముండు''నని నూహించెను. తత్సమయమున సీతా రాములు ప్రవేశించి నగర వాసముకన్న ఘోరారణ్యావాస మత్యంత సుఖముగా నున్నదని వనశోభల నుగ్గడించు చుండిరి. లక్ష్మణుడు మాత్రము, క్రమము విపర్యస్తమైనదని, కైకేయి కారణమువలన రాముడు రాజ్యము వదలి యిడుముల పాలయ్యెనని తలంచు చుండెను. రాముడు, కేవలము పుత్రవాత్సల్యము వలన కైకేయి తన నిట్లరణ్యావాసము పంపెనని తర్కించు చుండెను. లక్ష్మణుడు "నసన్త్య గుణాగుణవతామ్" అను నానుడి సత్యమని భావించెను. అందులకు రాముడు, కైకేయిపై నీ కింకను కినుక పోలేదా యని మందలింప, రాజ్యాభిషేక మహము వమ్ముచేసి తన తండ్రి మరణమునకు కారణభూతురాలైన నామె యెుదంలెము మరువలేదని చెప్పెను. భరతుడు భూభరణ దక్షుడు కాడని కేవలము పుత్రవాత్సల్యము వలన నట్టి యనుచితమొనర్చినదని చెప్పెను దానికి రామభద్రుడు తన తండ్రి మరణమునకు ముని శాప మూండెనని కైకేయి నిమిత్తమాత్రమని చెప్పెను. అంత సీతా రాములు లక్ష్మణుడు తయారుచేసిన పర్ణశాలలో ప్రవేశించి సౌమిత్రి నేర్పున కచ్చెరువొందుచు వనవాతముల ననుభవించు చుండిరి. ద్వితీయాంకమున శూర్పణఖ సీతా రాముల ముందు ప్రవేశించెను. రాముడు 'లక్ష్మణుని జూచితివా' యని శూర్పణఖ నడుగ "మునివృత్తి గుర్వాజ్ఞ నెనవేర్చు నాకు నీవు ప్రత్యవాయమ"వని పల్కెను. నగుడ లక్ష్మణుని వద్దకేగుమని రామచంద్రుడు పలికినను రామ సన్నిధినే యుందునని ప్రార్థించెను. సీతాదేవికూడ యామె ప్రార్థనము మన్నింపుమని కోరెను. ఇంతలో లక్ష్మణుడు కవ

వాలముతో 'నాగుము రాక్షసి' యని ప్రవేశించెను. సీతయు భీతిల్లి యా రాక్షసి బారినుండి రక్షింపుమని కోరెను. శూర్పణఖ సీతపై నురుక లక్ష్మణు డామె నొడిసి పట్టెను. ఆ రాక్షసి లక్ష్మణుని యెత్తుకొని విహాయసమున కెగిరెను. అంతలో నాకసమున చచ్చితిని శరణు శరణను మాటలు వినపడెను. ఆ రాక్షసి ముక్కు చెవుల నుత్తరించి లక్ష్మణుడు తిరిగి వచ్చెను. శూర్పణఖ రోదించుచూ మాయా జటాధారులగు నీ మానవులనుండి రక్షింపుమని రావణ కుంభకర్ణాదులను సంబోధించుచు, నాక్రోశించుచు, రామ లక్ష్మణుల నుద్దేశించి నా యీ దుస్థితిని ఖరదూషణాదులకు జూపి తగు ప్రతిక్రియ చేయుదునని ప్రతినవట్టి యదేచ్ఛం జనియెను. తృతీయాంకమున విష్కంభము మూలముగా ఖరదూషణాది రాక్షసులు రామ బాణమునకు కాహుతియైరనియు ముని కుమారుని మాటలవలన తెలియును. ఆ ముని కుమారుడు సేద తీర్చుకొనుటకు మారీచ్యాశ్రమమునకు వెళ్ళి యచటనున్న వృద్ధ తాపసాగ్రణి వలన రావణుడా యాశ్రమమునకు వెళ్ళి మారీచుని లేడిగా రూపాంతరము పొందించి సీతను మోహింపజేయుటకు పొమ్మని యాజ్ఞాపించినట్లు తెలిసికొనెను. శ్రీరాముని కేదో నిమిత్తము కన్పింప భరతున కేమి కీడు వాటిల్లెనో యని పరితపించుచుండెను. మారీచుడు రామాశ్రమమును వెదకుచు నచ్చటికరుదెంచెను. లక్ష్మణుడు కవచధారియై వచ్చి, ఖరదూషణుల సంహారమున జనస్థానము ప్రశాంతత నొందినదని శత్రుప్రతిఫలముగా మును లిచ్చిన కవచము సమయము కాకున్నను ధరించితిననియు విన్నవించెను. అంతేగాక రామునకు పారితోషికముగా నాశ్చర్య చూడామణి నిచ్చిరని చెప్పెను. రాముడు వృత్తాంతమును సవిస్తారముగా తెలుపుమనిన, ఋషులు కొంతకాలము శ్రీరాముడు దండకారణ్యమున నుండవలయునని నభిలషించుచున్నారని వారాశీర్వదించుచుందురని తెలియజేసెను. లక్ష్మణుడు మహర్షులొసంగిన రత్నాంగుళీయకమును, ఆశ్చర్య చూడామణిని రామునకు సమర్పించెను. ఈ రెంటిని ధరించినచో రాక్షస మాయలు పటాపంచలు కాగలవని తెలియజేసెను. రాము డాచాశ్చర్య చూడామణి సీతాదేవి కొప్పున ముడిచి రత్నాంగుళీయకమును తాను ధరించెను. మారీచుడు మృగరూపధారియై సీతా రామ లక్ష్మణుల ముందు చరింప దొడగెను. సీత కోరికపై దానిని పట్టుకొనుటకు లక్ష్మణుడు బయలేరుచుండ వారించి సీతా రక్షణ భార మాతని కప్పగించి విల్లందుకొని మాయా మృగము ననుసరించెను. లక్ష్మణుడు మాయా మృగము రాక్షస మాయా ఫలితమని చెప్పినను రాము డెట్లైనను యత్నించవలెనని ముందుకు సాగెను. రావణుడు రాముడు లేమి చక్కని సువర్ణావకాశముగా భావించి తన రథ సారథిని త్వరగా వెళ్ళుమని మందలించెను. రావణుడు శూర్పణఖా సమేతుడై రామాశ్రమమునకు వచ్చెను. శూర్పణఖ రావణునకు సీతను చూపించెను. రెండవ వానిని లక్ష్మణునిగా తెలియ జేసెను. రావణుడు సీత సౌందర్యమును జూచి

విస్మయ మందెను. ఏదో కంఠస్వరము భగవంతుడుకాదు, సాకేత పురమున జన్మించిన నాశరాన్వయ సర్వనాశామథవన్మని, విన్పించెను. రావణుని రథచోదకుడా పలుకుల విని భీతిల్లెను. సీత యేదో యాపద వచ్చుచున్నదని యూహించి హేతుకైన ఖరదూషణులకు సోదరుడు రావణు డొక డుండెనని వింటినని లక్ష్మణునితో పల్కెను. ఇంతలో 'హా లక్ష్మణా' యను యాక్రందనము విన్పించెను. సీత భయపడినది రాక్షస మాయ యని. రామున కేయాపద రాదని చెప్పినను దుర్భాషణములకు వెఱచి లక్ష్మణుడు సీతను విడచి నిన్ను దేవతలే రక్షింతురుగాక యని రాముడు వెళ్ళిన దెసకు పోయెను. సీతకూడ రాముని నన్వేషింతునని బయల్దేరెను. రావణుడా సమయమున రామవేషధారియై రథమునుండి దిగెను. లక్ష్మణ వేషధారియైన రావణ రథచోదకుడు, భరతునకు శత్రురాజు వలన భయము కలిగెనని, త్వరగా రమ్మని కబురంపుట వలన తాను వచ్చితినని తెల్పెను. సీతను రథము నెక్కించి రావణుడు వెళ్ళి పోయెను. అప్పుడు సీతా వేషమున నున్న శూర్పణఖ, రాముడు ప్రవేశించిరి. మాయా మృగము నేల గూలినదని సీత రూపముననున్న శూర్పణఖతో రాముడు పల్కెను. నిజమగు సీత ఖేచర మార్గమున పోవుచు రాముని వాక్కులను విని, తన ప్రక్కననున్నది రావణుడని గ్రహించెను. రామ రూపమున నున్న మారీచుని దేహమునుండి బాణము తీయుచు లక్ష్మణుడు రామ సన్నిధికి వచ్చెను. అచ్చట సీతను (శూర్పణఖ) రాముని జూచి విస్మయపడి, మారీచు "నుద్దేశించి రాక్షసాధమా! నీ మాయలు సాగ"వని యతనిని తన కరవాలము కెర గావించెను. మారీచుడు మరణింప శూర్పణఖ భయపడుచుండెను. శూర్పణఖ నిజరూపము దాల్చెను. లక్ష్మణుడు కరవాలమున దానిని వధింప బూనుచుండ (శ్రీ)రాముని శరణు జొచ్చెను. రాము డభయమిచ్చి, రావణునకు కాల మాసన్నమైనదని తెల్పుమని యాజ్ఞాపింప శూర్పణఖ నైహాయసమున కెగిరి పోయెను.

చతుర్థాంకమున, సీత తన పక్కనున్నది రాముడు కాడని గ్రహించి, రాక్షస మాయయై యుండునని తలపోసి, రక్షింపుమని రాముని, సౌమిత్రి నుద్దేశించి పలికెను. ఎవరో 'వచ్చుచుంటి'నని ప్రత్యుత్తర మిచ్చిరి. వెంటనే తాను జటాయువనియు, ఇక్ష్వాకు కులపతుల సఖుడనని రావణు నుద్దేశించి సీతను విడువుమని కోరెను. కాని రావణుడు విననందున యుద్ధముచేసి రావణుని ఢీకొని మరణించెను.

పంచమాంకమున మండోదరి తన చెలికత్తెతో నేదియో యుపద్రవము రానున్నదని తనకు వచ్చిన స్వప్న వృత్తాంతమును చెప్పెను. కలలకు భయపడవలదని రావణుడు సీతను ప్రలోభపెట్టుట కశోకవనము కేగుచున్నాడని చెప్పెను. వీరిరువు రశోక వనమున కేగి మాటుననుండి రావణుని చర్యలను కనిపెట్టుటకు సమకట్టిరి. రాముడు వాలిని సంహరించినాడనియు సీతాన్వేషణార్థము నలదెసలకు వానర సేన వెళ్ళెనని యాతని సచివుడుగ్గడించెను. అంతేగాక

తత్సమయమున ధర్మపరుడగు రావణుడు సీతా ప్రలోభము చేయు సమయమున ధర్మమును విడనాడెననియు, సీత మానవ కాంత కాదనియు చెప్పెను. అందుకు రావణుడు వినక రాముని విశేషముల నరయుటకు చారుని పంపుమని యాదేశించి యాతని పంపెను. రావణు డెన్ని నయగారములు పల్కినను సీత యాతనిని తిరస్కరించెను. రావణుడు శరణన్నను సీత రోషముతో రాముని శరణుగోరు మనియెను. దానికి రావణుడు కోపగించి చంద్రహాసము గైకొని సీతను సంహరింప నుంకించుచున్న మండోదరి వచ్చి రావణుని ముందు నిల్చెను. రావణు డవనతవదను డయ్యెను.

షష్ఠాంకమున రత్నాంగుళీయకముతో హనుమంతుడు ప్రవేశించి తాను రామదూతనని, నరులకు వానరులకు జరిగిన సమాగమమునకు సంబంధించిన వివరము లన్నియు చెప్పి రాము డిచ్చిన రత్నాంగుళీయకము నిచ్చెను. సీతాదేవి పవనసూనుని రామదూతగా గుర్తెరింగి యాతడు సముద్రమును దాటిన విధమును వివరముగ తెలిసికొనెను. నాడు శివధనుర్భంగము కావించి నన్ను చేపట్టితివి; ప్రకృతము రావణ సంహారానంతరము గ్రహింతునని చెప్పు మనియెనని, రాముని సందేశమును హనుమంతుడు విన్పించి సీత యిచ్చిన చూడామణిని గ్రహించి రామ సన్నిధికి వెళ్ళి పోయెను.

సప్తమాంకమున రాముడు రావణ సంహారము గావించె నని పతివ్రతామతల్లుల హృదయము లూరడిల్లిన వని విష్కంభము ద్వారా సూచిత మయ్యెను. విభీషణుని రాజ్య ప్రతిష్ఠుని జేసి హవ్యవాహనుని చే పునీతను గావింపబడిన సీతను శుద్ధ చారిత్రగా గుర్తెరిగి రాముడు పరిగ్రహించెను.

## శైలి

శక్తిభద్రుని కవనము మృదు మధుర పదవిలసితమై యలరారుచున్నది. మచ్చుకు కొన్ని శ్లోకముల నుదహరింతును.

అరుణే పరిశీర్ణ మంజలే
నిపతంతో నయనోద బిందవః
శకలీకృత మౌక్తికత్విషా
హిమలేశా ఇవపంకజోదరే ॥ షష్ఠాంకము 17వ శ్లోకము.

ఈ నాటకమును మచిలీపట్టణ వాస్తవ్యులు శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి చరణు లనువదించిరి. వారి అనువాద పద్యము. ఈ పద్యమును హనుమంతుని ముఖతః పలికించినాడు.

తరజాక్షి పాటలాంజలి
నురలెడి నయనోదబిందు లొప్పెసలారున్
సురుచిర తామరసోదర
పతిపతిత తుషారబిందు వారమువోలెన్ ॥

విరూపి చేయబడిన శూర్పణఖా వర్ణనము :—

సంధ్యారుణా సలిలవాహా పర పరేవ
శైలస్యధాతు రసధూసరి తేవభిత్తిః
బాలాతప ప్రణయినీ వతమాలవీథీ
సందృశ్యతే సరసలోహిత తామ్రమూర్తిః ॥

దీనికి సరియగు అనువాద పద్యము :

సాంధ్యరాగారుణాంబుద సంణికరిణి
ధాతురంజితగోత్ర ఖండంబుడంబు
బాలభాను రక్తతమాల మాలలీల
గానిపించెడి శోణితా క్రాంతదేహ ॥

శ్రీ ఆంజనేయ శాస్త్రిగారుకాక, విజయవాడ ఆంధ్రుల యోలా కళాశాల వాస్తవ్యులు శ్రీ శనగన నరసింహాస్వామి గారు కూడ నే తన్నాటకము ననువదించిరి. సూత్రధారుడు నాంద్యంతమున చెప్పిన శ్లోకము :

గుణాః ప్రమాణం నదిశాం విభాగః
నిదర్శనం సన్విదమేవతత్ర
స్తనద్వయే తే హారిచందనంచ
హారశ్చనీహార మరీచి గౌరః ॥

శ్రీ శనగన నరసింహ స్వామిగారి అనువాద పద్యము :

గుణము ప్రమాణ ముదిగ్విభ
జనమున గుణమున్ గణింపజనదు సుమా, నీ
స్తనయుగి నొప్పవె హారిచం
దనమునునీహార గౌరతావళులున్ ॥

రాముడు సీతతో వనవాసాధిక్యతను వర్ణించుచు చెప్పిన శ్లోకము :

ఉద్యానం వనభూమయః కుసుమితైః దుర్గంధయఃపాదపైః
శైలా నిర్ఝరహాసినోజలధర శ్యామాగిరిః కృత్రిమః
నద్యాః పారసమూర్ఛితోర్మి వలయా ఘర్మామిషేకాస్పదం
శతాః శకర సంగమాత్సురభయో మిత్రం సరోజానిలః ॥

దీనికి శ్రీ స్వామివారి యనువాద పద్యము :

విరిపూల నెత్తావి కెరటాలు విరజిమ్ము
వనభూములుద్యాన వనపదమ్ము
సెలయేటి చిరునవ్వు లొలుకునీరదనీల
ధాత్రీధరమ్ములు కృతిమాద్రి
పులుగుతెక్కలగాలి నలవెత్తు నీనిమ్న
గాళి ఘర్మాభిషేకాస్పదమ్ము
కమలాకరము మీదుగా వీచు శీతల
వాతపోతమ్ములు వ్యజనబలము

శాకమూల ఫలమ్ములు షడ్రసయుత
భోజనమ్ములు రానేల పూలపాన్పు
పర్ణశాలిక జాళువా మైడిమేడ
వనమృగమ్ములు నిజపరీ వారజనము

ఈ విధముగ శక్తిభద్రుని ఆశ్చర్య చూడామణి చదువుటకు పరమ రమణీయముగ నున్నది.

———

# భారతీయ నృత్యభేదములు

యల్లాప్రగడ వెంకటనారాయణశర్మ

మన భారతీయుల నృత్యకళకు మూలము అయినట్టి ప్రముఖ గ్రంథము భరతుని "నాట్యశాస్త్రము". దీనియందున నాట్యమునే కాక నృత్తము. సంగీతము గూడను చక్కగా విపులముగా చర్చింపబడి యుండినవి. ప్రస్తుత కాలమున దక్షిణ భారతదేశమునందున కూచిపూడి నాట్యము అనియును, భరతనాట్యము అనిన్నీ ఎక్కువగా ప్రసిద్ధిజెంది యుండినట్టివి యగు నృత్య సాంప్రదాయములు రెండును గూడ నీ నాట్యశాస్త్రము నందలి విధానములే నని చెప్పదగినట్టివి. అంటే: అవి దీనియందున వివరింప బడినట్టి అభినయ, నృత్త, సంగీతముల యందలి అంశముల యొక్క సమ్మేళనము వల్లను సిద్ధించి యున్నట్టివియే నని తెలియదగును. ఈనాడు భారతదేశమునందంతటను ప్రసిద్ధిగాంచి యుండినట్టివగు నృత్య సాంప్రదాయములు; కూచిపూడి నాట్యము; భరతనాట్యము; కథకనృత్యము; మణిపురీ నృత్యము: కథాకళీ నృత్యము అనునవి. ఇవి మిక్కిలియును ప్రసిద్ధిగాంచినట్టి నృత్య సాంప్రదాయములు. ఈ పైనను చెప్పబడినట్టి వన్నియును గూడ మార్గ నృత్య భేదములే (శాస్త్రీయములే) అయియున్నవి. వీటిలో ముఖ్యముగా మొట్టమొదటిదిగా చెప్పదగినట్టిది. కూచిపూడి సాంప్రదాయము ప్రాచీనమైనట్టిది. ఇచ్చట నాయా నృత్యముల యొక్క వివరములు, వాటియొక్క స్వరూప స్వభావ విశేషములున్నూ సూచన మాత్రములుగా పేర్కొని విశదీకరించెదను.

1. కూచిపూడి సాంప్రదాయ నృత్యము :-

దీనికే కూచిపూడి భాగవతము అనికూడా పేరు గలదు. ఈ కూచిపూడి భాగవతులను గురించి కొంత విపులముగా తెలుపగల ప్రప్రథమ మైనట్టిది యగు చారిత్రక ఆధారము క్రీ॥ శ॥ 1502 వ సంవత్సర కాలము నాటిదియగు "మాచుపల్లి కైఫీయతు" అనునది. దీనియొక్క వివరమేమంటే: పూర్వము విజయనగర (హంపీ విరూపాక్ష ప్రభువు అగునట్టి శ్రీ వీరనరసింహ్వరాయలు (క్రీ॥ వె॥ 1486-1509) వారి యెదుటను ఆయనయొక్క పరిపాలనము క్రింది సరదారుడగు సిద్ధవటం సీమను పరిపాలించు చుండినట్టి సంబెట (సమ్మెట) "గురవరాజు" అను నతడు చేయునట్టి దుర్మార్గ కృత్యములను ఈ భాగవతులు నాట్య (నాటక) రూపమున ప్రదర్శించి ప్రభువు యొక్క దృష్టిని ఆకర్షించి, ఆ దుర్మార్గ కృత్యములను మాన్పించుటకు తోడ్పడినట్లుగా ఆ మాచుపల్లి కైఫీయతునందున నుదాహరింపబడియుండినది.(Vide studies in the History of the third Dynasty of Vijaya nagar by Dr. N. Venkata Ramanayyagaru Appendex C pages 462-463) మరియును మాచుపల్లి కైఫీయతు స్థానిక సంపుటము 56-పుటలు 65-66 లలో చూడదగును.) మాయొక్క పాఠకుల సౌకర్యముకొరకై ఆ మాచుపల్లి కైఫీయతును యథారీతిగా నీదిగువను ఉదాహరించిచూపుదును.

గమనింపదగును—

"వీరబుక్కరాయలవారి కుమారుడు శ్రీమన్మహారాజరాజ పరమేశ్వర వీరప్రతాప రాయల మహారాయలవారు విద్యానగరమునందు రత్న సింహాసనము నుండి సుస్థిరమున రాజ్యపాలన చేస్తుండగాను, శ్రీ మన్మహామండలేశ్వర సంబెట గురవరాజు గుండ్లకట్ట బండ్లమ్మకొండ స మీ ప్య ము న కోటకో

ప్రభుత్వం చేస్తూ ఉండిరి. ఈ గురవరాజు ప్రభుత్వంలో ప్రజలను అతి దారుణశిక్ష చేయుస్తూ ఉండేవారు. ప్రజల యొద్దను ద్రవ్య ఆకర్షణ చేసే యెడల త్వరగా సొమ్ము యివ్వకపోతే స్త్రీలను తీసికొని వచ్చి స్తనములకు చిరుతలను పట్టించి అనేకముగా బాధలను పెట్టించేవారు. ఈలా గంటి ఒనములలో వినుకొండ, బెల్లంకొండ పట్టున "కూచిపూడి" అనే గ్రామమును బ్రాహ్మణులు భాగవతులు వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థలమునకు వచ్చియుండి, సంబెట గురవరాజుగారి యొక్క దారుణ ప్రభుత్వం చూచి, యక్కడనుండి లేచిపోయి విద్యానగరమునకు పోయి అక్కడ వీరనరసింహ్వరాయలు రాజ్యపాలన చేస్తూ ఉండగా భాగవతులు దర్శనం అయి, కేళిక అడుగగా శెలవు యిచ్చినారు. కూచిపూడి మేళంవాండ్లు చాలా చాలా విద్యావంతులని వినికిడి ఉన్నందున రాయలవారు స్త్రీలు సహా చూడవలెనని నగర్లవద్దను, దివాణములో కీర్తనకు శెలవు యిచ్చినారు. అక్కడ కీర్తన వినికి చేసేటప్పుడు సంబెట గురవరాజువలెనే ఆ వేషగాడు కూర్చుండి రాయల సమక్షమందున ఆ స్త్రీ యొక్క స్తనములకు చిరుతలు పట్టించి (అనేక విధముల స్త్రీలను బాధించి) సొమ్ము యివ్వమని తహాశ్శీల్ చేసినట్లు వినికిడి చేసినారు. అప్పుడు రాయలవారు చూచి "అదియేమి?" అని అడుగగా సమ్ముఖములైనవారు భాగవతుల ముఖతా ఆ వర్తమానం తెలిసి సిద్ధవటం సీమలో సంబెట గురవరాజు అనే ఆయన ప్రజలవద్దనుండి ద్రవ్యాకర్షణ చేసేయెడల స్త్రీలను తీసుకొనిపోయి యీ ప్రకారముగానే తహాశ్శీలు చేస్తున్నారు గనుక యేలినవారలకు తెలుపగలందులకై యీ ప్రకారము వేషములు కట్టి వినికిడి చేసినామని విన్నపంచేయగా చాలా తీక్ష్ణంచేసి మరునాడు ఉదయమందు ఆ సంగతి తిరుగా జ్ఞాపకము చెయ్యమని ముఖ్యులైనవారికి ఆజ్ఞ యిచ్చినారు. ఆ రాత్రి కీర్తన సాంతమైన వెనుక తెల్లవారిన పిమ్మట రాయలవారు కాలోచిత కృత్యములు తీర్చుకొని ఆస్థానమునకు వచ్చి పేరోలగమున వుండి తమవద్ద కార్యభారకులు వచ్చి సంబెట గురవరాజుగారి జ్ఞాపకం విజ్ఞాపన చేయగా ప్రధానులను, సేనానాయకులను పిలిపించి, మోహిమునకు సైన్యం సిద్ధం చేయవలసినదని సెలవు యివ్వగా ఆస్థాన పంజరంలోని చిలుక "జయం జయం" అనగానే అదే మనకు జయమని యిసుమాలుకానుడనే సరదారుణ్ణి పిలిచి తాంబూలం ఇవ్వగా "సంబెట గురవరాజు తల తెస్తున్నానని ప్రతిజ్ఞ పలికి కోటమీద లడాలు షురువు జేసినంత కోటలోని భావు చెయ్యలేక కోట యివ్వగా సరదారు గురవరాజును పట్టుకొని తలకోసి తీసికొని పోయినాడు"-(మాచుపల్లి కైఫీయతు-స్థానిక సంపుటము 56-పుటలు 65-66 లు చూడదగును. (ఇదియే ఆ కైఫీయతు యొక్క పాఠక్రమము).

పొతకమూరి అన్నల భాగవత సాంప్రదాయము:-

పూర్వకాలమున అహోబిల ప్రాంతమున (క్రీ॥ వె॥ 1300 ప్రాంతమునందు) పొతకమూరి అన్నల భాగవత సాంప్రదాయము ఒకటి గలదు. అది కేవలమున్నూ భక్తిమార్గ సంప్రదాయము శ్రీ అహోబిల నారసింహ్వ స్వామివారి సన్నిధియందున నీ భాగవత సోదరులు ఆరుగురున్నూ మహా భక్తి పారవశ్యంతో పాడి నృత్యము నొనర్చెడి వారని గొప్పగా ప్రతీతిగలదు. అది కేవలమున్నూ భాగవత సాంప్రదాయము. వీరు ఒక జోలపాటను పాడెడివారనిన్నీ, వీరు నాట్యము ఆడుతూ వున్నప్పుడు శ్రీ స్వామివారే స్వయముగా వీరితో కలసి నర్తించేవారనిన్నీ గొప్పగా ప్రతీతిగలదు. దీనికి "పొతకమూరి అన్నల జోలపాట" అని పేరు. శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులవారు దీనిని గురించి ప్రశంసించి యున్నారు. ఈ కూచిపూడి భాగవతుల కంటెను పూర్వమునందున నాట్యము దేవదాసీలచే నొనర్పబడు చుండెడిది. పూర్వకాలమున నిది

యెంతయో మహా పవిత్రముగా నుండెడిది. కాని, కాలక్రమమున ఆ సంఘమువారి యొక్క దుష్ప్రవర్తనము వల్లను పరమ పవిత్రమైనట్టి యీ నృత్యకళ మిక్కిలి హీనస్థితికి దిగజారిపోయినది. అట్టి సమయంలో కూచిపూడి భాగవతులు వీధినాటకములను ప్రదర్శిస్తూ ఉండేవారు. క్రమముగా 16 వ శతాబ్ది ప్రాంతమున శ్రీ నారాయణతీర్థ యతీంద్రులవారి శిష్యుడైన సిద్ధేంద్రయోగి యను నతడు వీరికి (ఈ కూచిపూడి భాగవతులకు) నృత్యకళను నేర్పియుండెను. దానినే " భా మా క లా ప ము " లేక "పారిజాతాపహరణము" అని పిలుతురు. నృత్యకళ యందున గొప్పగా పరాకాష్ఠ (Climax) ను పొందినట్టి యపూర్వసృష్టి యీ భామాకలాపము. వీరు (ఈ కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు) యీ భామాకలాపము మాత్రమే గాక నింకనూ ప్రసిద్ధి గాంచినట్టిదగు "గొల్ల కలాపమును; ఉషాపరిణయ నాటకమునున్నూ ప్రఖ్యాతముగా ప్రదర్శిస్తూ ఉండెడివారు. ఇవి నృత్య ప్రధానమైనట్టి నాటకములు యక్షగానములు. ఇవియే వీధిభాగవతములని కూడా ప్రసిద్ధిగా పేర్కొనబడుచున్నవి. ఈ భా గ వ త మేళముల యందున పురుషులు మాత్రమే ఉందురు గాని స్త్రీలు ఉండరు. వీరిది అత్యంతము పవిత్రమైనట్టి యొక గాథ కలదు. వీరికి (ఈ కూచిపూడి భాగవతులకు) క్రీ॥ శ॥ 1672-1687 సంవత్సరముల మధ్యకాలమునందు గోల్కొండ పరిపాలకుడుగా నుండినట్టి "అబ్దుల్ హసన్ కుతుబ్‌షా" (Abdul Hassan Kutub Shah or Tanashah) తానాషా (అనికూడా గలదు) గోల్కొండ నవాబు క్రీ॥ శ॥ 1675 వ సంవత్సర ప్రాంతమునందున ఈ కూచిపూడి యనెడి గ్రామమును వారికి అగ్రహారముగా నొసంగియుండెను. ఈ అబ్దుల్ హసన్ తానీషా గొప్ప కళాపోషకుడున్నూ, రసికుడున్నూ; ఈతనియొక్క కొలువులో "తారామతి" యనే ఒక ప్రఖ్యాత నర్తకి ఉండెడిది. ఆమె అయిదుఏండ్ల వరకున్నూ భూమిమీదను కాలుమోపకుండా రాజభవనానికి వెళ్లుతూ వుండేది. ఆమె ఇంటినుండి రాజభవనంలోనికి ఒక త్రాటి మార్గము ఏర్పాటు చేయబడినది. అరమైలు పొడవుగల ఈ త్రాటిమీదను (Rope way) నడచి ప్రతిదినమున్నూ ఆమె రాజభవనము చేరుకొనేది. అచ్చట రాజభవనంలో నృత్యమును ప్రదర్శించి తిరిగి ఆ మార్గముననే తన యింటికి చేరుతూ ఉండేది. (ది 27-9-64 తేదీ గల ఆంధ్రపత్రిక యందలి రిప్లేస్‌ను అనుసరించి) "The Dancer whose feet never touched the ground. Tharamathi Court Dancer to King Abdul Hasan Tansha, performed daily for the Monarch from 1672-1677 (A. D.) making her way each day for five years from the roof of her home to the Kings Palace on a mountain top by Dancing on a tight rope half mile long". (Golkonda India).

ఇందుకు సరియైనట్టి అను వాదము; రాజనర్తకి; వియన్మార్గము.

గోల్కొండ నవాబు అబుల్ హసను తానాషా కొలువులో "తారామతి" అను పేరుగల నర్తకి ఉండెడిది. ఆమె అయిదు ఏండ్లపాటు (1672-1677) ప్రతిరోజూ రాజభవనంలో నాట్యం ప్రదర్శించేది. ఆ అయిదేళ్లూ ఆమె భూమిమీదను కాలు మోపకుండా రాజభవనానికి వెళ్లేది. ఆమె యింటినుండి కోటలో ఉన్న రాజభవనానికి ఒక త్రాటిమార్గం ఏర్పాటు చేయబడినది. నిత్యం ఆమె అరమైలు పొడవుగల ఆ త్రాటిమీద నడచి రాజభవనమునకు చేరుకునేది.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము నందు కూచిపూడి వారిలో కొంతమంది దక్షిణ దేశమునందలి తంజావూరునకు వలసపోయి యుండిరి. అచ్చట తంజావూరికి సామీప్యములోనుండి యున్నట్టిదగు మెలత్తూరు నందలి భాగవత మేళ నాటకములకు ఈ కూచిపూడి వారియొక్క సాంప్రదాయమే మార్గ

దర్శకమై యుండినదని తెలియగలదు. కూచిపూడి భాగవతుల రీతిగనే మెలత్తూరువారు గూడను బ్రాహ్మణులున్నూ, సామాజికులందరునూ పురుషులున్నూ. మరియును, ఆ నాటకములన్నియును గూడ తెలుగులోననే రచింపబడి యుండినవి. ప్రస్తుతమున ఇటీవల కాలములో "భామాకలాపము, గొల్లకలాపములను ఇతర వర్ణములవారు కూడను పురుషులు స్త్రీలు కూడను, అభ్యసించి ప్రదర్శిస్తూ ఉన్నారు. క్రమముగా నాట్య ప్రదర్శనములను ఇచ్చెడి వేశ్యానర్తకీనులు చాలామంది ఈ భామాకలాపము, గొల్లకలాపములను ప్రదర్శిస్తూ ఉన్నారు. అట్టివారిలో ముఖ్యులు పశ్చిమ గోదావరి జిల్లాయందలి నూరంపూడి కళాకారిణులు చిత్తజల్లు సోదరీమణులు, పెద వెంకటరత్నం, చిన వెంకటరత్నములున్నూ, శ్రీమతులు వైదేహి ఇందువదనలున్నూ; తూర్పు గోదావరి జిల్లాలోని మండపేటలోని వారగునట్టి శ్రీమతులు దుగ్గిరాల జగదాంబ, పందిరి వెంకటరత్నం; సంకు పాపాయి; అనెడి వారలున్నూ; ముమ్మడివరంలోని శ్రీమతి అన్నాబత్తుల చిట్టి బుల్లి వెంకటరత్నం; అమలాపురంలోని శ్రీమతి చిట్టి అనునామెయున్నూ ఇంకనూ మురమండలోని శ్రీమతులు ఇద్దరున్నూ ఈ మొదలైనట్టివారు ప్రదర్శనములను ఇస్తూ వున్నారు. ఇటీవలను కొద్ది కాలము క్రిందటనే వీరిలో కొందరిని మన ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు సన్మానించి గౌరవించి యున్నారు హైదరాబాద్‌లో జరిగియుండినట్టి నృత్యోత్సవాలల్లో.

పైని చెప్పబడినటువంటి కూచిపూడి భాగవతులున్నూ, మెలట్టూరు భాగవతులున్నూ తమయొక్క లక్ష్యము భగవదారాధనమే ముఖ్యముగా స్వీకరించి యుండినందు వల్లను వీరందరును గూడ "భాగవతులు" అనియే వ్యవహరింపబడి యుండిరి. ఈ కూచిపూడి నాట్య సాంప్రదాయజ్ఞులలో మిక్కిలియును ప్రఖ్యాతిని గాంచినట్టివారు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు. వీరు గొప్పగా ప్రశంసలను పొందియుండిరి. వీరు అనేకమంది శిష్యులను తర్ఫీదుచేసి యుండిరి. వీరు మద్రాసులోని శ్రీమతి బాలసరస్వతికి వీరియొక్క నృత్య సాంప్రదాయమునున్నూ పదాభినయనమున్నూ చెప్పియుండిరి ఆమె ప్రఖ్యాత నర్తకిగా పేర్గాంచి యుండినది. ఈ లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఇటీవలనే గతించియుండిరి. ఇంకనూ శ్రీ చింతా వెంకట్రామయ్యగారు కూడను గొప్పగా ప్రఖ్యాతులైనట్టివారు. వీరున్నూ గతించియుండిరి. వీరియొక్క కుమారుడు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు ఈనాడు సుప్రసిద్ధులుగా నుండియున్నారు. వీరే ప్రస్తుతమున కూచిపూడి కళా సాంప్రదాయాన్ని ప్రచారం చేస్తూ ఉన్నారు.

భరతనాట్యము :-

ఈ భరతనాట్య విధానమునే తంజావూరి నాట్యము అనిన్నీ దీనినే "సాదిర్" (Sadir Dance) నాట్యము అనిన్నీ కూడా వాడుకగా పిలుస్తూ ఉంటారు. భరత నాట్యము అంటే దానికి సరియైనట్టి అర్థము భరతుడు నాట్యశాస్త్రము నందున చెప్పియుండినట్టి నృత్య (నాట్య) విధానము అని తెలియవలెను. కాని, ప్రస్తుతమున వాడుకగా నుండెడి భరతనాట్యము అను దానికి పైనను. చెప్పినది వర్తించదు. ఏమంటే; నాట్యము అంటే నృత్యము అని అర్థము. "భరత" అనగా భ=భావము, ర=రాగము, త=తాళము అవియును, ఈ మూడింటియొక్క సమ్మేళనమే "భరతనాట్యము" అనిన్నీ చెప్పబడుతూ వున్నది. కాని, ఈ భరతనాట్యము అనెడి విధానము అంతగా ప్రాచీనమైనట్టిదికాదు. ఇది క్రీ॥ శ॥ 1798-1824 మధ్యను తంజావూరి పరిపాలకుడగు మహారాష్ట్ర ప్రభువు అయిన శ్రీ శరభోజీమహారాజు కాలంలో ఈ విధానము ప్రారంభము కాబడి యున్నది. ఇంచుమించుగా 160 సంవత్సరముల కాలముసుండిన్నీ

ఇది అమలులో నుండియున్నదని చెప్పవచ్చును. ఈ శరభోజ మహారాజు యొక్క ఆస్థానములో (దర్బారులోని) ప్రముఖ నర్తకులు పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు, శివానందము అనెడివారు నలుగురు సోదరులున్నూ ఈ భరతనాట్య సాంప్రదాయ విధానానికి పితామహులు అని చెప్పదగినట్టివారు. అంటే వీరు ఆ విధానమునందున ఒక క్రమ పద్ధతిలో (1) అలరింపు (2) జతిస్వరము (3) శబ్దము (4) వర్ణము (5) పదము (6) తిల్లానము అనునట్టి యొక క్రమ విధానమును ఏర్పరచి దానిని క్రమబద్ధముగా నొనర్చి యుండిరి. అందుకు అవసరములగునట్టి నృత్య సంగీతరచనలను గూడ జేసి అలరింపజేసి యుండిరి. ప్రస్తుతమున ఈనాడు కూడను ఆ రచనలే ఆచరణము [ప్రచారము] లో నుండి యున్నవి. వీరు ఏర్పరచి యుండినట్టి నృత్యవిధానము "భరతనాట్యము" అని పేర్కొనబడుతూ ఉన్నది. ఈ విధానము నందున సాధారణముగా ఒకే నర్తకి రెండు లేక మూడు గంటల వరకున్నూ వరుసక్రమముగా నృత్యము నొనర్చును. ఇకను నాయికాభినయము నందున ఆ నర్తకి యొక్క గురువే [ఆచార్యుడు-నట్టువనార్] ఆ నాయికకు సఖి - [చెలికత్తె] గా వ్యవహరించు చుండును. ఈ విధానము నందున అలరింపు [అలంకరింపు] అనునది దైవప్రార్థన పూర్వకమైనట్టి కేవల నృత్తము. ఇది త్వరలోనే ముగింపబడు తుంది. రెండవదియగు "జతిస్వరము" అనునది అచ్చముగా నృత్త ప్రాధాన్యమైనట్టి భాగము. దీని యందున కరణములు ప్రయుక్తములు కాబడుచున్నవి. ఈ విధానములో మిక్కిలియును కష్టసాధ్యమైనట్టి భాగము ఇదియే యగును. ఈ జతిస్వరమును [అభినయించుట] ఆడుట పూర్తికాబడిన వెనుక నర్తకి కొంచెము విశ్రాంతి తీసికొనగలదు. అటు తరువాతను మరల ప్రారంభించును. శబ్దము, వర్ణములను అభినయించిన తరువాతను పదమును అభినయించుట ప్రారంభించును. "పదము" అనునది ప్రత్యేకముగా అభినయ ప్రాధాన్యమైనట్టిది. ఈ భాగమునందు క్షేత్రయ్యగారి రచనలగు మువ్వ గోపాల పదములు ఎక్కువగా నుపయోగింపబడ గలవు. ఇంకనూ సారంగపాణి పదములు (వేణు గోపాలాంకితములు) సభాపతయ్యగారి పదములు (రాజగోపాలాంకితములు) న్నూ, మన్నారు రంగని పదములు మొదలైనట్టివి పదములుకూడా అభినయింప బడగలవు. మరియును వీటి యనంతరము నందున నింకనూ కీర్తనలు, అష్టపదులు, శ్లోకములున్నూ అభినయింప బడగలవు. సామాన్యముగా నిందున నుపయోగింపబడెడి రచనలు అన్నియును గూడ తెలుగు రచనలే ననియెడి విషయము గమనింపదగి నట్టిది. ఇటీవలి కాలమున జానపద గేయములను కూడను పాడి అభినయించు చున్నారు. ఇకను తిల్లానము నందున (శారీరక) అంగసౌష్టవ ప్రదర్శక మైనట్టి నృత్యము ప్రయుక్తము కాబడుచున్నది. సాధారణముగా నేదియైన నొక శ్లోకమును పాడి దానిని అభినయించుటతో ప్రదర్శనము పూర్తిగావింప బడును. ఈ భరతనాట్య విధానాన్ని అనేకమంది స్త్రీ, పురుష నర్తకీనర్తకులు అభ్యసించి గొప్పగా ప్రఖ్యాతిగాంచి యున్నారు. అట్టివారిలో ననేకమంది విద్యాధికులు గూడను ఉండియున్నారు. ఈ భరత నాట్య శాస్త్ర విధానము దేశ దేశములయందంతటను అంతర్జాతీయముగా మిక్కిలియును ప్రఖ్యాతిని గడించి యున్నది.

కథక్‌నృత్యము :

ఈ విధానమునందున హిందూ మొగల్ సాంప్రదాయముల యొక్క సమ్మేళనము గలదు. ఇది ఉత్తర భారతదేశమునందున మిక్కిలియును ప్రచారములో నుండియున్నది. పైనను చెప్పియున్నట్టి భరతనాట్య విధానమునందున హస్తాభినయము మిక్కిలియును ప్రాధాన్యముకాగా, దీనియందున (కథక్‌నందు) పాద ప్రచారము ఎక్కువగా ప్రాము

న్యత నందగలదు. ఈ కథక్ విధాన నర్తకుడు ఎట్టి తాళము నందైనను గూడ గంటలు తీరుబడిగా వర్తనము నొనర్పగలడు. దీనినే "లక్నో ఘరానా నృత్యము" అని కూడా పిలుస్తారు. దీనియందున సాహిత్యమునందలి అర్థభావమునకు అంతటి ప్రాధాన్యత లేదు. కేవలమున్నూ తాళగతియందుననే పరాకాష్ఠ నందగలదని తెలియదగును. ఇదియే కథక్ నృత్య విధానము. దీనియందున బోల్సు అనునవి పాడుతూ నృత్యం చేస్తారు. (బోల్సు అనగా తాళ వినియమబద్ధమైనట్టివి కొన్ని గేయ రీతులుగా తెలియదగును).

మణిపురీ నృత్యము :

ఇది అస్సాము, బంగాళాదేశ ప్రాంతము నందున మిక్కిలియును ప్రచారమునందున గలదు. ఇది కేవలమును భక్తులయొక్క భక్త్యావేశపరత్వ విశేషమునకు సంబంధించినట్టి నృత్య విధానమై యున్నది. దీనియందున శాస్త్రమున కంటెను "లోకధర్మి"యే మిక్కిలి ప్రాధాన్యతను వహించగలదు. శ్రీకృష్ణ చైతన్యునియొక్క వైష్ణవమత ధర్మముతో నీ విదానము ఎక్కువగా ప్రచారములోనికి వచ్చియుండెనని చెప్పవచ్చును. దీని యందున అంగ, ప్రత్యంగములకు సంబంధించినట్టి విలాస విశేషములు మిక్కిలియునూ ప్రాన్యధాములు. ఈ మణిపురీ సాంప్రదాయ నర్తకులు బహుచక్కగా అత్యంతమైనట్టి ఆకర్షణీయముగా ఆహార్యమును వేషధారణము నొనర్తురు. ఈ మణిపురీ నృత్య విధాన విశేషము లాస్యప్రాధాన్యమైనట్టి కైసికీ నృత్యము అని చెప్పదగును.

కథాకళీ నృత్యము :-

ఇది కేరళ దేశమునందున అనగా పశ్చిమతీరము నందలి మలబారు దేశమునందున మిక్కిలి ప్రసిద్ధి జెందినట్టిది. ఈ నృత్య విదానాన్ని కేవలము ఉదత నృత్య విదానముగా చెప్పవచ్చును. అనగా కేవలమును తాండవ సంబంధము అనియును. పురుషసంబంధము అనియును చెప్పదగును. దీని యందున వాచిక అభినయము అప్రదానము. కేవలమును ఆంగికాభినయమే మిక్కిలియును ప్రాదాన్యతను వహించును. ఈ కదాకళీ నృత్య విదానము గూడను ఇంచుమించు మూడు లేక నాలుగు శతాబ్దముల కాలము క్రిందటినుంచి మాత్రమే ఆరంభింపబడి రూపొందింపబడి యున్నది. ఈ కథాకళీ విదానంలో పాత్రలయొక్క వేషధారణమునందున నొక ప్రత్యేకమైనట్టి ఆకర్షణము గలదు. పాత్రలు కృత్రిమ శిరములను (Masks తలతొడుగులను) ధరించెదరు. దీనికి మూలము భరతుని యొక్క నాట్యశాస్త్రమే అయి యుండినప్పటికిన్నీ; ఈ కదాకళీ నర్తకులు చాలా మార్పులను జేసి ప్రత్యేకమైనట్టి నృత్య శాస్త్ర విదానమును రూపొందించుకొని యుండిరి. ఎట్లంటే: ఇందుకు ఉదాహరణముగా చెప్పవలెనంటే: నాట్యశాస్త్ర విదానములో పేర్కొనబడి యుండినట్టిదగు "త్రిపతాక హస్తము" ఈ కథాకళీ యందున "పతాకహస్తము"గా చెప్పబడుచున్నది. దీనికి ఆదారము "హస్తలక్షణ దీపిక" అని తెలుస్తుంది. నందికేశ్వరుని యొక్క అభినయ దర్పణమునకునూ, ఈ హస్తలక్షణ దీపికకునూ కొన్ని భేదములు ఉండినట్లుగా తెలియగలదు. ఈ కథాకళీ నృత్యనాటకముగా పేర్కొనదగి యుండును. ఈ విదానమునందున రామాయణము, భారతముల యందలి కదావిదానములు చిత్రితములు అగుచుండగలవు. ఈ కథాకళీ నృత్య విదానాన్ని పూర్వులు అగునట్టి కీ॥ శే॥ వల్లథోల్ మహాశయుడు దీనిని సృష్టించి, రూపొందించి మిక్కిలియును ప్రచారములోనికి తీసికొని వచ్చియుండెను. ఇది గొప్ప ప్రచారములో నుండియున్నది. ఇవియే భారతదేశమునందలి ప్రముఖము

లైనట్టి నృత్య విధానములు. ఇవిగాక నింకనూ ఉత్కళల (ఒరిస్సా) యొక్క ఒడెస్సీ (Odessa) విధానమున్నూ మరియును అస్సాంలోని అంజియా వట్ విధానమున్నూ కొంతవరకు ప్రముఖములై ప్రచారములో నుండియున్నట్టి నృత్యరీతులు.

ఇకను జానపద నృత్య విధానములు, ఆటవిక నృత్యరీతులు అనేకములు గలవు కాని అవి శాస్త్రీయములు కావు గనుక వాటికి అంతగా ప్రాధాన్యత లేదు. ఇకను ముందు దేశ్యరీతులు కొన్ని తెలుపబడ గలవు గమనింపదగును.

జాయపసేనానియొక్క నృత్తరత్నావళి "రామప్ప దేవాలయమునందలి దగు నృత్య శిల్పము":

కాకతీయ గణపతిదేవుని యొక్క సేనాపతియును గజసైన్యాధ్యక్షుడును అగు జాయన లేక జాయపసేనాని యను నతడు క్రీ॥ శకము 1253-1254 సంవత్సరములలో (కలియుగ సంవత్సరములు 4355) అనగా నప్పటికి ఆయనకు అరువది సంవత్సరముల వయస్సు దాటిన అనంతర కాలమునందున "నృత్తరత్నావళి" యనెడి గ్రంథమును రచించి యుండెను. ఇతనియొక్క ప్రథమ (బాల్య యౌవన) దశ నుండియే ఈయనయొక్క ప్రజ్ఞా విశేషములను ఎఱింగి యుండినట్టివాడగు శ్రీ గణపతిదేవులు వీరి యందున మిక్కిలియును శ్రద్ధవహించి గుండా (కొండా) మాత్యులవారి వద్దను, వెన్నెలకంటి రామామాత్యులు అనువారి వద్దనున్నూ ఈ జాయనకు సర్వ విద్యలున్నూ సమస్త కళలున్నూ నేర్పించి యుండిరి. ఆ గణపతిదేవు మహారాజు యొక్క కోరికపైననే జాయపసేనాని ఈ "నృత్త రత్నావళి" గ్రంథమును రచించి యుండెను. ఈ గ్రంథమునందున రెండు భాగములు గలవు. అవి ఏవియనగా: మార్గనృత్తము, దేశీనృత్తము లనునవి. ఇందు మార్గనృత్తము అనునది భరతునిచేతను చెప్పబడినట్టిదియగు శాస్త్రీయ నృత్త విధానము. దేశీయనునది రెండవ విధానము. ఇతడు ఈ దేశీవిధానమును రూపొందించుటలో మతంగునియొక్క "బృహద్దేశీ" గ్రంథమును అనుసరించి యుండెను. అంటే ఈ దేశీయనియెడి విధానాన్ని మతంగుడే అవలంబించి యుండెను.) ఈ రెండు భాగములయందుననూ ఒక్కొక్క భాగమునందున నాల్గేసి ప్రకరణములు (అధ్యాయములు) గలవు. అవి వరుసగా; ప్రథమాధ్యాయము: నర్తన వివేకము; ద్వితీయాధ్యాయము - అంగనిరూపణము: తృతీయము చారీస్థానక మండల లక్షణాదిక వివరణమున్నూ: చతుర్థము కరణాంగహార వివేచనము లనునవి. ఇకను రెండవ భాగమునందలి విదేశీ నృత్తమునకు సంబంధించినట్టి ప్రకరణములు నాలుగున్నూ వరుసగా మొదటిది (వరుసక్రమంలో అయిదవది) దేశీస్థానక-కరణభ్రమరీ లక్షణము చెప్పబడినది. రెండవ, మూడవ, నాల్గవ [అనగా వరుసక్రమములో వివరించు గల 6, 7, 8 మూడు ప్రకరణములున్నూ-అప్పటికి మన తెలుగు దేశములో నుండి యున్నట్టివగు దేశీనృత్త విధానములైనట్టివి. పేరణీ, చర్చరీ, దండలా [రా] సక, ఘటసరి, బహురూప, చిందు, కోలాటము మొదలైనట్టి యనేక దేశీపద్ధతులుగా చెప్పబడి యుండినవి. [ఇవియే ఆ నృత్తరత్నావళియందలి విషయములు].

శైవమత ప్రచారకుడగు పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో ననేక విధములైనట్టి దేశీనృత్త విధానములను చెప్పియుండెను. మహాభారతమును ఆంధ్రీకరించి యున్నట్టి తిక్కన సోమయాజి తనయొక్క విరాటపర్వములో బృహన్నల [అర్జునుడు] ఉత్తర కన్యకు నేర్పియుండినట్టి నృత్త విధానము అంతయును గూడ దేశీయనృత్తము అనియె చెప్పియుండెను. ఇది గమనింపదగినట్టి విషయము [చూడు విరాటపర్వంలో ప్రథమాశ్వాసమునందలి 228 వ పద్యము-"బందు పనులకు

సెలవు లేకునికి జేసి-యభ్యసించితి శైశవమాదిగాగ| దండలానక విధమును గుండలియును, ప్రేంఖణంబు తెలుంగును ప్రేరణియును" అని కలదు; గమనింప దగును. కనుక నివియున్నియును దేశినృత్త రీతులుగా. తెలియగలవు. ఈ జాయపసేనాని (సం) "గీతరత్నావళి" యనెడి మరియొక గ్రంథముకూడను సంగీతవిషయకముగా రచించియుండినట్లుగా తెలియ గలదు. కాని, ఆ గ్రంథము ప్రస్తుత మెచ్చటను గాని లభ్యముగుట లేదు. "నృత్త రత్నావళి" మాత్రమే లభ్యముగా నుండియున్నది. ఇంకను మరికొన్ని విషయములు గూడను తెలియగలవు. ఏమంటే; ఈ నృత్తరత్నావళి గ్రంధముయొక్క సంస్కృత వ్రాతప్రతి యొకటి (Manuscript) బంగాళాదేశమం దుండినట్లుగా తెలుస్తుంది. గ్రంథ కర్త నరేంద్రుడు అనే రసవుత్ర రాజు తనయొక్క "సంగీతరాజము" అనెడి గ్రంథంలో ఈ నృత్త రత్నావళి గ్రంథమునందలి విషయములను అనుస రించియుండినట్లుగా కూడను తెలుస్తుంది. దీనినిబట్టి చూచినట్లయితే; ఈ నృత్తనాట్య. సాంప్రదాయానికి మనయొక్క తెలుగుదేశమే ఉత్తమ సామ్రాజ్యము (Highest standard) గా నుండియున్నట్లుగా కూడా తెలియగలము. ఈ నృత్త రత్నావళి అనే గ్రంధము యొక్క వ్రాతప్రతిని ఒకదానిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు సేకరించి యున్నారు. ఆ గ్రంధమును తెలుగులోనికి అనువాదమును చేయించి ప్రచురించుటకు ప్రయత్నించు చున్నారని కూడను తెలుస్తూ ఉన్నది. అది త్వరలోననే కొద్ది కాలములోనే నెరవేరవచ్చునని మనము ఆశింప వచ్చును. అందుకు ముఖ్యులైనట్టివారు ప్రయత్నించు చున్నారు. ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ నటరాజ రామకృష్ణ బి. ఎ. గారు అందుకు బాధ్యత వహించి నట్లు తెలుస్తుంది.

ఇకను తెలంగాణాలోని వరంగల్ జిల్లాలోని దగు పాలంపేటలో గల రామకృష్ణ దేవాలయము నందలి శిల్పమును గూర్చి మనము ముఖ్యముగా తెలుసుకొన వలసి యున్నది. ఈ దేవాలయము నందలి శిల్పమునే పైన చెప్పబడిన నృత్త రత్నావళి. గ్రంధకర్తయగు జాయపసేనాని గూడను అనుసరించి రూపొందించి యుండినట్లుగా తెలియగలదు. ఈ రామప్ప దేవాలయము తెలుగుదేశము నందున గల దేవాలయములు అన్నింటిలోననూ అధికమైనట్టి శిల్ప కళా సమన్విత మైనట్టిదిగా యున్నది. ఇది శ్రీ రుద్రేశ్వరుని ఆలయము (శివాలయము). కాకతీయ గణపతిదేవుని యొక్క మంత్రియును, సేనానియును అగు రేచర్ల రుద్రదేవు డను నతడు క్రీస్తుశకము 1213 సంవత్సరములోని దేవాలయమును నిర్మాణ మొనరించి యుండెను. ఈ దేవాలయము నందలి ప్రతియొక్క భాగము కూడను అపురూపమైనట్టి శిల్ప కళామయమని చెప్పుట ఎంతయును యుక్తము. ఆనాటి కాకతీయుల యొక్క నృత్య కళాభిమానము నకు ఇది చాల ముఖ్య నిదర్శనము అని చెప్పదగి యున్నది. (వేరొక వ్యాసమునందున ఈ వివ రణము నంతను విశదీకరింపగలను)

(భరతుని) నాట్యశాస్త్రము: (నందికేశ్వరుని) అభి నయ దర్పణములు :-

ఇవి నృత్యకళా విధానమునకు అత్యంత ప్రాము ఖ్యంలగునట్టి మూలగ్రంథాలు. నందికేశ్వరుని చేతను చెప్పబడినట్టిదగు "అభినయ దర్పణము". ఈ గ్రంధ రచయిత యగు నందికేశ్వరుడున్నూ, భరతుని నాట్య శాస్త్రము నందు పేర్కొనబడి నతడు మహర్షియను నాతడున్ను ఒక్కరేనని కొందరు చెప్పుచున్నారు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు యం. ఏ. ఇటుల చెప్పియుండిరి. (Vide journal of the Andhra Historical Research Society Volume III pages 455-457). ఈ అభినయ దర్పణము అనెడి గ్రంధము పూర్వమున నందికేశ్వర ప్రణీత మైనట్టిది యగు "భరతార్ణవము" అనెడి గ్రంధము

నకు సంక్షిప్తము అని చెప్పబడుచున్నది. ఇటుల నా గ్రంథమునందే (అభినయ దర్పణమునందే) చెప్పబడి యున్నది. ఇట్టి యీ విషయము ఆ గ్రంథము యొక్క వ్రాతపతుల (Manuscripts) లోనే చెప్పబడి యున్నది. మరియొక ముఖ్యమైనట్టి విషయమేమంటే: ఈ అభినయ దర్పణ గ్రంథముయొక్క వ్రాతప్రతులు అన్నియును గూడ (ఎక్కడెక్కడ లభ్యములైనట్టివియును గూడ) తెలుగు లిపిలోననే వ్రాయబడి యున్నవి. ఇందువల్లను ఈ గ్రంథము తెలుగు దేశమునందే ఉత్పన్నమైనదియనియును: ఈ గ్రంథకర్తయగు నందికేశ్వరుడు గూడను తెలుగువాడే ననిన్నీ కూడా ఊహించుటకు అవకాశము కలుగుచున్నది. మరియును, ఈ గ్రంథకాలము క్రీ॥ శ॥ 4 వ శతాబ్దము ప్రాంతము అనికూడను తెలియుచున్నది. పూర్వము ఉండినట్టి నాట్యశాస్త్ర గ్రంథము లన్నింటి యందునను "నాట్యశాస్త్ర మే" మూలాధారమైననూ కొన్ని కొన్ని లక్షణాధికములను, వినియోగములను ప్రదర్శించుటలో నించుక భేదించు చున్నవి. నాట్యశాస్త్రము నందునను, అభినయ దర్పణమునందునను చూచినట్లయినచో నీ క్రింది భేదములు రెండింటి యందునను కనుపడుచూ వున్నవి (చూడు-నాట్యశాస్త్రము 322-324 పుటలు) అట్టివి ఆయా భేదములేవి యనగా భరతుడు శిరోభేదములను 18 దింటిని చెప్పెను. నందికేశ్వరుడు తొమ్మిదింటిని మాత్రమే చెప్పెను. భరతుడు దృష్టిభేదములను 36ని పేర్కొనియుండెను. నందికేశ్వరుడు 8 మాత్రమే పేర్కొని యుండెను. భరతుడు గ్రీవాభేదములను 9 టిని చెప్పియుండగా నందికేశ్వరుడు 4 మాత్రమే చెప్పియుండెను. ఉభయులున్నూ హస్తభేదములలో అసంయుత, సంయుత భేదములను చెప్పియుండిరి. చాలావాటిలో పేర్లు సామ్యములుగానే ఉండియున్ననూ వాటి వాటి యొక్క లక్షణాధిక వినియోగరీతులలో కొంత భేదము కన్పించుచున్నది. అసంయుత హస్తములు భరతాచార్యుడు 24 టిని చెప్పియుండెను. నందికేశ్వరుడు 28 టిని చెప్పియుండెను. వీటిలో 22 సమానములు గానే ఉండియున్నవి. కొన్ని లక్షణములు సమానములు. మరికొన్నింటికి లక్షణాధికములలో భేదములు గలవు. మరియును, సంయుత హస్తములు భరతుడు 13 టినే చెప్పియుండగా నందికేశ్వరుడు 23 భేదములను వివరించి యుండెను. ఇకను నృత్తహస్తములు భరతాచార్యుడు 30 టి భేదములను చెప్పియుండగా నందికేశ్వరుడు 13 టిని మాత్రమే చెప్పియుండెను. మొత్తముమీదను భరతుడు అరువది ఏడు హస్త భేదములను చెప్పియుండెను. నందికేశ్వరుడు 64 అరువదినాలుగు హస్త భేదములను చెప్పియుండెను. శాస్త్రమును అనుసరించి "చతుష్షష్టికరాన్" అనియే కలదు. కాని భరతాచార్యుడు అరువది ఏడింటిని పేర్కొని వివరించియుండెను. ఇంకనూ తదితర గ్రంథముల యందునను గూడ చూడదగును. ఇట్టి భేదములు ఉభయుల గ్రంథములందునను కనుపడుచున్నవి. పాఠకులు ఆయా గ్రంథములయందున నాయా విషయములను పరిశీలించి చూడదగును. ఈ పైనను చెప్పబడినట్టి వన్నియును భారతదేశమునందున గల మార్గదేశీ నృత్య విధానములై యున్నవి. ఆయా విధానము లున్నూ వాటివాటియొక్క భేదములున్నూ ఎట్లెట్లు ఎప్పుడెప్పుడు ఆయా విధానముల ప్రచారమును పొందియుండినట్టి విషయములును చెప్పబడి యున్నవి.

ఇకను ముందు "శివతాండవమును" గురించి విశదీకరింతును. గమనింపదగును.

శ్లో॥ "ఆంగికంభువనం యస్యవాచికం
సర్వవాఙ్మయమ్ ।
ఆహార్యం చంద్రతారాదితం వందే
సాత్త్వికం శివమ్ ॥"

అని ప్రార్థించాడు నందికేశ్వరుడు తన అభినయ దర్పణ గ్రంథ ప్రారంభమునందున. అంటే: నృత్త

సమయమం దందున ఎవ్వనికి ఈ భువనము (ప్రపంచము) అంతయును ఆంగికాభినయము అగుచున్నదో :- అట్లే ఈ వాఙ్మయము అంతయును గూడ నాతనికి వాచికాభినయముగా నగుచున్నదో ! చంద్రుడు, నక్షత్రములు మొదలగునట్టి గ్రహములే ఆతనికి ఆహార్య అభినయములుగా నగుచున్నవో ! అట్టియో సాత్త్వికమూర్తియైనట్టి శివునకు నమస్కరించు చున్నాను అని అందలి భావము.

నృత్తముయొక్క సృష్టికర్త పరమశివుడేనని నాట్య శాస్త్రకర్తయగు భరతాచార్యుడు చెప్పియుండెను. "నటరాజు" అనే నామము చేతను శివుడు ప్రఖ్యాతిగాంచెను. ఇట్టి యీ శివునియొక్క నృత్తము అనాది. ఇది యీ శివనృత్త విశేషము "తండువు" అనునాతని చేతను క్రమబద్ధ మొనర్పబడి యుండినందువల్లను అది "తాండవము" అని పేర్కొనబడి యున్నది. ఇట్టి యీ శివతాండవము అనునది సప్తరీతులుగా శైవ ఆగమముల యందున చెప్పబడి యుండినది. అవి వరుసగా 1. కలిక తాండవము, 2. ఉమాతాండవము 3. సంధ్యాతాండవము 4 సంహారతాండవము 5. త్రిపుర లేక విజయ తాండవము 6. ఊర్ధ్వ తాండవము 7. ఆనంద తాండవము అని ఏడు విధములుగా చెప్పబడి యున్నవి. ఇవి యేడున్ను పరమేశ్వరుని యొక్క పంచక్రియా శక్తికి అనగా సృష్టి, స్థితి, లయ (సంహారము) తిరోభావము; అనుగ్రహములనెడి అయిదు క్రియలకున్ను చిహ్నములుగా తెలియదగును. ఈ పంచక్రియలకును వరుసగా బ్రహ్మ విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివు లనెడివారు కర్తలు. కలికి తాండవము సృష్టికిన్నీ, ఉమాతాండవము, సంధ్యా తాండవములు స్థితియందలి స్థితిత్వ పరిరక్షణములకున్నూ, సంహారతాండవము సర్వ ప్రపంచముయొక్క లయము (సంహారము) నకును త్రిపుర తాండవము తిరోభావమునకున్ను, ఊర్ధ్వ తాండవము అనుగ్రహ విశేషము (మోక్షము) నకున్ను సూచితములగునట్టి చిహ్నములు. ఇకను ఆనంద తాండవము పైన చెప్పబడినట్టి అయిదు క్రియలయొక్క సమాహారము రూపమున్నూ అయియున్నవి.

దక్షిణ భారతదేశంలో చిదంబర క్షేత్రము అనునది గలదు. అచ్చట శ్రీ నటరాజ స్వామివారి ఆలయము గలదు. ఉత్సవాదికములలో సాధారణముగా అన్ని దేవాలయముల యందునను మూలవిరాట్‌ను గాకుండా వేరుగా ఉత్సవ విగ్రహములను అలంకరించి ఊరేగించెదరు. కాని చిదంబరము నందున అట్లుగాకుండగ మూలవిరాట్ అగునట్టి శ్రీ నటరాజ విగ్రహమునే కదిలించి పైకిదీసి దానినే ఊరేగింపు చేసెదరని తెలుస్తుంది. ఇది అచ్చటి యాచారముగా తెలియగలదు. ఇట్టి యాచారము అపూర్వమైనట్టిది. అద్భుతమైనట్టి కళారూపముతో నొప్పుచున్న ఆనంద తాండవ నృత్తరూప మైనట్టి యీ నటరాజస్వామి యొక్క దర్శనము ప్రేక్షకులకు సాటిలేని యొక ఆనందము, అనుభూతినిన్నీ కలుగజేయును. ఇట్టి యీ నటరాజ విగ్రహముయొక్క స్వరూప వివరణాదికములను ఈ క్రిందను విశదీకరించెదను. తెలిసికొనవగును.

ప్రార్థనా శ్లోకము (రావణ విరచిత శివతాండవ స్తోత్రము :-

శ్లో॥ "ధరాధరేంద్ర నందినీ విలాస బంధుబంధుర ।
స్ఫురద్దిగంత (ద్ధి) గంత సంతతి ప్రమోద
మానమానసే ।
కృపాకటాక్షధోరణీ నిరుద్ధ దుర్ధరాపది ।
క్వచిద్దిగంబరే మనోవినోదమేతు వస్తుని ॥"

అని రావణబ్రహ్మ నిత్య నవకోటి శివపూజా ధురంధరుడు ప్రార్థించాడు ఆ శివుణ్ణి.

ఆనందతాండవ విగ్రహముయొక్క వివరణము :

శ్రీ నటరాజస్వామి జ్వాలమాలా ప్రభామండలము నందున నుండియున్నాడు. ఆ విగ్రహమునకు చుట్టును ఉండెడి వృత్తాకారము ఈ ప్రపంచమునందున గల సర్వనాదాత్మకమైనట్టి ప్రణవము (ఓంకారము) నకు చిహ్నముగా తెలియదగును. శిరస్సునందుగల జటాజూటమునందున గంగయును, అర్ధచంద్రుడును గలరు గనుకను గంగ సంపత్సమృద్ధికిన్ని, చంద్ర రేఖ అనుగ్రహమునకున్ను చిహ్నములు. మరియును చంద్రుడు కాలాధిపతికూడను, సూర్యచంద్ర, అగ్న్యాత్మకములైనట్టి శివునియొక్క మూడు నేత్రములున్నూ త్రికాలములకున్ను చిహ్నములు. అందు మూడవ నేత్రము జ్ఞానమునకు చిహ్నము. అందువల్లనే మన మీజ్ఞాననేత్రముండెడి స్థానమునందె తిలకమును ధరింతుము. మరియును శివునియొక్క కుడికర్ణము నందున మకరకుండలమున్ను ఇది పురుషులు ధరించునట్టి కర్ణాభరణము, వామ (ఎడమ) కర్ణమునందున నాటంకము (ఆనగాదుద్దు) ఉండును. ఇది అతడు అర్ధనారీశ్వరుడు గనుక స్త్రీచిహ్నముగా తెలియదగును. అతడు ధరించియుండినట్టి సర్పములు కుండలినీ శక్తికి చిహ్నములుగా తెలియనగును. అతడు కేవలమున్న భుజంగ భూషణుడేయగును. యజ్ఞోపవీతము (జంద్యము) అత్యంతమైనట్టి పవిత్రతకున్ను సర్వ కర్మాధిపత్యమునకున్ను, చిహ్నములు. నాలుగుహస్తములలోను పైన గల కుడిచేతియందున డమరుకము గలదు. ఈ డమరుకము ఈయొక్క విశ్వసృష్టికిన్ని చిహ్నము. దీనినుండి సకలశబ్దమయమున్ను ఉద్భవించుచున్నది. ఎట్లంటే :

శ్లో॥ నృత్తావసానే నటరాజ రాజో ననాదఢక్కాం
నవపంచవారమ్ । ఉద్ధర్తుకామాస్స
నకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్.

అవియే ఈనాడు వ్యాకరణ శాస్త్రజ్ఞులు ప్రారంభిస్తారు. సనాతనుడగునట్టి శంకరుడు మూడువేలమంది ఋషులతో ఢక్కను మోగిస్తు ఆనందతాండవము నొనర్చెను. ఆతడు ( నవపంచవారం ) పదునాలుగు పర్యాయములు ఢక్కను మ్రోగింపను శివసూత్రములు ఉద్భవించినవి. అవియే అనేక రీతులగునట్టి శబ్దశాస్త్రరీతులుగా పరిణమించియుండినవి. దీనికి పతంజలిమహార్షి జోష్యము చెప్పగా విఘ్నేశ్వరుడు వ్రాసియుండెను. నారదాదులగు మహా భక్తాగ్రేసరులందుకూడా కాళ్లకు గజ్జెలను గట్టి వీణా నాదంతో నృత్యము చేస్తూ శివసాక్షాత్కారాన్ని పొందారు, తరించారు. ఇది చేతియందలి ఢక్క యొక్క విశేషము. ఇకను క్రిందనుగల కుడిచెయ్యి అభయహస్తము, ఇది యీ అభయహస్తము స్థితికి చిహ్నముగా తెలియదగును. పైననుగల వామహస్తము నందునగల అగ్నిసంహారమునకు చిహ్నము అగును. క్రింది వామహస్తము దోలాహస్తము. ఈ దోలాహస్తము అనుగ్రహాత్మకమైనట్టిదిగా తెలియదగినది. పాదములు రెండింటిలోనను కుడిపాదము స్థితపాదము క్రింద నుండియున్నట్టి రాక్షసుడు దుర్గరామరణము లున్ను అజ్ఞానము మొదలైన వాటికి చిహ్నములు. అంటే; అట్టివాటిని అన్నింటినీ ఆతడు అణగద్రొక్కెను అని భావముగా తెలియదగినది. ఇట్టి యీ జయచిహ్నమే స్థితపదము అనబడుచున్నది. వామపాదము (ఎడమకాలు) కుంచితము (వంచబడినది) ఇది అనుగ్రహమునకున్ను మోక్షమునకున్ను చిహ్నము అగును. ఆతడు (ఆ శివుడు) ధరించియుండినట్టి గజచర్మము (ఏనుగుతోలు)న్ను తొడలమీదను గల కింకిణులు (గజ్జెలు)న్ను వీరత్వమునకు చిహ్నములు. ఇట్టి విధముగా నీ తాండవము పరమేశ్వరుని యొక్క పంచక్రియా శక్తికి చిహ్నము అయియున్నది.

పరమశివుడు నృత్తమును మాత్రమే కాక నృత్యమును గూడను అతడే సృష్టించెనని కోహలుడు చెప్పియున్నాడు. ఎట్లంటే :-

శ్లో॥ సంధ్యాయాంనృత్యతః
శంభోర్భక్త్యాగ్రేనారదః పురా,
గీతవాంస్త్రిపురోన్మాథం తచ్చిత్తస్త్వథ గీతకే ॥
చకారాభినయం ప్రీతస్తత స్తండుంచసో బ్రవీత్,
నాట్యోక్తాభినయేనేదంవత్సయో జయతాండవమ్॥

అని చెప్పెను. [చూడు అభినవభారతి 1వ సంపుటము 180వ పుట]. అంటే పైదానియొక్క భావము; "హిమాలయ పర్వతాగ్రమునందున ఒకనాటి సంధ్యాసమయము నందున మహానటుడగు శివుడు నృత్యము నొనర్చుచుండగా నాతని యెదుటను నారదుడు భక్తితో త్రిపురోన్మాధ గీతమును బాడెను. ఆ గీతమును వినుచుండినట్టి యా శివుడు సంప్రీత మనస్కుండై ఆ గీతికయొక్క అర్ధభావమును ఆతడు అభినయించెను. అంతట శివుడు తండువును పిలిచి ఇట్లు చెప్పెను. "ఈ తాండవమును నాట్యమందు చెప్పబడినట్టి అభినయముతో కూర్పుము" అని యాదేశించెను. ఇట్టిరీతిగా శివతాండవము వివరింపబడి యున్నది. ఇట్టి యీ శివతాండవమును ప్రదర్శించునట్టి నర్తకుడు ధన్యతనెందగలడు. ఆతడు ముక్తుడు కాగలడు.



# లేపాక్షి

దేవళ్ల సత్యనారాయణ

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

(గత సంచిక తరువాయి)

[స్థలం: లేపాక్షిలో ఒక మంటపం. పురుష వేషంతో సుధామయి ప్రవేశం]

సుధా: (చుట్టును చూచి) సృష్టికే యిది ప్రతి సృష్టి. ఈ శిల్పరామణీయత ఎంత హాయిగా ఉంది.

(శిల్పి ప్రవేశించును.)

శిల్పి : ఎవరు నీవు? నీ దేప్రాంతం? ఎక్కడినుండి నీ రాక?

సుధా: (బెదరిన చూపులతో చూచును.)

శిల్పి : భయంలేదు. చెప్పు నాయనా! నే నిక్కడి ప్రధాన శిల్పిని.

సు : ప్రధాన శిల్పాచార్యులా! నా దెంత అదృష్టం! స్వామీ! నమస్కారం. నేను పెనుగొండ ప్రాంతం నుండి వచ్చాను.

శిల్పి : ఇక్కడ మీవారెవరైనా ఉన్నారా?

సు : ఉన్నారు.... ఊహూ. ఇప్పుడు లేరు. శిల్పాలను చూద్దామని వచ్చాను. నాకు 'కళ' అంటే అభిమానం, గౌరవం.

శిల్పి : నిన్ను చూస్తూంటేనే ఆ విషయం తెలుస్తూ ఉంది.... కాని—

సు : విరుపప్రభువులు ఇక్కడ—

శిల్పి : ఆ! ఇక్కడే ఉన్నారు. ఆ మహామహులు జీవిత సర్వస్వాన్ని ఒడ్డి విశిష్ట కళా రచన చేయిస్తూ, అందులోనే తన్మయత పొందారు.

సు : వారు ఇప్పుడు—

శిల్పి : ఆ రంగమంటప నిర్మాణాన్ని తిలకిస్తున్నారు. కాని—

సు : కాని ఏమిటి స్వామీ!

శిల్పి : అబ్బాయీ! (బాగాచూచి) నిన్ను చూస్తూంటే నాకు ఆశలు మళ్ళీ మోసులెత్తుతున్నాయీ. సహాయం చేస్తావు కదూ?

సు : విషయమేమిటో తెల్పండి.

శిల్పి : ఒక స్తంభంలో తమ ఊహా సుందరి ప్రతిరూపాన్ని కాబోలు శిలారచన కావించమని ప్రభువులు కోరారు.

సు : (తనలో) ఎవ్వరా ఊర్వశి? ఆమెదెంతటి అదృష్టం!

శిల్పి : ఇప్పటికి దాదాపు ఆరు ప్రతిమలను వివిధ భంగిమలలో నాట్య శాస్త్రానుసారంగా లక్షణయుక్తంగానే గండరించాను.

సు : వారు చూడలేదా?

శి : చూచారు కాని, తన్మయత పొంద లేదు.

సు: అలాగా!

శి : వారి మనస్సులో ఎవరిదో ఏమో అపూర్వ కమనీయ రూపం ముద్రితమైంది. ఆమె స్వప్నసుందరో లేక దేవకన్యకో! వారికోర్కె తీర్చలేనేమో అని ఆందోళన పడ్డాను. నీవు సహాయం చేస్తే ఈ ఒక్కసారి ప్రయత్నిస్తాను.

సు : నాకు శిల్పాలను చూచి ఆనందించడమే కాని, నిర్మించడం తెలియదు.

శి : నీకు తెలియ నక్కరలేదు. సహాయం చేయాలి.

సు : నేనా?

శి : నీ కొక్కడికే అది సాధ్యం. తప్పక చేస్తానని మాటయిస్తే చాలు.

సు : (కంగారుగా) ఏమిటి?

శి : నీవు—

సు : నేను....

శి : స్త్రీ వేషం ధరిస్తే.... లోకంలో అతిలోక సౌందర్యవతికి కూడ లేని లావణ్యం పొంగారుతుంది.

సు : (భయంతో) ఆడవేషం వేయమంటారా?

శి : సగౌరవంగా అర్థిస్తున్నాను. నీలో పద్మినీ జాతి స్త్రీ లక్షణాలు సంపూర్ణంగా ఉన్నాయి. ఆ అపూర్వ సౌందర్యం పురుషుల్లో అసంభవం. కాని, నాకేమి అర్థం కావడంలేదు.

సు : (వెళ్ళ చూస్తుంది.)

శి : చిరంజీవీ! వెళ్ళకు, వెళ్ళకు. కళా ఖండాన్ని అసంపూర్ణంగా వదలివేయలేను. విరుపక్షభూపాలుని కోర్కె విఫలమైతే కళకు సార్థకత లేదు. నీవువెళ్ళితే నిరాశలో జీవించాలి.

సు : (ఆగి నిట్టూర్చి) మహాశిల్పీ!

శి : పరమార్థానికి పాటుపడే ఈ నిర్మాణంలో నీవూ భాగస్వామివి కావాలి. కడిగిన ముత్యంలా ప్రకాశించే నిన్ను సృజించిన ఆ పరమేష్టికి అసంపూర్ణ విశ్వ శిల్పి అన్న అపనింద పోయింది ప్రభువులకు ఆనందం కలిగించేందుకు నామాట మన్నించవూ?

సు : ఆ మహామహుని ఆనందానికి మీ యిష్ట ప్రకారమే స్త్రీ రూపం ధరిస్తా. నా జన్మకూడ సార్థకత చెందుతుంది.

(సుధామయి నిష్క్రమిస్తూ ఉండును)

శి : ఆ ప్రక్కమందిరంలోనికి రాయికరిగేవేళలో రావాలి. ఆ సుముహూర్తం తెల్పుతా. అంతా ప్రభువుకు తెలియకనే జరగాలి. అప్పుడు వారి ఆనందసాగరం ఒక్కసారిగా చెలియలి కట్టను తెంచుకొని పొంగుతుంది.

సు : అలాగే. (నిష్క్రమణ)

[ప్రవేశము విరుపణ్ణ]

శి: ప్రభూ!

విరు: శిల్పేశ్వరా! కళాసముద్రం శిల్ప తరంగాలను వెదజల్లుతూ ఉంది.

శి: మా సహాయ శిల్పులు అభినందనీయులు ప్రభూ!

విరు: ఆ పూర్ణేందు ముఖాలు- ఆ నాట్య ముద్రాంకితమైన హస్త విన్యాసాలు- ఆహా!

ఆ పూర్ణేందు ముఖంబు లా కనులలో
హాసంబు లా భావముల్
శ్రీ పూర్ణంబులు హారముల్ మకుటముల్
శృంగార భూషావళుల్
ఆ పొంగారెడి నాట్య భంగులను
రమ్యస్నిగ్ధ లావణ్యముల్
ఆ పాదాగ్ర శిఖంబు సుందరములై
ఆమూర్తు లొప్పారెడిన్.

శి: ప్రభూ! జన్మ చరితార్థమైంది.

విరు: శిల్పేశ్వరా! గణికాగ్రేసరుడైన గోరంట్ల తిమ్మప్ప, బసవణ సోమయాజి కన్పించారా?

శి: ప్రౌఢదేవరాయలచే సర్వమాన్యముగ నలుగురు బ్రాహ్మణులకు ఇవ్వబడిన దేవరాయపురమును మీరు విక్రయించుకొని, శ్రీ వీరేశ్వరునికి దానము సల్పిన శాసనం దగ్గర వారు కల్పించారు ప్రభూ!

విరు: దాన్ని వారే చెక్కారు.

శి: కృష్ణరాయపుర ప్రజలు ఒకతల పరిగి కాలువ క్రిందఉన్న పొలం ఏమకు నివేదించగా, అప్పట్లో మీరుఆర్జించిన భూములను ఈలేపాక్షి వీరేశ్వరునికే అర్పించారట!

విరు: మహాజనుల త్యాగనిరతి భావికాలాల వారికి ఎరుక పడేట్టుగ శ్రీ అచ్యుతదేవరాయ ప్రభువులు ఒక శాసనం కూడ వేయించారు.

శి: ఆ శాసనం చూచాను ప్రభూ! శాలివాహన శకం 1459 అని చెక్కించారు కాబోలు!

విరు: (నిట్టూర్పుతో) అప్పటిరోజులే వేరు.

[ప్రవేశము: బసవణ సోమయాజి]

బ.సో: అభివాదము ప్రభూ!

విరు: అభ్యుదయోస్తు.

శి: ఇప్పుడే తనను గురించి ప్రభువులు ప్రస్తావించారు.

బ.సో: ప్రభూ! అప్పుడే వచ్చాను. కాని, ఆ అష్ట దిక్పాలక భవనం చూస్తూ అలాగే ఉండి పోయాను.

విరు: అది ఆదిదంపతుల కళ్యాణ మంటపమని మా భావన. గిరిజ విశ్వేశ్వరుని తలపై చల్లు సేసలను అతి సున్నితముగ చెక్కిన శిల్పుల ఉక్కు ఉలిపని నేర్పు ప్రశంసనీయము. అందులోని అష్టదిక్పాలుర దివ్యమూర్తుల ప్రతిమాకల్పనాచాతురి మనోజ్ఞము.

బ.సో: ప్రథమ ప్రాకారకుడ్యము పైని కిరాతార్జునీయము, సిరితొండనికథ, మత్తేభయూధ కేళీ విలాసాలను చూస్తూచూస్తూ, ప్రపంచాన్నే మరచిపోయాను. అందుకే ఆలస్యమైంది. ప్రభువులు మన్నించాలి.

విరు : శిల్పీశ్వరా!

శి : ప్రభూ! (దగ్గరకు వచ్చును)

విరు : (కౌగలించుకొని) మనం చిరంజీవులము. ఇక కాలానికి తన గర్భంలో మన పేర్లను జీర్ణించుకొనే శక్తి లేదు.

శి : రంగ మంటప నిర్మాణం పూర్తి చేశాను. కళ్యాణమంటపం పై కప్పు నిర్మించాలి.

విరు : అలాగేనిర్మించు.

శి : ఒక్క మనవి.

విరు : నిర్మాణంలో సర్వస్వతంత్రత మీకే యిచ్చాను మనవి చేసుకోవలసిన అవసరమే లేదే.

శి : రంగ మంటపం పై కప్పున సహస్రదళ పద్మము, గంధర్వ విగ్రహాలు అమర్చాను. అందులోనే నేలమోయని అంతరిక్ష స్తంభాన్ని నిలిపాను. చిత్రకారులు కూడ స్కాందపురాణాన్ని పూర్తిగా చిత్రించారు. కాని—

విరు : వారి కోర్కె ఏమిటో వెంటనే తెలియ జేయండి.

శి : తమ రూపు రేఖావర్ణ సంయోగం కావించా లన వారి కోర్కె.

విరు : నా చిత్రపటాలేఖ్యమా?

శి : తమతోపాటు వీర భూపాలురు—

విరు : తమ్ముడు అంగీకరించాడా?

శి : తమకోసం ఎదురుచూస్తున్నారుకూడ.

విరు : నా రూపమా? (నవ్వి) పై వేచ్చు.
(నిష్క్రమించును.)

బ.సో: కవిసార్వభౌములే కాదు, సార్వభౌమా కవులు వెలసిన యుగం మనది. ఏ కార్యంలో కూడ పెద్ద ఎత్తుగడే కనిపిస్తుంది. నిమ్నో న్నత గోపుర శృంగ ప్రాసాదాలు, ఏక శిలా మండపాలు శిల్పహర్మ్యరూప కల్పనలు, సర్వుల దృష్టిని ఆకర్షిస్తాయి. నృసింహ మూర్తి, లింగమూర్తి వంటి శిలా సార్వ భౌమ శిల్పాలను విద్యానగరంలో వలె యిక్కడకూడ నిర్మిస్తే—

శి : ఆశలు, ఆశయాలు సిద్ధించినట్లే. కాని, అలాంటి ఏకాండ శిల ఒక్కటి మాత్రమే నాకు కనిపించింది. బసవేశ్వరుని అందులో తీర్చమని సహాయ శిల్పులను పంపాను.

బ.సో: మీ విన్నాణాన్ని ఎలా కొనియాడాలో!

శి : ప్రాకారాంతర్భాగంలో ఒక పెద్ద శిలను చూచే వుంటారు.

బ.సో: అంత పెద్ద శిలను ఎలా తెచ్చారా అని ఆశ్చర్యపడ్డాను.

శి : శిలలుకూడ మానవులవలె నిద్రాణములౌతాయి. పరీక్షించి, ఆ సమయం కనిపెట్టి, శిలను ఎత్తి తీసికొనిరావాలి. అప్పుడు బెండుకంటే తేలిక.

బ సో: అలా తెచ్చారా!

శి : మా సహాయ శిల్పులు తెచ్చారు. ఆ శిలలో ఏడు పడగల ఫణీంద్రుడు పడగలు విప్పి విశ్వేశ్వరుని ఆరాధిస్తున్నట్టుగా చెక్క దలచాను.

బ.సో: అసమానమైన మీ ప్రతిభాచాతురిని ఆ శిల్పమే వేనోళ్ళ చాటుతుంది. ఆలస్యం ఏమాత్రం చేయకండి.

శి : ఆలయాంతర్భాగంలో ఉంచడానికి స్తంభాలపై చెక్కిన అన్నపూర్ణ, మృత్యుంజయ విగ్రహాలను చూచారా ?

బి. సో: అన్నపూర్ణ విగ్రహంలో ఆధ్యాత్మిక సంయోజనము పారవశ్యత కనిపిస్తున్నాయి. దీప్తివంతమైన శివ విగ్రహంలోని రేఖాసమృద్ధి, దృఢత్వము, శివసంపూర్ణ శక్తిలోని పురుష సౌందర్య సంపదను వ్యక్తపరుస్తున్నాయి.

శి : (ప్రక్కకు చూచి) ఎవరో ఇద్దరు వ్యక్తులు వస్తున్నారు.

[ప్రవేశము దుర్గయ్య, మల్లయ్య]

దు.
మ | : నమస్కారము.

బి. సో: నమస్కారము, మీరు పెనుగొండ వాస్తవ్యులా ?

మ : చిత్తము.

దు : నా నివాసము గోరంట్ల.

బి. సో: మీ రాకకు ఏదో కారణం ఉండకపోదు.

దు : ముఖ్యమైన పనిమీదే వచ్చాము.

మ: సదాశివరాయ ప్రభువులు పెనుగొండ వస్తారట !

బి. సో: ఎవరు చెప్పారు ?

దు : పెనుగొండ వీధులన్నీ అలంకరిస్తున్నారు.

శి : ఆ భుజంగభూపతి మండలేశ పదవిని చేజిక్కించు కొన్నాడుగా !

మ : భుజంగభూపతి ఏదో కుట్రపన్నేలా గున్నాడు.

బి. సో: ఏ దుర్మార్గానికి తలపెట్టాడో ఏమో ! ఎక్కడ ఏ గోహత్య జరుగుతుందో ? మనం అప్రమత్తులై ఉండాలి. నేను విరుప ప్రభువులకు విన్నవిస్తా. (నిష్క్రమించును.)

మ : ఇక్కడికి ఓ అందమైన అబ్బాయి వచ్చాడు.

శి : అతడు గూఢచారి అని అంటారు. అంతేనా?

దు : కాదు, ఇప్పుడు అత డెక్కడున్నాడు ?

శి : మీతో తీసికెళ్లుతారా ?

మ : వారిని ఇక్కడ ఉంచడమే క్షేమం.

శి : ఎందుకు ?

దు : వారిని పట్టి తెప్పించాలని భుజంగభూపతి దేశం నాలుగు చెరగులకు చారులను పంపాడు.

శి : ఐతే, కర్తవ్యం ?

మ : ప్రమాదం తప్పింది.

దు : భగవంతుని దయ వుండబట్టి తప్పించు కొన్నాం.

శి : నాకేమి అర్థం కావడంలేదు.

మ : క్షమించండి. ఇందులో పెద్ద రహస్యం ఉంది.

శి : మీ రహస్యం గుట్టుగా ఉంచుతానని ప్రమాణం చేస్తున్నాను.

దు : ఐతే మేము కన్నవి, విన్నవి విన్నవించు కొంటాం.

మ : శ్రీ కృష్ణదేవరాయ ప్రభువుల ఆస్థాన ప్రధాన నర్తకి-

శి : రజకం కుప్పాయమ్మగారా ? ఆమె దక్షిణ దేశంలో అపూర్వ లావణ్యరాశి, నాట్యకళా

నిధి. సార్వభౌములు ఆమెను తమ రాజ్యంతో సమానంగా చూచుకొనేవారు.

దు : ఆమెగారికి పెద్దకాలంలో ఓ అమ్మాయి కలిగింది.

మ : సంగీత నాట్యశాస్త్రాలు ఆమె వెన్నంటుక పుట్టాయి.

దు : ఆమె అసమాన రూపవతి కూడాను.

శి : ఆమె ఎక్కడుంది ? ఏమిటి సంగతి ? వెంటనే చెప్పండి.

మ : ఒక్కమాటలో చెప్పాలంటే, ఆ సుధామయీ దేవిగారే ఈ అందమైన అబ్బాయి వేషంలో ఇక్కడికి వచ్చారు.

శి : ఆ ! అలాగా !

దు : భుజంగభూపతి విషయాలను పత్తేదారి చేయించి, గుట్టుగా ఆమెను పట్టి తెప్పించ చూశాడు.

మ : మేము గుట్టుగానే ఆమెను పురుష వేషంలో ఇక్కడికి పంపించివేశాము.

శి : మీరు-

దు : మేము శ్రీ విరుప ప్రభువుల దండులోని సైనికులము. కాలం తారుమారు అయిపోగా మండలేశ పదవిని ఆ భుజంగభూపతి చేజిక్కించు కొన్నాడు.

మ : మేము ఉద్యోగాలను వదలవలసి వచ్చింది. విరుపప్రభు సేవల్లో కాలం గడుపుతున్నాము.

శి : మీరు అభినందనీయులు.

దు : విరుప ప్రభువులకు మా ప్రాణాలర్పించినా వారి ఋణం తీర్చుకోలేము.

శి : ఐతే, ఆ అబ్బాయి సుదామయీదేవిగారన్న మాట ! నేను వెంటనే వెళ్లాలి.

[దుర్గయ్య మల్లయ్య ఒకరినొకరు చూచుకొంటారు]

మ : బాబూ ! గుట్టు రట్టు చెయ్యకండి.

శి : మీకా భయం వద్దు. వారి గౌరవ ప్రతిపత్తులకు ఏలోటు రానివ్వకూడదు. (నిష్క్రమణ)

[దుర్గయ్య మల్లయ్య మఱియొక ప్రక్కగా నిష్క్రమిస్తారు.]

[ తెరపడును ]

## ద్వితీయ రంగము

[స్థలం : పెనుగొండలో భుజంగభూపతి ఆస్థానము - సమయం : తెల్లవారుజాము - భుజంగ భూపతి పచారు చేస్తూఉండగా ప్రవేశం జాఫర్]

జా : (వంగి, సలామచేసి) హుజూర్‌వారికోసం కోటంతా తిరిగాను. తమరు ఇక్కడే-

భు : మేమే స్వయంగా ఆస్థానాలంకరణ చేయించ డములో శ్రద్ధ వహించాము. నీవు వెళ్లినపని?

జా : మంచిమాటలకు మామిడిపళ్లు రాలవు సర్కార్ ! ప్రజల్ ఎప్పుడూ తమ గోడే చెప్పుకుంటుంది: మనకు కావలసిన పైసా యిస్తేనా ? ఇవ్వనిస్తేనా ? సర్కారువారు హుకుం ఇస్తే సిపాయీలను నడిపిస్తా. ఇళ్ళు దోపిడీ చేయిస్తా. పైసాల్ రాల్తాయి.

భు : ఇది కాదు సమయం. సార్వభౌములు గగన మహల్‌లో విశ్రాంతి తీసికొంటున్నారు. ఈనాడు దర్బార్ ఏర్పాటు చేశాను. ఏ

క్షణంలోనైనా యిక్కడ ఉండవచ్చు. వారు వెళ్లనీ.

జా : అచ్ఛా ! షెహన్షావారికి గానా-పీనా-బజానాలు-

భు : అన్నీ ఏర్పాటు చేశామోయ్. అప్సరలే ఆడుతారనుకో.

జా : తమకు చెప్పాలా ! బహుత్ అచ్ఛా హుజూర్.

[చేత ఒక మూటలో కాశయ్య ఏడుస్తూ ప్రవేశిస్తాడు]

కా : ప్రభువులే రక్షించాలి.

జా : ఎందుకేడుస్తావ్ ? ఏం జరిగింది ?

[ కాశయ్య మూటవిప్పి, ఒక చీరను చూపించి ఏడ్చును.]

జా : ఏయ్ బుద్ధూ ! ఏంజరిగిందో చెప్పరా ?

కా : (ఏడుస్తూ) చచ్చిపోయింది.

భు : ఎవరు చచ్చారు ? ఎందుకు చచ్చారు ? ఎలా చచ్చారు ? చెప్పిచావరా, అప్రాచ్యుడా !

కా : మరే....నేను....నేను....ఆమె యింటికెళ్లాను. ఆమె-

భు : ఛీ ! ఛీ !

జా : ఆమె ఎవ్వరురా ?

కా : అయ్యో ! అయ్యో ! మీరూ అప్పుడే మరిచారా ?

భు : జాఫర్ ! ఈ వెధవను ఎక్కడికైనా పంపావా ?

జా : (తల గోక్కుంటూ) ఆ పద్మిని యింటిపైకి పంపాను సర్కార్ !

కా : ఔను ప్రభూ ! (చీర చూపించి ఏడుస్తాడు)

భు : ఏమిటో ? వివరంగా చెప్పరా !

కా : నేను ఆమె యింటిలోకెళ్లాను. ఆమె అక్కడ లేదు.

జా : ఏం జరిగింది ?

కా : ఆమె లేదని వీధులన్నీ గాలించి, కోట ప్రక్కవీధికెళ్లాను.

భు : అక్కడ కన్పించిందా ?

కా : కన్పించాడు ప్రభూ ! ఆహాహా ! ఏమి ముఖ వర్చస్సు ! ఎంత పెద్ద గడ్డం !! ఏమి విభూతి రేఖలు !!! అబ్బా !

[భుజంగభూపతి జాఫర్‌ను చూస్తాడు. జాఫర్ తల వంచుకుంటాడు]

కా : ఆయన నాముఖం చూచాడా ! వెంటనే నా కథంతా చెప్పాడు.

భు : ఏయ్ ! కథలు చెప్పక వెంటనే కళ్ళారా చూచింది చెప్పు.

కా : (చెంపలు వేసికొని, తలమీద చెయ్యిపెట్టుకొని) సత్యప్రమాణం ప్రభూ !

జా : ఊఁ !

భు : (విసుగుకొనును )

కా : ఆమె ఎలా వెళ్లిందా అని ఆయన్ను అడిగాను ప్రభూ ! ఆయనేమో వ్రేళ్ళు లెక్కెట్టి, ఈ ప్రక్కగా వెళ్ళిందంటూ చూపాడు. వెంటనే సిపాయీలను పంపాను.

జా : వాళ్ళు పట్టితెచ్చారా ?

జా : రాత్రంతా తిరిగి, బారెడు ప్రొద్దెక్కాక (చీర చూపుతూ) దీన్ని తెచ్చారు. ఆమె గోరంట్ల దగ్గఱ కోనేటిలో అమాంతంగా దూకి (ఏడుస్తూ) చచ్చిపోయిందట !

జా : అంత సులభంగా చావనిచ్చారురా ?

భు : అందుకే నిన్నే స్వయంగా వెళ్లమన్నాను జాఫర్ ! ఛీ ! ఛీ ! కధ అడ్డం తిరిగింది.

జా : ఆమాత్రం చేయలేరా అవి మంచి వస్తాదుల్లాంటి సిపాయీలనే పంపాను సర్కార్ !

భు : (నిట్టూర్పు) ఆమె చావన్నా గుట్టుగా ఉంచండి (క్షణమాగి) ప్రభువులు నిద్ర లేచి ఉంటారు. నేను దగ్గరే ఉండాలి.

[నేపధ్యంలో బాకా ఊదుతారు]

పూర్ణకలశంతో భద్రగజంతో కదలి స్వయముగా వెళ్లాలి. మీరు ఇక్కడే ఉండి ఏ లోటుపాట్లు రానీకుండా అన్ని యేర్పాట్లు చేయండి.

జా : జీ హుఁ సర్కార్ !

కా : చిత్తము.

భు : సార్వభౌములు ఇక్కడి వేసవి విడిదికి వచ్చారు. దర్బార్‌లో కాని, ప్రత్యేకంగా కాని ప్రజలగోల ప్రభువులయెడ చెవినిపడకూడదు.

జా : కట్టుదిట్టాలు చేశాము సర్కార్ !

[భుజంగభూపతి నిష్క్రమిస్తాడు]

ఎంతపని జరిగింది కాశయ్యా !

కా : పెద్ద పోరుకూడా జరిగింది హుజూర్ !

జా : ఏమిటేమిటి ?

కా : పద్మిని యింటిదగ్గఱి కెళ్లాము. మన సైనికులు రంతా వస్తాద్, రహీంఖాన్ ఇద్దఱూ బైట నిలుచున్నారు. నేనుమాత్రం లోని కెళ్లాను.

జా : లోన పద్మినీ ఉందీ ?

కా : లోన ఉండివుంటుంది కాబోలు కాని. ఇద్దఱు నామీద కత్తులతో విఱుచుక పడ్డారు.

జా : లడాయీ జరిగిందీ ?

కా : ఇద్దరిలో ఒకడి డొక్కలో తన్ని, సఫాచేసి, వాడి కత్తి లాక్కున్నాను. ఇంకొకడితో యుద్ధం చేశాను. ఇంతలోనే నలుగురు వచ్చారు. ఈ ఐదుమందిని చితక్కొట్టి పారేశానా ? ఇంకో ఆఱుగురు ఈ చెలతో పైబడ్డారు. ఒక క్షణం ఆలస్యం చేసివుంటే ఈపాటికి చచ్చివుండేవాణ్ణి.

జా : ఏం చేశావ్ ?

కా : (మీసంత్రిప్పి జాఫర్ మీదికి లంఘిస్తూ) ఒక్కొక్కడి గుండెల్లోనూ మెఱుపులా మెఱశాను. (మూలుగుతూ) ఉరుములా ఉరిమాను. వెధవలు ! చచ్చు సన్నాసులు ! తోకలు భుజాన వేసికొని పారిపోయారు.

జా : పారిపోనిచ్చావా ?

కా : పిఱికిపందలు, వెళ్ళితే వెళ్ళారు.

జా : పద్మిని ఏమైంది ?

కా : ఆ రాక్షసులతో నా పోరుచూచి, భయపడి పారిపోయి ఉంటుంది. తర్వాత జరిగింది చెప్పానుగా.

జా : ఊఁ, ప్రభువులు దర్బారుకు హాజరౌతున్నారు.

కా : మరి నేను సెలవు తీసికొంటాను. [నిష్క్రమిస్తాడు.]

జా : మజా దేఖియే, మజా కరీయే, అప్‌కా ఖుషీహై. [నిష్క్రమిస్తాడు.]

[నేపథ్యంలో-బాకాశబ్దాలు, మంగళ వాయిద్యాలు వేత్రహస్తవంది మాగధ వైతాళికుల స్తోత్ర పాఠాలు]

[ నే ప థ్యం లో ]

1వ వై : శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర కర్ణాటాంధ్ర సార్వభౌమా ! కవిపండిత చకోర చంద్రమా ! బహుబలోద్దండ రిపుగర్వ భంజనా ! జయ జయ శ్రీ సదాశివరాజేంద్ర భూపాలా !

2వ వై : జయ జయ స్వస్తి కర్ణాటాంధ్ర సార్వభౌమా! ధర్మధౌరేయా ! దాన రాధేయా ! వీర రమా సమారోహణారంభ సోపాన దోస్తంభ జయ జయ శ్రీ సదాశివరాజేంద్ర భూపాలా !

1వ వై | 2వ వై : సముంచిత యశోవిశాలా ! బహుపరాకు, బహుపరాకు.

[సదాశివరాయలు, భుజంగభూపతి, జాఫర్, కాళయ్య ప్రవేశింతురు. సదాశివరాయలు సింహాసనాసీనుడగును]

భు : [కొంత ముందుకు వచ్చి] మహాజనులారా ! మన సార్వభౌములు కోరి తమ ఏలుబడిలోని పెనుగొండ మండలానికి స్వయంగా విచ్చేసి, మనల్ని పావనం చేశారు. అష్టప్రధానులతో ప్రజలకు ఏ కష్టాలు రాకుండా వారు పరిపాలిస్తున్నారు. వారి అడుగుజాడలే మనకు అనుకరణ యోగ్యాలు. [మహారాజు వైపు తిరిగి] ప్రభూ ! ఇక్కడి ప్రజలు ఏ కష్టాలు లేక కరవుకాటకాలకు గురికాక, సుఖంగా ఉన్నారంటే, అది తమ చల్లని చూపే. తమ రాజ్యాంగ యంత్రంలో మేము శిస్తులు వసూలుచేస్తూ ప్రజా సంక్షేమానికి వినియోగిస్తున్నాము. ఈ సంవత్సరం—(జాఫర్‌వైపు చూచి సైగ చేయును.)

జా : చిత్తగించండి సర్కార్ ! ఎనిమిదివేల వరహాలు, ఐదువేల మణుగుల వెండి తమ ఖజానాకు పంపాము. ఇంకా—

భు : వసూలు కావలసిన మొత్తం ?

జా : ఆరువేల వరహాలు సర్కార్ !

భు : వసూళ్లెందుకు చేయలేదు ?

జా : ఆ విరుపణ్ణ ఖజానా ఖాళీచేసింది చాలక, ప్రజలను తిరుగుబాటు చేయిస్తున్నాడు సర్కార్ !

సదా : విరుపణ్ణ రాజధన మపహరించి ప్రజలను తిరుగుబాటు చేయిస్తున్నాడా ?

భు : (గట్టిగా) జాఫర్ !

జా : సర్కారువారికి ఎన్నోసార్లు మన్వి చేశాము. విరుపణ్ణ గుడికట్టే పేరుతో కోటనే కడుతున్నాడని ఇప్పుడే తెలుసుకొన్నాం.

సదా : (కాళయ్య వింజామరముతో విసరుచుండగా) ఆఁ ! విరుపణ్ణ కోటనే నిర్మిస్తున్నాడా ?

కా : (వింజామరమును పైకి ఎత్తి) దేశానికి కీడు తలపెడుతున్నాడే ! ఎంత రాజద్రోహం !!

జా : (కాళయ్యను చురచుర చూస్తాడు. వెంటనే కాళయ్య వింజామరను విసరుతాడు)

భు : జాఫర్ ! గూఢచారులను పంపావా ?

జా : జీ హాఁ సర్కార్. విరుపన్నకు కూడ గూఢచారులున్నారు.

భు : ఈ సభలో అతని పంచమాంగదళం ఉంటుందనేగా నీ నమ్మకం.

జా: (తల ఊపును)

సదా: విరుపణ్ణ కోట నిర్మించి గూఢచారులను పంపే అవసరం?

భు: అతణ్ణి తమరు మండలేశ పదవినుండి తొలగించి నాకా పదవి ఇప్పించారు. అటు తమపైన, ఇటు నాపైన కక్ష సాధించడానికి తిరుగుబాటు చేయదలచుకొన్నాడు కాబోలు!

కా : ప్రభుద్రోహం మన్నించరానిది.

జా : ఆ శిల్పి శత్రురాజ్యం నుండి వచ్చాడని, గూఢచారి అని మన వారలు రహస్యంగా కనిపెట్టి చెప్పారు.

భు : ప్రభూ! ఈ పెనుగొండ మండలాన్ని పరిపాలిస్తూ ఇక్కడ నేను పెట్టే దీపం మీరు. ఆ దీపపు దీప్తి విరుపన్న దృష్టిని కన్నులు గ్రుచ్చుతుంది కాబోలు! అందుకే ప్రజాశలభాలను రేపుతున్నాడు.

జా : ఆలస్యం చేస్తే చాల ప్రమాదం ప్రభూ!

సదా : విరుపణ్ణ ఇంత ద్రోహానికి తలపెడుతాడా?

భు: రాజ్యచక్రపు మేల్పిడి చేతబట్టి దుశ్శత్రుల నెదుర్కొనే మీలాటి సార్వభౌములకు ఈ విరుపణ్ణ ఒక లెక్కా ప్రభూ!

జా : వాడెక్కడ? మన మెక్కడ? సర్కారువారు హుకుం ఇస్తే ఒక్క క్షణంలో సిపాయీలను నడిపిస్తా. ఆ ద్రోహిని పట్టితెస్తా.

భు : వాడికి చక్కని పాఠాలు నేర్పాలి.

జా : ఆజ్ఞాపించండి సర్కార్! వాడిని బంధించి ప్రాణాలతో మీ పాదాల ముందు పడేస్తా. లేదా ... వాని తల నరికి తెస్తా.

భు: జాఫర్! నీ భుజముల మీద ఆ మాత్రం విశ్వాసం మాకు లేకపోలేదు. కాని, అనవసరమైన ఘర్షణ రక్తపాతం ఎందుకా అని ఆలోచిస్తున్నాము. మేము శాంతి దూతలమని ప్రభువులకే తెలుసు.

కా : ఆ విరుపన్నను శిల్పిని పట్టితెస్తే చాలదూ?

(భుజంగభూపతి, జాఫర్, కాళయ్యను చురచుర చూస్తారు. కాళయ్య నాలుక కరచికొని వింజామర వీస్తాడు.)

సదా : ఔను. ఆ విరుపణ్ణను శిల్పిని సభకు హాజరు పరచండి. మేమే స్వయంగా వారిని విచారించి దండిస్తాం. భుజంగ నాయకా! మీ ఆలోచనలకు తగిన ఆధారాలను సిద్ధం చేసికొనే బాధ్యత మీమీదే ఉంది.

భు : (పరధ్యానంగా) చిత్తం ప్రభూ!

సదా : ఈ నాటికి సభ చాలిస్తున్నాము.

(లేచి నిలుచుండును)

[నేపథ్యంలో]

సరోజా సనానంద సౌందర్యమూర్తీ!
సరోజాత సంజాత చాతుర్యపూర్తీ!
ధరిత్రీ సురాధీన దానానువర్తీ!
శరచ్చంద్రికాపూర సారూప్యకీర్తీ!

[భుజంగ భూపతి, జాఫర్ తప్ప మిగిలిన వారు నిష్క్రమిస్తారు.]

భు : (క్షణమాగి) నాకేదో భయంగా ఉంది జాఫర్!

జా : మీకెందుకు భయం సర్కార్! ఆ విరుపణ్ణను, శిల్పిని రేపు పట్టితెచ్చే భారం నాది.

భు : నీ పాపని చేస్తావనే మా విశ్వాసం. కాని, ఆ విరుపదు రాజ ద్రోహి అని విందు కొలువులో ఎలా విరూపించాలో అర్థం కావడంలేదు.

జా : తమరే అలా అంటారేం హుజూర్!

భు : అది కాదు జాఫర్! ఆ విరుపణ్ణి వాక్చాతురి, ప్రజలకు నానిపై గల అభిమానం ముందు నా అభియోగం ఎలా సమర్థించు కోవాలా అని—

జా : ఇంత కథ నడవదనుకున్నాను.

భు : ఆ వెధవ కాళయ్య సలహా అలా ఇచ్చాడు. మహారాజు అందుకు ఒప్పుకొన్నాడు. (నిట్టూర్చి) ముందు కార్యం ఆలోచించాలి.

జా : ఆలోచించండి సర్కార్ !

భు : ఒక పనిచేస్తే—

జా : చెప్పండి సర్కార్ !

భు : (పచారుచేస్తూ అప్పుడప్పుడాగి) మహారాజు విరుపణ్ణను చూడదలచుకొన్నాడను వార్త తెలిపితే చాలు, వాడై వాడే వస్తాడు. ఆ శిల్పిని ఇప్పుడు తీసికొని రానక్కరలేదు.

జా : జీహాఁ సర్కార్ !

భు : ఆ విరుపడు లేపాక్షి వదలి వచ్చాక మన తుపాకీ సైనికులను రాత్రికిరాత్రే లేపాక్షిలో కాల్పులు జరించమను. ప్రజలు ఎదురు తిరుగుతారు. అప్పుడు మన సైనికులు ఎవరి చేతికీ చిక్కకుండా తప్పించుకొని రావాలి.

జా : ఆ తర్వాత ?

భు : ఆడిస్తాం చూడు బొమ్మలాట.

(నిష్క్రమిస్తారు.)

[ తెరపడును ]

[ స్థలం : లేపాక్షిలో ఒక మంటపం - సుధామయి నృత్యము ]

పాట

సుధా :-

కనకాంగి నిక నీవు కరుణించరా
కనుమూయ నీ మేను కనిపించె కదారా ॥కన॥

మల్లెలు మొల్లలు కొల్లగ కోసి
మాలలు విరివిగ మనసార కూర్చి
అలికిడి కొంత వీనుల బడగానే
వలపు తెలుప వాకిలికడ నిలిచే ॥కన॥

సుమముల సరసన భ్రమరాలు చేరి
పులిమెను దేహాల నెత్తావి ధూళి
తుమ్మెద లంటని కమ్మని పూవుల
నెమ్మది నేరి తల్పమ్ముపై రాల్చితి ॥కన॥

[ శిల్పి ప్రవేశిస్తాడు ]

శి : తేనెలు సోనలై పారే మీ మధుర గాన స్రవంతి శిలలలో ఒయ్యారి రూపాలను వెల యించింది.

సు : మీమాటలు నన్ను పులకాంకితను చేశాయి.

శి : అంతేకాదు. భావాలు స్వరాలై సరాగ సౌందర్యాలకు రంగులు దిద్దాయి.

సు : సృష్టికి ప్రతిసృష్టి చేయగల శిల్పులే పొగడ్తలు ప్రారంభించారు !

శి : ఫణీంద్ర శిల్ప భగ్నత నా మనశ్శాంతిని భంగ పరచింది. ఈ సంక్షుభిత హృదయాన్ని మీ మధుర గానం తన్మయ పరచింది.

సు : సుఖ దుఃఖాలను సమదృష్టితో చూచే మీకే ఆ దృశ్యమ్ తలపశక్యము కానిదా ?

శి : ఏడు పడగల నాగేంద్రుడు విశ్వేశ్వరునికి ఛత్రమై విలసిల్లేలాగ ఒక పచ్చి గుండును నాలుగు గడియల్లో మొలచాను. ఎదుటనున్న పాకశాలనుండి తల్లి భోజనపువేళ హెచ్చరించ వచ్చింది. అంతే.

సు : ఆమె దృష్టిదోషం సోకి పాము పడగ పగిలిం దని విన్నాను.

శి : శిలాదోషమే కాని తల్లి దృష్టి దోషం కాదు.

సు : మీరు చాల బాధపడ్డారట !

శి : మీ అమృతగానం ఆ బాధను తుడిచివేసింది. సుధామయీదేవీ ! మీ వెన్నెల ప్రతిబింబించే లావణ్యనిధిని స్తంభంలో చూచి విరుప ప్రభువులు తప్పక తన్మయత్వం పొందుతారు. తలచుకొంటేనే మనసు హాయి హాయి అంటుంది.

సు : (సిగ్గుతో తలవంచుకొని) ధన్యురాలిని.

శి : ఆ స్తంభంలోనే పాంచాల పురుష ప్రతిమను కూడ రూపొందించాను.

సు : చూచాను. [చిరునవ్వుతో] ఆ కన్నులు, ఆ ముక్కు, అన్నం మీవే.

శి : నావే అనుకొన్నారు రాబోలు !

సు : [చిలిపిగా నవ్వుతూ వెళ్లబోతుంది)

శి : సుధామయీ !

సు : మాలతీ పొదరింట్లో పడుకొన్న లేడిపిల్లలు నిద్ర లేచి ఉంటాయి. నేను వెళ్లాలి. [నిష్క్రమిస్తుంది.]

శి : [పరవశత్వంలో ఉంటాడు.]

[ ప్రవేశము విరుపణ్ణ ]

విరు : శిల్పీ ! మీ ఏకాగ్రతను భంగపరచాను.

శి : ప్రభూ !

విరు : మీ చేతుల్లో రాయి మెలిదిరిగి రమణీయమైన రమణిగా నాట్యం చేస్తూఉంది.

శి : తమరు ఆ నాట్యభంగిమను చూచారు కాబోలు!

విరు : చూచి మిమ్మభినందించ దలచాను. కాని మాటలు రావటంలేదు. వచ్చినా, చాలవు కనుక.

శి : అది ప్రభువులకు నాపైగల అవ్యాజ ప్రేమ.

విరు : (ఉత్సాహంతో) ఆ శిల్పసుందరి సజీవ నృత్యగానాలు కోటివీణెలు మీటినట్లు, కళ్లకు కట్టినట్లు ఉన్నాయి. విద్యానగరంలో ఒక ప్పుడు చూచాను. అదే ముఖ కవళికలు.... అదే నాట్యభంగిమ.... అప్పుడు మీరు ఆ నాట్యసుందరిని చూచారా ?

శి : అప్పుడు చూడలేదు ప్రభూ !

విరు : మరి మూడుమూర్తుల ఆ నాట్యసుందరి ప్రతి రూపం ఎలా తీర్చగలిగారు ?

శి : ఆమెను ఇక్కడే చూచాను.

విరు : ఆ కళామూర్తిని ఇక్కడ, ఈ మందిరంలో చూచారా ?

శి : అది ఒక దివ్యసంఘటన ప్రభూ !

విరు : ఆమెను ఇక్కడే చూచారా ?

శి : ప్రఫుల్ల ముఖకాంతులతో కోమల కిసలయు డైన ఒక అబ్బాయిని చూచాను. అలాంటి అందం పురుషజాతికి అసంభవం. కాని సృష్టి వైచిత్ర్యానికి విస్తుపోయి ఆ అబ్బాయిని స్త్రీ వేషం ధరించమన్నాను.

విరు : అంగీకరించాడా ?

శి : అంత తేలికగా అంగీకరించలేదు. బ్రతిమాలి ఒప్పించాను.

విరు : బహుశా విజయనగర నాట్యసుందరికి తమ్ముడేమో ?

శి : కాదు ప్రభూ !

విరు : అలాగైతే ?

శి : దుర్గయ్య మల్లయ్య అనే ఇద్దరు మాజీ సైని కుల ద్వారా అంతా విన్నాను ప్రభూ !

విరు : ఏమని విన్నవించారు ?

శి : సుధామయీదేవి విద్యానగరం వదలి పెను గొండలో సామాన్య దేవదాసిగా వర్తించే వారట తమరు పాలించే రోజుల్లో.

విరు : సుధామయి పెనుగొండలో ఉండేదా ?

శి : భుజంగభూపతి సైనికులచే పట్టి తెప్పించ సంకల్పించే వరకు—

విరు : భగవాన్ ! ఆ భుజంగుడి బుద్ధి చివరకు ఇలా ప్రకోపించిందా ?

శి : ఆ విషయం తెలిసికొని మల్లయ్య దుర్గయ్యలు ఆమెను పురుషవేషంలో లేపాక్షి చేర్చారు.

విరు : ఆ సుధామయి ఇక్కడే ఉందా ? ఆమె నెల వెక్కడ ?

శి : ఏమో ! కాని, అప్పుడప్పుడు కల్యాణ మంట పంలో స్వేచ్ఛగా ఆడుతూ పాడుతూ కనిపి స్తుంది.

విరు : ఆమె కళకు ప్రతిరూపం..........శిల్పా లకు ప్రాణం. కళను కళే గుర్తించి వరిస్తుంది.

శి : ప్రభూ ! తమకు ఆనందం కల్గించాను. నా తపస్సు ఫలించింది.

విరు : అలా కాదు. మీ రాకతో మా తపస్సే ఫలించి కళ సాక్షాత్కరించింది. శిల్పేశ్వరా ! ఆ ఉపాధిదేవత ఏ లవలీనికుంజంలోనో, ఏ దేవ మందిరంలోనో ఉంటుంది. ఒక్కసారి వెళ్ళి స్వాగత వచనాలు పలుకందే మనస్సుకు సంతృప్తి ఉండదు.

శి : అలాగే. ఐనా, ఎక్కడికని వెళ్తారు ?

విరు : ఈ లేపాక్షిలో ఎక్కడైనా సరే. కాని, మీరు మాత్రం ఇక్కడే ఉంటే వెంటనే తిరిగి వస్తాను. మీతో కొన్ని ముఖ్య విషయాలు ముచ్చటించాలి.

శి : చిత్తం.

[విరుపణ్ణ నిష్క్రమిస్తాడు]

మణి బంగారంలో పొదిగినప్పుడే బాగా ప్రకాశిస్తుంది.

[ప్రవేశము బసవణ సోమయాజి]

బ. సో: శిల్పేశ్వరా ! ప్రభువులు ఇక్కడకూడా లేరా?

శి : ఇంక కొంతసేపటికి వస్తారు. నన్నిక్కడే ఉండమన్నారు.

బ. సో: విషయాలను వినే వుంటా రనుకొన్నాను.

శి : ప్రభువులు ఏదో ముఖ్యమైన విషయాలను చెప్పాలన్నారు.

బ. సో: వారు ఆందోళనగా కన్పించారా ?

శ్రీ : అలా కన్పించలేదు. విషయమేమిటి ?

బ. సో: సార్వభౌముల సమక్షంలో భుజంగ భూపతి విరుప ప్రభువులపై లేనిపోని నిందలు మోపి ఆగ్రహం తెప్పించాడట !

శ్రీ : ఉదయంనుండి అన్నీ అపశకునాలే. ఏడు పడగల ఫణీంద్ర శిల్పం భిన్నమైనప్పుడే సందేహించాను.

బ. సో: విరుప ప్రభువును సార్వభౌములు సభలో తామే స్వయంగా విచారిస్తారట! ఈ విషయం వారికి ఎలా చెప్పాలో, నాకే అర్థంకావటం లేదు.

శ్రీ : ఎలాగో మీరే చెప్పాలి. అందుకు మీరే సమర్థులు. వెంటనే వెళ్ళి వారికి ఎరుక పరచండి.

బ. సో: (నిష్క్రమిస్తారు)

శ్రీ : ఏదో అపచారం జరిగింది. పరమేశ్వరునికి ఆగ్రహం కల్గింది.

[ ప్రవేశం : మల్లయ్య ]

మ : ప్రభూ ! ప్రభూ !

శ్రీ : మల్లయ్యా ! పెనుగొండనుండేనా రాక ?

మ : సార్వభౌముల దర్బారునుండే. విరుప ప్రభువులను రేపు నిండుసభలో విచారిస్తారట !

శ్రీ : ఇప్పుడే విన్నాను.

మ : మీరుకూడ వెళ్ళాలట !

శ్రీ : నేనా ?

మ : మీ యిద్దరిపై కల్పించి చెప్పాడా భుజంగ భూపతి.

శ్రీ : అలాగైతే నేనూ వెళ్ళాలన్నమాట !

మ : మీకోసం సైన్యాలతో దళపతి జాఫర్ వస్తాంటాడు.

శ్రీ : ఐతే కాలయాపన వద్దు. ప్రమాదమేదైనా సంభవించవచ్చు. నీవు వెళ్ళి విరుప ప్రభువులకు సర్వము విన్నవించి, కర్తవ్యము ఆలోచించమను.

మ : (నిష్క్రమిస్తాడు.)

[మరియొక ప్రక్కనుండి బసవణ సోమయాజి, విరుపణ్ణ ప్రవేశిస్తారు.]

విరు : సోమయాజీ ! మేము వెళ్ళి సార్వభౌములను దర్శించి వస్తాము.

శ్రీ : నన్నూ విచారిస్తారట ! నేనూ తమ వెంట వస్తాను.

విరు : మీరు వస్తే, ఇక్కడ నిర్మాణం ఆగిపోదూ ? మేమే వెళ్ళి నిర్దోషిత్వాన్ని నిరూపిస్తాం. సార్వభౌములు మన్నిస్తే లేపాక్షికి ఆహ్వానిస్తాం. వెంట తీసుకొని వస్తాం.

బ. సో: ఆ భుజంగ భూపతి మాయావి ప్రభూ !

విరు : అప్పుడు నిజానిజాలు నిలదీసి అడుగుతాం. సార్వభౌములేమీ గ్రుడ్డివారు కారు.

శ్రీ : నేను కూడ—

విరు : నా మాటల్లో, నిదర్శనాల్లో నమ్మకం కల్గక పోతే మీరు వచ్చినా ప్రయోజనం అంతే.

బ.సో: మీరు ఒంటరిగా వెళ్లుతారా? రాత్రి కావస్తూంది ప్రభు!

విరు : నాకు శత్రువులే లేనప్పుడు భయమెందుకు? రాత్రికి ఆ చంద్రుడు తోడువస్తాడు కదూ!

సోమయాజీ! అలయ నిర్మాణంలో ఏ పరిస్థితి లోనూ ఆలస్యం జరగకూడదు. అదే మా లక్ష్యం. (నిష్క్రమణ)

[ప్రవేశం: సుధామయి, మల్లయ్య]

సు : సోమయాజిగారూ! —

బ.సో: విరుప ప్రభువులు పెనుగొండకు బయల్దేరారు.

మ : శిల్పాచార్యులు ఇక్కడే ఉన్నారే!

బ.సో: వారిని ఇక్కడే ఉండమన్నారు.

సు : వారిని ఒంటరిగా వెళ్ళనిచ్చారా? అందులోను ప్రొద్దప్పుడు.

శి : తమకేమి భయం లేదన్నారు.

సు : (దుఃఖంతో) శత్రుమధ్యంలోనికి ఒంటరిగా వెళ్లనిచ్చారా?

బ.సో: తమకు శత్రువులే లేరన్నారు.

సు : (గద్గద స్వరముతో) నాకు చాల భయంగా ఉంది మల్లయ్యా! మనస్సు ప్రమాదాన్నే శంకిస్తూంది. నీవైన ప్రభువులకు తోడుగా వెళ్లు.

శి : ఔను మల్లయ్యా! మమ్మెవరిని తమ వెంట రానివ్వారుకారు. నీవైనా వెళ్ళు.

బ.సో: వారు కొండ ప్రక్కని దుర్గమ మార్గంలో శ్వేతాశ్వముపై వెళ్తుంటారు. నీవూ ఆదారినే వేగంగా వెళ్ళాలి.

మ : చిత్తం. (నిష్క్రమణ)

సు : అబ్బా! ఎంత సాహసానికి పూనుకొన్నారు? దైవం వ్యతిరేకిస్తే మన గతి ఏమికాను?

బ.సో: సుధామయీదేవి గారూ! మీరు విశ్రాంతి తీసుకోండి. శిల్పేశ్వరా! వారికి తోడుగా వెళ్ళి ప్రశాంతిని చేకూర్చండి.

(శిల్పి, సుధామయి నిష్క్రమిస్తారు)

[నేపథ్యంలో - ఎవరో జారిపడ్డట్టు శబ్దం]

బ. సో: ఏమిటీ శబ్దం? ఎవరో జారిపడ్డట్టుంది. (గట్టిగా) ఎవరక్కడ?

[ప్రవేశము : కాళయ్య]

బ. సో: ఏయ్! ఎవరు నీవు?

కా : గూ....గూ....గూఢచారిని.

బ. సో: ఎవరి గూఢచారివి?

కా : మీ గూఢచారినే

బ.సో: మా గూఢచారివా?

కా : కాదు — మన గూఢచారిని.

బ.సో: (బిగ్గరగా) ఏయ్! నీవెవరో చెప్పు?

(ప్రవేశం: దుర్గయ్య)

దు : (కాళయ్యను చూచి) ఓహో! కాళయ్యగారా? ఇక్కడున్నారా?

కా : ఎక్కడుంటే నీకేం?

దు : దళపతిగారు మీకోసం వెదకుతున్నారు. ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలట!

కా : దళపతిగారు ఇప్పుడెక్కడున్నారు?

దు : మామిడితోట దగ్గర.

కా : అబద్ధం.... వారిప్పుడు డేరాలో విశ్రాంతి తీసికొంటున్నారు.

దు : నీవే అబద్ధా లాడుతున్నావ్.

కా : ఏయ్!

దు : (తగ్గి) తమరే వెళ్ళి చూడండి. నా మాట అబద్ధమైతే శిక్ష వేయండి.

కా : ఆఁ! అలా రా దారికి. నేను వచ్చి చూచే దాకా నీవిక్కడే ఉండు. ఇది నా ఆజ్ఞ.

దు : చిత్తం.

(కాళయ్య మీసం త్రిప్పుతూ వెళ్ళిపోతాడు.)

బ.సో: ఏమిటిది? ఎవరు వీడు? నాకేం అర్థం కావటం లేదు.

దు : వీడూ ఒక తంత. దళపతి జాఫర్‌తో వచ్చాడు. సైన్యాలుకూడ వచ్చాయి. మనం వెంటనే వెళ్ళి ప్రజలను జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాలి.

బ.సో: ఆఁ! సైన్యాలు వచ్చాయా?

దు : ప్రమాదం ఉండక పోవచ్చు. హెచ్చరికగా ఉండడం ఎందుకైనా మంచిది.

బ.సో: ఐతే వెళ్దాం. (దుర్గయ్యతో నిష్క్రమణ)

(మరియొక ప్రక్కనుండి కాళయ్య, దళపతి జాఫర్ ప్రవేశిస్తారు)

కా : పిరికిపంద పారిపోయ్యాడు.

జా : నీవు విన్నమాటలు నిజమేనా?

కా : ఇప్పుడే- ఇక్కడే- నా చెవులార వింటే అబద్ధం ఎలా ఔతుంది?

జా : ఐతే. విరుపన్న ఒక్కడే వెళ్ళాడన్నమాట. శిల్పి ఇక్కడ ఉన్నట్టే. అహ్హహ్హా.... కాళయ్యా! మనది మంచి నసీబ్!

కా : ఔను సర్దార్!

జా : మనకు కావలసింది అంతే. విరుపన్న వెళ్ళి పోవాలి. శిల్పి ఇక్కడే ఉండాలి. ఆ-హ్హా-హ్హా కాళయ్యా! సిపాయీలకు నీవే హుకుం జారీ చెయ్యి. వెంటనే జారీచెయ్యి.

కా : (బిగ్గరిగా) సైనికులారా! తుపాకులు ప్రేల్చండి. మందు గుండు అయి పోయే దాకా కాల్చండి. వెంటనే పారిపోండి. ఎవరూ ఎవరికీ కొరికిపోకండి.

జా : ఏయ్! ఇక్కడ హుకుం జారీ చేస్తే వినే వెవరు? వెళ్ళు. సిపాయీలకు హుకుం ఇస్తాం. (నిష్క్రమిస్తారు)

[నేపథ్యంలో - తుపాకీ శబ్దాలు. ప్రజల గోల వినిపిస్తుంటగా తెరపడుతుంది.]

[సశేషము]

(ద్వితీయాంకము సమాప్తము)



# హస్తాధ్యాయమ్

ఎన్. ఎస్. కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

చతురో యథా

119. సురతే కైతవే సవ్యే
నతౌ వేగే యశస్యపి
విగమే మారణే క్షాంతౌ
విహారే విపినేతథా॥

మిథున కైంకర్యము, ఏదో కారణము, ఎడమ వైపు వంగియుండుట, వేగము, యశస్సు, కీర్తి, ఎడబాటు, చంపుట, క్షమచూపుట, విహరించుట, అడవి.

Happy Union of Couple; Pretext, Left-side, Bent, Speed, Fame, Separation, Causing death, Tolerance, Move about, Forest.

120. నీలాయామపి వార్తాయాం
విభవేచా భనేతథా।
వృద్ధౌచ భక్షణే పుష్టౌ
చతురోయం కరోమతః

నీలిరంగు, వంకాయ, లేక వార్తలు, విభవము, బీదతనము, పెరుగుట, తినుట, బలము, ఇవి చతురహస్త ప్రయోగములు.

Voilet Colour, Brinjal or News, Wealth, Poverty, Developing, Eating, Strength, Catura represents these.

ముకులో యథా

121. ప్రదానే ముఖ సంకోచే
దేవార్చాయాం బలిగ్రహే।
ప్రఫుల్లే కుముదేం భోజే
భోజనేప్య థచుంబనే॥

ఘనమైన దానము, ముడిచికొనిన ముఖము, దేవతా అర్చనము, బలిని స్వీకరించుట, వికసించిన కుముదము, కమలము, తినుట, ముద్దుగొనుట.

Generous alms, Shrivelled face, Worship of Deity, Acceptance bali (sacrifice) Blossomed lotus Eating, Kissing.

122. లగ్నే ముహూర్తవేళాయాం
నక్షత్రే *(గృహమండనే)
శోణితే చైవ లాలాయాం
ముకులోయం కరోమతః

లగ్నము. ముహూర్తవేళ, నక్షత్రములు, గ్రహముల కూటమి, నెత్తురు, నోటి నుండి నిద్రలో

*గృహమండనే: ఇంటిని అలంకరించుట
Decorating the house.

ప్రవించు వక్త్రజలము, ఇవి ముకుళముచే ప్రదర్శిత ములు.

Planetary, Conjuction for a particular time sequence; Smallest unit of time Stars; Planetary group (Constellation); Watering of mouth when one is asleep. These are indicated by MUKULA

కదంబో యథా

123. ఘోషే ఘర్మే తృషాయాంచ
స్వల్పభాండే గృహే నతౌ।
భక్షణేచ తథా బాష్పే
తథామ్లే శర్కరాదిషు॥

శబ్దము, సూర్యుని ఎండ, దాహము, చిన్నపాత్ర, ఇల్లు, నమస్కారము, తినుట, భూమి, కంటినీరు, పులుపు, చక్కెర.

Loud Sound: Sun's heat: Thirst; Small Vessel; House: Namaskar; Eating: Ground Tears, Sour; Sugar,

124. ముద్రితేచ కదంబేచ
భక్తే వాంఛితే తథా।
శంఖేచ ఫలేచైవ
కదంబః కథితోమయా॥

ముడుచుకొనియుండుట, కదంబపుష్పము, భక్తుడు, కోరిక, శంఖము, ఫలము, ఇవి కదంబ హస్త ప్రయోగములు.

Closed; Kadamba Flower, Devotee; Desire; Coneh; Fruit: These are the uses of Kadamba Hasta;

కృష్ణసారముఖో యథా

125. శయనే దర్శనే హారే
నదీతీరే సమీరణే।
వీణాయా వాదనే లేపే
ధ్యానేచ పణనే తథా॥

పడక, చూచుట, హారము, నదిఒడ్డు, గాలి, వీణాగానము, పూయుట, పూత, ధ్యానము, జూద మందుంచబడు వస్తువు.

Bed, Sight; Garland; River bank; wind; Play on Vina(Lute) Smearing; Prayer; Gamble Staking;

126. కృష్ణసారముఖే చైవ
కృష్ణసారముఖః కరః

ఇవన్నియు కృష్ణసారముఖ హస్త ప్రయోగములు.

These are uses of Krshnasara Mukha

ఘోణికో యథా

127. సూకరే సూకరాస్యేచ
జలాది భవ బుద్బుదే।
ఈషత్కోణే ప్రహాసేచ
ఘోణికోయం మతఃకరః॥

పంది, క్రోడ వక్త్రము, నీరు, నీటి బుగ్గలు, కొంచెము కోణము, నవ్వు, ఇవి ఘోణిక ప్రయోగ ములు.

Hog: Hog's face; Water; Bubbles, A little angular; (Laughter Ridiculous) These are the uses of Ghonika Hand pose;

127. సింహాననేచ సింహేచ
వ్యాఘ్రే వ్యాఘ్రు ముఖేతథా।
బాల కానన దాతవ్య
భక్తాది రస ఏవచ॥

సింహముయొక్క ముఖము, సింహము, పులి, పులి మొగము, అడవి, లేతోట, ఇవ్వబడునది, భక్తులు, రసము మొదలైనవి.

Face of Lion: Lion; Tiger; Tiger's face; Boy (Boy's face,) Forest, That which is to be given, Devotees, Rasa, Etc,

129. తర్ణకే, వదనే చైవ,
సింహాస్యః కథితః కరః॥

పాము, ముఖము. ఇవి సింహాస్య ముఖము యొక్క ప్రయోగములు.

Serpent, Face. These are the uses of Simhasya.

అంకుసో యథా

130. అంకుశే చాస్త్ర భేదేచ
బడిశేచ తథామతః।
ఆమ్రూద్యాకర్ష దండేచ
తథాబాల భుజంగమే॥

అంకుశము, ఒకవిధమైన అస్త్రము, మీనాకర్షణ దండము, మామిడిపండునుకోయు దోటి కొయ్య, చిన్నిపాము.

Spear, one variety of missile, fishinS rod, A stick with a noose & a loop to collect mango fruit from Spreading branches, A little serpent.

131. తథా సామాన్య వక్త్రేచ
స్నేహే గ్రన్థేచ డోరకే।
అంకుశో వామహస్తోయం
ఏ తేషు కథితో మయా॥

సామాన్యముఖము, సఖ్యత, పుస్తకము, చిన్ని సూత్రము, ఇవి అంకుశహస్తముయొక్క ప్రయోగములు.

Ordinary face, Friendship, Book, Small tying thread (Twine) These are the uses of Ankusa.

తంద్రీ ముఖో యథా

132. శత తంద్ర్యాం త్రిశయ్యాంచ
చిత్రాయాం రుద్ర ఏవచ।
ఏ లావణ్యాం విలాసేచ
శార్ఙ మేపి చకద్యత॥

ఎక్కువగా అలసియుండుట, మూడు వైపుల, చిత్రా నక్షత్రము, రుద్రుడు, యాలకుల వనము, విలాసము, అల్లము.

Dead Tired, Three sided, Chitra Star, Constellation, Rudra (Cardamum) Garden. Pleasure, Raw ginger.

133 ఏవమాదాచ మంత్రేస్యాత్
ఏతేషాం వాదనేపిచ।
తంత్ర్యా మపి తథాహ్వానే
ప్రోక్తస్తంద్రీ ముఖోమయా॥

'ఇవి' అనుమంత్రములు, వాదన యందు ఇద మిద్దం అని చెప్పుట, తీగలు, ఆహ్వానించుట, ఇవి తంద్రీ ముఖముచే సూచితములు.

'This' like mantras (chantings), Asserting in discussion, wires, Inviting, These are indicated by Tandrimukha.

132. అథ సంయుత హస్తానాం
ఇదానీం యత్నతో మయా
క్రియతే విషయోల్లేఖః
తత్తల్లక్షణ లక్షితః॥

ఇంక సంయుత హస్తముల గూర్చి వివరించెదను.

Here after I shall expatiate the uses of Joint Hands.

— (ప్రథమ సంపుటము సమాప్తి) —

# నాటక నటనానుభవము

నిడదవోలు పెదసూర్యనారాయణ

పదేళ్ళప్రాయం. విశాఖ పట్టణంలో రీడింగ్ రూమ్‌కి ఎదురుగా ఒక నాటకశాల వుండేది. అందులో మైలవరం, ఏలూరు నాటక సమాజాలవారు ప్రదర్శించిన నాటకాలు చూడటం తటస్థించింది. ఇంటికి వచ్చి ఒక్కడినీ ఆయా నటకుల అభినయాన్ని అనుకరించడానికి ప్రయత్నించేవాడిని. ఎవరైనా చూస్తారేనే భయం, సిగ్గుకూడా ఉండేవి.

పటాస్కాయ కొట్టేసరికి పట్టిన నిజమైన యెనుబోతుమీద కూర్చుని యమధర్మరాజు వైరు వర్కు సాధనతో రంగస్థలం మీదికి వచ్చేసరికి చూచేవారు తుళ్ళిపడేవారు. చేత్తోపాశం పట్టుకొని సావిత్రీ అని సంబోధించి "క్రతువు లొనర్చువారు" అనే పద్యం చదివేసరికి ఒళ్ళు గగుర్పొడిచేది. చిన్న పిల్లలు, గర్భిణీ స్త్రీలు రాకూడదని ప్రకటిస్తు వున్నప్పటికీ, ఏమిటీ ఆశ్చర్యం అని నాటకాలంటే సరదా లేనివాళ్ళుకూడా వాచ్చేవారట. ఇది టికెట్లు అమ్ముడుపోయే యెత్తు అని అనుకోవడానికి వీలున్నా ప్రదర్శనం చాలా పట్టుగా ఉందని చెప్పుకొనేవారు.

మరికొన్నాళ్ళకి వేణీసంహార నాటకం చూడడం తటస్థించింది. అందులో, సావిత్రి నాటకంలో యముడు వేషం వేసినాయనే భీముడి వేషం వేశాడని చెప్పారు. భీముని పాత్ర యిందులో భీభత్సంగా వుండేది. ఆయనను 'గురజనాయుడు' అంటారని తరవాత తెలుసుకొన్నాను.

ఆ కాలంలో నటేశం కంపెనీవారు "సంపూర్ణ రామాయణం" ప్రదర్శిస్తూ వుండేవారు. వాల్మీకి రామాయణంలో వర్ణించిన ఘట్టాలు హృదయాలకు హత్తుకొనేటట్లు ప్రదర్శించాలని దానికి తగినట్లుగా రంగస్థలం యేర్పాటు చేసుకొనేవారు.

అందులో ముఖ్యంగా అశోకవనంలో సీత హనుమంతుణ్ని చూచినప్పుడు, నాకు గంతు వెయ్యాలన్నంత సంతోషం కలిగేది. నిజంగా చెట్టు - దానిపైనుండి మారుతి క్రిందికి దుమకడం, చిన్నవాడుగాను, పెద్దవాడుగాను కన్పించడం. రావణుని దగ్గరికి తీసుకొని వచ్చినప్పుడు అతని సింహాసనాని కంటె మరికొంత యెత్తుగా తోకచుట్టి దానిపై కూర్చోడం ఆశ్చర్యం కలిగించేది. ముచ్చటగా కూడా ఉండేది.

గుహుడు సీతా రామ లక్ష్మణుల్ని నదిని దాటించడం కంటె హనుమంతుడు సముద్రాన్ని దాటే సమయం నాకింకా జ్ఞాపక ముంది. చూచేవారికి సముద్రంమీద ప్రయాణం చేస్తువ్నట్టుండేది. ఆ హనుమంతుడి వేషం నటేశం-అనే ఆయన వేసే వాడు. ఆయనకు రంగస్థలంలోనికి రాగానే ఆంజనేయుడు పూనేవాడు - అప్పుడు హారతు లిచ్చేవారు.

సురభి కంపెనీవారు నాటక రంగం అలంకరించడంలో సిద్ధహస్తులు, పాత్ర పోషణ సంగతి యెలా ఉన్నా, (ఈ విషయంలో అప్పటికి నాకు బాగా అనుభవం లేదు) సీనరీ మాత్రం చూడ్డానికీ ప్రత్యేకంగా వెళ్లేవాళ్ళలో నేనొకడిని. అవి చూచిన వాళ్ళకు, ప్రస్తుత చలన చిత్రం పోకడలు, అనాడే ఉండేవి అని చెప్పడానికి అవకాశ ముంది.

మైకులు అనాడు లేవు. ఫర్లాంగు పొడుగునున్న హాలులోకూడా అర్ధరూపాయి టికట్టుకొని ఆఖరి సీట్లలో ఉన్నవారికి, ముందు కుర్చీలలో హెచ్చు డబ్బు పెట్టి టికట్టుకొని కూర్చున్నవారికి నటకుని గాత్రం ఒక్కలాగే వినబడేది. హార్మోనియం తబలా తప్ప మరి యే యితర పరికరాలు లేవు. సంగీతంలో బాగా పరిశ్రమ చేసినవారే హార్మోనిస్టులుగా ఉండేవారు.

సాంఘిక నాటలకు ఆ కాలంలో చలామణి లేదు. వానికన్నా పౌరాణిక చారిత్రిక నాటకాలే ప్రజానీకాన్ని హెచ్చుగా ఆకర్షించేవి. అందుచేత వానినే ప్రదర్శించేవారు. అనేక నాటకాలు, అనేక గ్రంధ కర్తలు వ్రాసినా, ఏ యిద్దరు ముగ్గురు గ్రంధ కర్తలవో ప్రదర్శనార్హమై ఉండేది. చిలకమర్తి వారి గయోపాఖ్యానం నాటన్నింటిలోను మొదటిదని చెప్పాలి. లక్ష పుస్తకాలు చెల్లేయని, బండివాడి దగ్గఱనుంచి "అల్లుడారమ్మని ఆదరంబున బిల్వ బంపు మామనుబట్టి చంపగలమె" అన్న పద్యాలు నచ్చేవని వినికిడి.

నాటకాలు తాళంలేని పెద్దె పంటవి. జాతి, మత భేదాలు లేక, యెందరు నటులనో నేటికీ తయారు చేస్తూనే వున్నాయి. శిల్పాలు, చిత్రలేఖనంలాగే, నాటక ప్రదర్శనాలుకూడా హిందూమత సంప్రదాయాలు అడుగంటి పోకుండా తెలుపుకు చేయడంలో చాలావరకు తోడ్పడుతున్నాయనే చెప్పాలి. అందుకే గాబోలు శ్రవ్యాలు దృశ్యాలుగా మారేయి.

నాటకాలు పెరుగుతూనే వచ్చాయి. నేను ఎదుగుతూనే ఉన్నాను.

ఏ పాత్ర తీసుకున్నా గ్రంధాలు అందే పురాణాలు, ప్రబంధాలు, చరిత్రలు, ఇవి బాగా చదివి అర్థం చేసుకొని నటించడం మంచిది-అని, నా నాట కోత్సాహాన్ని చూచి మా నాన్నగారు ఉపదేశం చేశారు. కొంతకాలం ప్రతిరోజూ మా నాన్నగారు మా అన్నగారు పురాణం చదువగా, అర్థం చెబుతూ వుండేవారు. నేను శ్రద్ధగా వినేవాడిని. ఇదికూడా నా నటనకు చాలా తోడ్పడింది.

నాన్నగారు నిత్యం ప్రార్థన, లింగ పూజ చేస్తూ వుండేవారు. ఆయన పూజ చేసే విధానం ధ్యానంలో కూర్చోవడము, చూస్తూవుంటే, నాకూ శివుడంటే ప్రీతి కలిగింది. అందుకు సంబంధించిన పాటలు, పద్యాలు రోజూ కోవిలకు వెళ్ళి చదివేవాడిని. కొంతసేపు మా నాన్నగారు పూజలో ధ్యానం చేస్తూన్నట్టుగా నేను కూర్చునేవాడిని. ఇది ఒకాయన కవి పెట్టి యిలా అన్నాడు, ఒరే బొట్టుపెట్టుకునే దగ్గర శివలింగం వున్నట్లుగా ధ్యానించి, నమఃశివాయ అని అనుకోమన్నారు. ఇటూ అటూ చూడకూడదు. దృష్టి అంతా నేచెప్పినలాగే ఉండాలి, అని బోధించాడు. ఈ బోధన నా పాత్రను చిత్రించుకోవడములో చాలావరకు తోడ్పడింది. ఆ విషయం ముందు చెబుతాను.

తెలుగు, సంస్కృతం, తాళపత్ర గ్రంథాలు ఉన్న పుస్తక భాండాగారం మా నాన్నగారు నెలకొల్పడంచేత, అవి మా యింట్లోనే ఉండడమువల్ల, జ్ఞాన సంపాదన విషయాలు తెలుసుకోడానికి తడుముకునే అవసరం లేకుండా వుండేది. ప్రకృతి పరిశీలనచేస్తూ, స్త్రీ పురుషుల నడవడి, ముదుసళ్ళ మూర్ఖత్వం, జంతువుల చేష్టలు చూస్తూ, వాని నన్నింటివి నాలో విమర్శించుకోవడం జరుగుతూ వుండేది తీవ్రమైన ఆలోచనల్లో హావభావ చేష్టలు అప్రయత్నంగా వచ్చేవి. కాని మళ్ళీ కొంతసేపటికి నాలో నాకే నవ్వు వచ్చేది.

నటుడికి మంచి దేహ సౌష్ఠవం వుండాలని నాకు మొదటినుంచి ఒక భావన వుండేది. అందుకోసం మా ఇంటికి, ఎదురుగావున్న ఇంట్లో కసరత్తు

చేస్తూ వుండేవాడిని. అప్పుడా ప్రక్క యింటిలో వేమూరి శ్రీ కృష్ణమూర్తిగారు వుండేవారు. వారు హిమాలయ ప్రదేశంలో కొంతకాలం తపస్సు చేసి తిరిగి వచ్చేరు. ఒకరోజున కసరత్తు చేస్తూన్న సమయంలో నన్ను చూశారు.

" ఒరే సూరీ! దేహారోగ్యానికి తోడు ఆధ్యాత్మిక మైన మానసికారోగ్య మలవర్చుకో" అని నాకు త్రాటక విద్య చెప్పేరు. అనగా ఒక చుక్కను ఏర్పరుచుకొని, దానిపైపే ధ్యానిస్తూ చూడడము. దీనితో మంత్రంకూడా ఉపదేశించారు. ప్రతిరోజూ అభ్యాసం చేయమన్నారు.

ఈ అభ్యాసం వల్ల తన కిష్టమైన విగ్రహాన్ని కన్నులు మూసినా, విప్పినా ప్రత్యక్షం చేసుకోవచ్చు. భావ గంభీరత ఏర్పడుతుంది. ఎదుటివున్నవాడెంత వారైనా సమ్మోహితు లవుతారు.

శ్రీకృష్ణమూర్తిగారు నటకుడివి కాబోయే లక్షణాలు నాలో గుర్తించి నన్ను ప్రోత్సహిస్తూ వుండే వారు. కాని దైవధ్యానం ముఖ్యమని మాటి మాటికి వొక్కి చెప్పేవారు.

ఇలా వుండగా కొందరు మిత్రులు చలన చిత్ర రంగంలో ప్రయత్నం చెయ్యమని సలహా యిచ్చే వరికి నాలో లేని ఆశ పుట్టింది. మా అన్నగారైన వెంకటరావుగారు, మద్రాసు విశ్వ విద్యాలయంలో ఉపన్యాసకులుగా వుండడముచేత భోజన వసతులకు లోటు లేకుండా ఉండేది.

అప్పట్లో (1944) సినీ వర్కర్స్ యూనియన్ అనే పేరుతో తేనాంపేటలో ఒక సంస్థ ఉండేది. పై వూరునుంచి నటనా సామర్థ్యం వున్నవారు వస్తే వారికి దోహదం యిచ్చి చలన చిత్ర రంగంలో ప్రవేశం కలిగించడం, ఆ సంస్థ ఉద్దేశాలలో ఒకటి అని తెలుసుకొని అక్కడికి వెళ్ళాను. కాని అక్కడ అటువంటి పరిస్థితులు కన్పించలేదు. కొందరు దర్శకులు "కొత్త మొహాల్లో ఆకర్షణ వుండదండీ" అనేవారు. నాటకం వేదామంటే ఆ వూరు కొత్త. విజయనగరం వచ్చేశాను. 4 ఏండ్లు ఇంట్లో నాటక కళ, యోగాభ్యాసం అభివృద్ధి చేసుకుంటూ వుండే వాడిని.

1948 లో తెలుగు భాషా సమితిలో ఉద్యోగం దొరికింది. నటనకు పైక్రాఫ్టురోడ్డు-రాయపేట దగ్గరవున్న ఆంధ్ర విజ్ఞాన సమితి చాలా ఆశ్రయ మిచ్చింది. దానికి కార్యదర్శి, ఆ సమితి స్థాప కులలో ఒకరైన కొత్తపల్లి శ్రీరామమూర్తిగారు. వారు చాలా ప్రోత్సాహ మిచ్చారు.

హాస్యరసబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు గారు రచించిన "ఎప్పుడు ఇంతే" నాటికలో పానకాలు పాత్ర ధరించాను.

"తన దగ్గర యింకొకరి గురించి పొగడకూడదు. అందులో సాహిత్య విషయంలో మరీ పట్టింపు. ఎంతటివాడినైనా తృణీకరించడం, ఈర్ష్యాజుగుప్స భావాలతో లోలోనల కుములిపోతూ పైకి పెద్ద మనిషిలా" ఆ పాత్రధారి నటించాలి. ఇది అవగాహన చేసుకొని నటించి, అందరి మెప్పు ఏకగ్రీవంగా పొందాను.

కీ. శే. పానుగంటి విజయ రాఘవరావుగారు రచించిన "లోభి" అనే సాంఘిక నాటకంలో రంగ స్థలంపై పది నిమిషాలపాటు కనిపించి సంభాషించే లోభి స్నేహితుని పాత్ర నాకిచ్చారు.

దాన్ని నత్తితో మాట్లాడుతూ ప్రదర్శిస్తే బాగుం టుందని కృషిచేసి ఒకనాడు రిహార్సెల్లో అట్టి అభి నయం చూపేను. అది చూచి, దాన్ని మార్చి, మరో రెండు రంగాలలో వచ్చే పాత్రను యిచ్చారు.

దాన్ని పోషించుకుంటూ రిహార్సెల్సుకు వెళ్లుతూ వుండేవాడ్ని.

ఆ సమయంలో, అప్పటి సమితి నాట్య శాఖాధికారియైన గిడుగు వెంకట సీతాపతిగారికి 'లోభి' లో ప్రధానమైన లోభి పాత్ర ధరిస్తూవున్న సమితి సభ్యునికి వాగ్వాదం వచ్చింది. అది సంభాషణలో పాత్ర ఔచిత్యాన్ని గురించినది. సీతాపతిగారు "సంభాషణ యిలా చెయ్యాలి" అని సూచించారు. "నాయకుని పాత్ర ధరిస్తున్న నాకు ఆపాటి తెలియదా" అని అతడన్నాడు. మీరు నటకులు కావచ్చుగాని ప్రస్తుత సందర్భంలో ఆమాట అవసరం లేదని దర్శకులైన సీతాపతిగారు చెబుతూ యిలాగన్నారు, "బళ్ళారి రాఘవాచార్యులు "రైతు బిడ్డ" షూటింగు జరుగుతూన్నప్పుడు - ఒక సందర్భంలో నేను తనలాగే అందులో వేషం వేస్తున్నప్పటికీ "మీరు చెప్పబోయే మాట యీ విధంగా చెప్పాలి" అని అన్నాను. ఆయన వెంటనే ఒప్పుకొని అలాగే చేస్తానన్నారు. అలాగే చేశారుకూడా." "రాఘవాచార్యులుగారు ఒప్పుకుంటే ఒప్పుకొని వుండవచ్చు. నేను ఒప్పుకోను" అన్నాడు, లోభిపాత్ర ధరించే సభ్యుడు. అయితే మీకు వేషం లేదన్నారు. అతడు నమస్కరించి వెళ్ళి పోయాడు.

అప్పటికి నాటకం ప్రదర్శించడానికి పదిహేను రోజులు మాత్రమే వ్యవధివుంది - అది పెద్ద నాటకం అవడంచేత రిహార్సల్సు మొదలయిన వాటిక్రింద నాలుగు వందలవరకూ ఖర్చయింది. నాయక పాత్రకోసం వెంటనే వెదకవలసి వచ్చింది. చలన చిత్ర నటకులు లింగమూర్తిగారిని అడిగారు. ఆయన ఆరు వంద లిమ్మనారట, బలిజేపల్లి లక్ష్మీకాంతంగారిని గూర్చి కొంత మంది చెప్పారు. కార్య నిర్వాహక వర్గం అంగీకరించలేదు.

12-11-86

...సందర్భంలో... కార్యదర్శిగారు సూచించారు. "పానకాల పాత్ర బాగానే చేశాడు ఆయనకే యివ్వండి" అని తక్కిన సభ్యులు నాకీ పాత్ర యివ్వడానికి అనుమతి పత్రం కార్యదర్శిగారిని యిమ్మన్నారు. అనుమతి పత్రంతో లోభి పుస్తకం మా యింటికి వచ్చింది.

నాటకం చదివాను-భాషను బట్టి పాత్ర నిర్ణయమా? లేక పాత్రకు ముందు మనసులో చిత్రించుకొని నటన ప్రారంభించడమా, అనే జిజ్ఞాస నాకు కలిగింది, ఇంతకు ఇది సాంఘిక నాటకం కదా! ఏలాగ యీ పాత్ర నిర్వహించాలి, అనే ఆలోచన నాలో రేకెత్తింది. చాలా తర్జన భర్జన చేశాను.

పౌరాణిక చారిత్రక పాత్రలు వేషాలతో సహా నిర్ణయింపబడే వున్నాయి. సాంఘిక పాత్రల వేష భాషలు ఒకే తీరుగా వుండవు. ఇవి నిత్యం మనం చూస్తూనే వున్నాము. అప్పటప్పటి సందర్భాలు చూచుకొని పాత్ర నిర్ణయము చేసుకొని దానికి సహజత్వం తీసుకొని రావడానికి ప్రయత్నము చెయ్యాలి-అనే నిర్ణయానకి వచ్చి. మరోమాటు పై దృష్టితో జాగ్రత్తగా చదివాను. వేషభాషల్లో ప్రకృతిని అద్దె వుంచి నాటక పాత్రతో ఐక్య మవడానికి ప్రయత్నించాను.

"మాంచి దిట్టమైన ముండకొడుకివిరా? దేవదూత లాగ మాట్లాడుతున్నావు. రెండంగ వస్త్రాలతో తనువు వెళ్ళుతూన్నప్పుడు - ఉసిరిక పచ్చడితో నూరేనుగుల బలం నస్తున్నప్పుడు - మా కధికారి ముందిగదా యని పట్టి సాగదీస్తాను, నిలబెట్టి ఉరితీస్తాను," ఇత్యాది వాక్యాల అంతరార్థం అవగాహన చేసుకొన్నాను.

"బ్రాహ్మణజాతి లోభికి క్షేత్ర సంస్కారం-శుభ్రమైన దుస్తులు వుండవు. ఎప్పుడూ మొహం ధుమ ధుమ లాడుతూ వుంటుంది" అనుకుని కాలికి సొట్ట,

గూని, వాళ్ళవలె, చేతి కర్రతో నటన ప్రారంభించాను. కావి రంగు వచ్చేవరకు పంచ తువాలు రోజూ ఉడుపుకుంటూ ప్రదర్శనం రోజు వాటికి పంచెకు రెండు మూడు అతుకులు వేసి తయారు చేశాను.

ఇంట్లో జామిచెట్టు క్రింద, ఎంత కాలం క్రిందటో ఎవరికి తెలియకుండా పాతిపెట్టిన ధనం కొడుకు తీస్తాడు. డబ్బు పోయేటప్పుడు సహజంగా లోభి కుండే సంతోషం తప్ప తక్కిన రసభావాలు యిమిడ్చి ఏక పాత్రాభినయం చెయ్యడంతో ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. కీ. శే. పిఠాపురం మహారాజావారు, శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారు, శ్రీ డాక్టర్ గిడుగు సీతాపతిగారు ఆశీర్వదించారు. నాటక రంగస్థలంలో కొంత స్థానం ఏర్పడింది. 1940-60 వరకు అనేక పౌరాణిక చారిత్రక, సాంఘిక నాటకాలలో, నాటికలలో ప్రముఖ పాత్రలు ధరించడం జరిగింది.

ఇట్టి అనుభవాన్ని పురస్కరించుకొనే యీ వ్యాసం వ్రాయడానికి సాహసించాను.

### ఆకారం, అంగసౌష్టవం

నటుడుగా రాణించాలంటే, స్ఫురద్రూపం, మధుర గాత్రం, అంగ సౌష్టవం, ఆజానుబాహుత్వం. సమయస్ఫూర్తి, జ్ఞాపక శక్తి, స్ఫుటోచ్చారణ-అనే లక్షణాలు కలిగి వుండాలి. తాను ధరించే పాత్రయందు ఒక విధమైన అభిమానం అలవర్చుకోవాలి. వీని అన్నింటికి తోడు ఆరోగ్యం కాపాడుకోవాలి. సంగీతంలోకూడా రాగాలాపన చేసి సంగతులను దొర్లించడానికి యెక్కువ ప్రాధాన్య మివ్వకూడదు. దీని వలన తోటినటుడు అలా నిలబడి పోవలసి వస్తుంది. ఇది ముఖ్యంగా పాండవోద్యోగ విజయాలు గయోపాఖ్యానం, మొదలైన ఉత్తర ప్రత్యుత్తరాల పద్యాల నాటకాలలో గమనించతగ్గ విషయం. ఈ స్వేచ్ఛ నారద, శ్రీకృష్ణ, అర్జున పాత్రలకు సందర్భోచితంగా ఉంటుంది.

### సంగీతం, సాధన.

మహారథులు, చక్రవర్తులు, దుర్యోధనుడు. భీముడు, అశ్వత్థామ మొదలైన పాత్రధారులు రాగం పెంపు చెయ్యడానికి ప్రయత్నించడం రసాభాసకి కారణ మవుతుంది. రౌద్ర భీభత్స భయానక విలాప రసాలు చూపడంలో ప్రదర్శనా సందర్భానికి అసలు తావేలేదు. రాయభారంలో భీముని పాత్ర ధరిస్తూ రాగం పెంపు చెయ్యాలని ప్రయత్నించి నాకే బాగులేక మానుకున్నాను.

సాధారణంగా షడ్జమ స్థాయిలో సంగతులు పడ్డం చాలా కష్టం. పద్యాలకి రాగాలు ఆ యా సందర్భాలనుబట్టి నటుడే నిర్ణయించుకోవాలి. పద్యం ముందుగా కంఠస్థం చేస్తేనేగాని రాగం సాఫీగా నడవదు, తరువాతగాని హార్మోనియంతో కలపడానికి వీలుండదు. రాగస్థాయి భావాలు హార్మనిస్టు సరిచేసి మెరుగులు పెడతాడు. అప్పుడు నటుడు ఏ విధంగా అంటాడో హార్మనిస్టు తెలిసికొని వాయించగానే విన్నవారికి చాలా హాయిగా ఉంటుంది. దీన్నే "హార్మోనిస్టు కాంబినేషన్" అంటారు.

గొంతుక బాగా పలకడానికి నిర్జన ప్రదేశానికి పోయి బిగ్గరగా ఓపిక ఉన్నంతవరకు అరవాలి. ప్రొద్దుట, సాయంకాలం మంచిది. అకార సాధన కోసం చలికాలంలో ఉదయం నాలుగు గంటలకు మొలబంటి నీటిలో నిలిచి రాగాలాపన చెయ్యడం కుండలో నీళ్ళుపోసి కౌగలించుకొని సాధన చెయ్యగా చూచి నేనూ కొంతవరకూ అభ్యసించాను.

దేహదార్ఢ్యానిబట్టి, గాత్రధర్మం, దాన్ని అనుసరించి అకారము తొందరగా పలకడము వుంటుంది.

కంఠములో జీర వుంటే శ్రుతిలో కలియదు. ఇది కూడా కప్పుకోవడానికి యిప్పుడు అనేక వాయిద్యాలు తోడవుతున్నాయి. వాయిద్య సహాయము లేకుండా పాడుతూన్నప్పుడూ. గొంతుక బాగా పలుకుతూ అకార ఇకార సంగతులు సులువుగా పడుతున్నట్లు తెలుస్తున్నది. అప్పుడు మరీ హుషారుగా పాడుతాము. కాని హార్మోనియము సుతిలో కలిపి పాడినప్పుడు తాతలు దిగివస్తారు. ఇందుకే గాబోలు సుతిలేని పాట, మతిలేనిమాట, అని అనుభజ్ఞులు స్పష్టపరిచారు. ఎంత మధురగాత్రమైనా సుతి కలియనిదేగాని రాణింపకురాదు. పాట కచేరీ చేసే గాయకునివలె నటుడు రంగస్థలంలో సందర్భముబట్టి తప్ప శిరస్సు చేతులు నడుము త్రిప్పకూడదు.

## సంభాషణ

సంభాషణలు ఎక్కడెక్కడా ఏయే స్థాయిలలో మాట్లాడాలి అన్నది తెలుసుకోవాలి. రహస్యమని మెల్లిగా చెప్పినట్లయితే ఏవో బొమ్మలు మాట్లాడుతున్నట్లు చూచేవారికి కనిపిస్తుంది. అందుచేత రంగస్థలము ముందుకు ఒక ప్రక్కచేరి కొంచెము ప్రేక్షకులికి వినబడేలాగ చెప్పాలి. నటునియందు సహజముగా ఎంత సామర్థ్యమున్నా ప్రేక్షకులు మెచ్చనిదే రంగస్థలంలో స్థానం ఏర్పడదు. అందుకే స్పష్టముగా పలకడము, అర్థవొందికతో పద్యాలు చదవడము బాగా నేర్చుకోవాలి. రాగముతో కొట్టుకుపోగలము అనే భావన వుండకూడదు.

## నడవడి

ఒక్క యేకపాత్రాభినయములో తప్ప, తదితర కాలములో నటుడు సగము మొగము ప్రేక్షకులవైపు, తక్కిన భాగము తోటి నటునివైపు వున్నట్లు చూచుకోవాలి. పచారు చేస్తున్నప్పుడు ,గోడనున్న వస్తువు తీస్తున్నప్పుడు యిద్యాది పనులలో తప్ప నటుని వెనుక భాగం ప్రేక్షకులకు చూపరాదు. ఈ నిబంధన యిప్పుడిప్పుడు కొంచెం సడలుతూ వున్నది. తోటి నటుడు తన విషయములో మాట, పద్యం, పాటగాని మరచిపోయినప్పుడు వెంటనే సందర్భోచితముగా చేయూత యిచ్చి ఘట్టం రక్తి కట్టించాలి. అందుకే ప్రతి నటుడికి నాటకము, అందున్న పాత్రలు సంభాషణ క్రమము తెలియాలి, సమయము దొరికింది కదాయని తన ప్రత్యేకత చూపాలని ప్రయత్నము చేసితే, ఉత్తర ప్రత్యుత్తర భావ ప్రదర్శనానికి లోపము గలిగి రసాభాసకి కారణ మవుతుంది. రెండు పాత్రలూ పోషింపబడవు.

నాటకములోని కొత్తమాటలు, పద్యాలు అక్కడక్కడ యిమిడ్చి చదవడము నటన అనిపించుకోదు. అందున్న భాషకే మెరుగులు పెట్టి రాణింపచెయ్యాలి. పానుగంటివారి కంఠాభరణ నాటకంలో సోమనాధాదులు పాత్ర నటిస్తున్నప్పుడు పై అవకాశం బాగా లభించింది. పాత్ర రాణించింది.

దీర్ఘకాల సంభాషణ కూర్చుని చెయ్యరాదు. అటు ఇటూ పచారు చేస్తున్నప్పుడు మాటలు చెప్పకూడదు. ముందు భావ ప్రకటనచేసి తరువాత మాట చెప్పవచ్చు.

ఎప్పుడూ రంగస్థలమును స్తబ్ధముగా వుంచకూడదు. తెరలు యెత్తడము, దించడము చురుకుగా జరగాలి. దీనివల్ల నాటకము తీరు యితరులకు తెలుస్తుంది. తరువాత నటునికి సహాయకారిగా ఉంటుంది. తనలో నున్న భావము ఆగిపోక ప్రదర్శింపడానికి వీలుంటుంది. లేకపోతే మళ్ళీ ప్రయత్నించి తెచ్చుకోవాలి.

ప్రదర్శన కాలములో అప్పుడప్పుడు కొత్త కొత్త భావాలు పుడుతూ వుంటాయి. రిహార్సెల్సు సమయములో చూపని ప్రతిభనుచూపే అవకాశము కలుగు

తుంది. అందుకే సాధారణంగా యితరులతో ప్రదర్శన సమయములో మాట్లాడకూడదు. నాస్తికుని సైతము అస్తికునిచేసే శక్తి సామర్థ్యాలు నటుని యందున్నాయి.

## భావన

నటునికి భావన ప్రధానము. దీనికి దైవధ్యానం అవసరము. ఇది కుదరడానికి బ్రహ్మచర్యము ముఖ్యాంగము. గురువు ఉపదేశ ప్రకారము తన ఇష్టదైవ స్వరూపాన్ని నిత్యము ధ్యానము చెయ్యగా చెయ్యగా కొంత కాలానికి ఆ స్వరూపం తేజస్సుతో కూడి భ్రూమధ్యమందు అనగా రెండు కనుబొమల మధ్య ప్రదేశంలో నిలుస్తుంది. దీనిని "ధారణశక్తి" అంటారు. అంటే కనబడ్డ స్వరూపమును కొంతసేపు నిలిపేశక్తి.

ఈ విధముగా అలవాటున్నప్పుడు తన పాత్రను తానే నిర్ణయించుకొని ఫోటో అక్కర లేకుండగానే తనలో చూచుకొనే శక్తి వుంటుంది. అప్పుడు రంగస్థలము, ప్రేక్షకులు నటులతో సంభాషణ భావన చేసుకుంటూ నటిస్తూన్నట్లు అనుకోవాలి. ఈ భావనా ప్రపంచములో తిరుగుతూవుండే కాలములో తల నొప్పి, నీరసము కలగవచ్చు. దేహారోగ్యము దైవ ధ్యానము వున్న నటుని కిటువంటివి కలుగవు.

కొందరు నిలువుటద్దాల యెదుట వేషధారణ హావ భావ చేష్టలు అలవాటు చేసుకొంటారు. దీనిలోనైనా ఏకాగ్రత కావాలి. ఇదివరకు చిత్రించుకొన్న పాత్ర హావభావ చేష్టలతో కలిసి సూక్ష్మరూపము పొంది హృదయములో ఫోటో పడివుంటుంది. ప్రదర్శనా సమయములో భావనా బలముచేత, ఆ సూక్ష్మ తేజ స్వరూపము పెరిగి దేహము లోపల వ్యాపించి పైకి ప్రతిబింబిస్తుంది.

## నటన, కళ

ఎక్కడ తేజస్సు వుంటే అక్కడ ధ్వని వుంటున్నది. మెఱుపుమెఱసి ఉరుముతుంది. ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కగానే చప్పుడై వెలుతురు వస్తోంది. రెంటి కలయికవల్ల యేర్పడ్డ చైతన్య భావమే 'కళ' దీనినే యోగమతంలో, నాదబిందు కళ అంటారు.

తేజోధ్వని కలిసి మాటమాటకు పటుత్వము ఏర్పడి నటిస్తూన్నప్పుడు ప్రేక్షకులు తన్మయులు కాక మరేమవుతారు? అట్టి స్థితిలోనే

నాటకం కళ కట్టించేదురా,
పాత్రకి జీవం పోసేదురా,
అచ్చుగ్రుద్దినట్టున్నాడురా,
ఉత్తమ కళారాధకుడు.

మొదలైన అభిమాన అభిప్రాయ వాక్యాలు ప్రారంభ మవుతాయి. ఇట్టి నటన ఆదర్శప్రాయ మవుతుంది.

సాధారణంగా నేను రంగస్థలంమీదికి రాగానే ప్రేక్షకుల శిరస్సులపైనుంచి ఒక తెల్లటి దుప్పటి కప్పినట్లు కనిపించేది, ఆ స్థితిలో నేను ప్రదర్శించిన విధానము ప్రేక్షకులను ఆకర్షించేది. పాత్రలో లీన మవడము అంటే ఇదే అనుకుంటాను. చూచేవారు నిశ్శబ్దముగా వుంటే నటన బాగున్నట్లే అని నా అభిప్రాయము.

పూర్వకాలములో కేవలము భావనాబలము వల్లనే కామరూపము సిద్ధించినది. ఆ కాలములో అది నిజమైనది. అదే కలికాలములో నటనైనది. నేటికి సన్యాసులను, పీఠాధిపతులను, రాజకీయ సాహిత్యవేత్తలను, ఒకరినేమిటి, జీవితంలో ప్రత్యేక ప్రతిభ చూపిన ప్రతివారి విధానము అనుసరించి

నటించడము కద్దు. ఒకరి నటనచూచి, ఆదర్శంగా తీసుకొని ఇంకొకరు నటిస్తున్నారు. అవతారాలు నటనవంటివే అని చెప్పడానికి వీలున్నది.

విత్తనము వేసినతరువాత భూమినుండి పైకి వచ్చి మొక్కయి పెరిగి మహావృక్ష మవుతున్నది. అలాగే నటన ప్రారంభించి నటిస్తూ కొంతకాలానికి నటనాగ్రేసరుడవుతున్నాడు.

ప్రసిద్ధ చలనచిత్ర నటకుడు పృథ్వీరాజు ఫిల్మ్ ఫేర్ అనే పత్రిలో కొన్ని యేండ్ల క్రిందట వ్యాసము వ్రాస్తూ రంగస్థల నటనకే ప్రాముఖ్య మిచ్చాడు.

నాటకము ప్రదర్శిస్తూన్నప్పుడు. ఒక రంగము రక్తి కట్టకపోయినప్పుడు తిరిగి అది ప్రదర్శించడం వెంటనే యెందుకు జరిగకూడదు అనే సంశయము నాలో బాధిస్తోంది. చేసిన తప్పు సరిదిద్దుకొనే అవకాశము నటుని కున్నది.

నాట్య సంఘాలు నెలకొల్పి, పట్టు పంతాలకి, ఆడంబరాలకి పోయి కళను పాడుచెయ్య కూడదు. తనకు సరిపోయిన పాత్రను తీసుకొని నటించితే కొన్నాళ్ళకైనా ఉత్తీర్ణు డవుతాడు. అప్పుడు అది అతని పేటెంటు క్యారక్టరు అని ప్రజలచే బహూకరింపబడతాడు. తన సహజ గుణాలకి సరిపోయే పాత్ర దొరికేవరకు కష్టపడాలి. అది లభించితే ప్రదర్శించే అవకాశము వుండాలి. ఇన్నీ కలిసితే ప్రదర్శనా సమయములో అనుకున్నట్లు నటించకపోతే తక్కినదంతా నిష్ఫలము అవుతున్నది. ఇన్ని అష్టకష్టాలు పడితేనేగానీ నటన రాణించదు. ఈ రీతిగా శ్రమపడి పెద్ద పేరు సంపాదించిన నటకులున్నారు.-శ్రమ చేసినా పేరులేని నటకులున్నారు.

అన్నిటికి అదృష్టమే కలిసిరావాలని పెద్దలంటారు. పేరు నాటకమైనా, అది నిజమేమో అనిపిస్తుంది.



# హేమవతిరాగం

## (ఆదితాళం)

వింజమూరి వరదరాజ అయ్యాంగార్

రాగ లక్షణము :— 58వ మేళరాగం: ఇందు వచ్చు స్వరస్థానములు షడ్జమ పంచమములుగాక చతుశ్రుతి రిషభము, సాధారణ గాంధారము, ప్రతి మధ్యమము. చతుశ్రుతి ధైవతము, కైశికి నిషాదములు. వేంకటముఖి మతమునందు ఈ రాగమునకు "దేశి సింహారవము" అని పేరు.

పల్లవి॥ జాగేలరా నన్ను బ్రోచుటకు వేగ రావదేమిరా రామా! జా॥

అనుపల్లవి॥ రాగ రత్నమాలికచే రంజిల్లు త్యాగ రాజాధిపా శ్రీనిలయ వాస! జా॥

చరణం॥ కరిరాజు మొరలిడినంతనే కారుణ్యముతో గావగ లేదా?
వరభక్త పోష వాగీశనుత వరదరాజ సేవిత రాజ రాజ॥ జా॥

ప॥ ; ; ; పా మా గా ; రీ । సా ; ; రీ । నీ ; సా రీ ॥
జా గే ల । రా న న్న బ్రో చు ॥
గా ; మా ప ద ని ద ప మ గా రీ | స రి గ రి సా రీ । నీ ; సా రీ ॥
ట కు జా............గే........ ల । రా................న । న్న బ్రో చు ॥
గా ; మా ప ద ని స ని ద పా మ । గా గ రి సా రీ । నీ ; సా రీ ॥
ట కు జా...............గే .. ల......। రా ............... న । న్న బ్రో చు
గా ; మా ప ద ని స రి గ రి స ని ద । ప మ గ రి సా రీ । నీ ; సా రీ ॥
ట కు జా.........గే........ ల.....। ...............రా న । న్న బ్రో చు
గా ; మా పా దా ప ద ని ద ద ని । సా ; ; స ని । ద ని పా ; ప మ ॥
ట ; కు వే గ రా..........వ దే....। మి....।.........రా ; రా
గ రి స రి గ మ పా దా ప ద ని ద ద ని । సా ; ; స రి । గ రి స ని ద ప ప మ ॥
..... మ..............వే గ రా...............వ । దే ........మి ।.........రా..........రా
గ రి స రి గ మ ॥ జా గే ల రా ॥
... ..మా..........॥ ॥ ॥

## అ ను ప ల్ల వి

; ; ; సా సా స ని ని ద దా । నీ సా ; రి గ । గ రి రి స ని స రీ గ రి ॥
రా గ ర..........త్న । మా లి క । చే........ర ం జి..........॥
సా రీ నీ సా సా స ని ని ద దా । నీ సా ; రి గ । మా ; ప మ గా రీ ॥
ల్లు రా గ ర..............త్న । మా.. ....లి క । చే ర ం జి ల్లు ॥
; ; ; సా సా స ని పీ దా । ప ద ని స నీ ప ద । ని ద దా పా మా ॥
త్యా గ రా ... జా । ధి......పా శ్రీ........।.......ని ల యు ॥
ప మ గ రి గ మ ॥ జా గే ల రా ॥
వా.........స........॥ ॥

## చ ర ణం

; ; ; పా పా పా ; పా । పా మా ; పా । మా ప మ గా రీ ॥
రీ క రి రా జు । మొ ఱ లి । డి న ం ం త ॥
రీ ; ; స రి గా గ రి రీ సా । నీ సా రీ రీ । గ ను ప ద పా ; ॥
నే కా......రు......ణ్య । ము తో గా । వ గ లే - దా ॥
అనుపల్లవి వలె | వరభక్తపోష వాగీశనుతా ॥
పాడవలెను. | వరదరాజసేవిత రాజరాజా ।. జాగేలరా ॥



# అకాడమీ కార్యకలాపాలు

1966 జూన్, 11 వ తేదీన పంచవటిలో జరిగిన కేంద్ర, రాష్ట్ర అకాడమీ అధ్యక్షుల సమావేశానికి మన రాష్ట్ర అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావు, కార్యదర్శి శ్రీ ఎం. ఆర్. పద్మారావుగార్లు హాజరైనారు.

సంగీత నృత్య నాటక రంగాలలో వృత్తి సమాజాలకు, బృందాలకు కల్పించిన రైల్వే కన్సెషన్ సౌకర్యాన్ని ఔత్సాహిక సమాజాలకుకూడ వర్తింప జేయాలన్న కోర్కెను రైల్వేబోర్డు తిరస్కరించింది గనుక రైల్వే మంత్రిత్వ శాఖకు విజ్ఞప్తి చేయాలని ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రతిపాదించింది.

జిల్లా పరిషత్తు స్థాయిలో సాంస్కృతిక సంస్థలను ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వాలను కోరాలని రాష్ట్ర అకాడమీలకు ప్రభుత్వాలిస్తున్న గ్రాంటులు సరిపోవడం లేదు గనుక వినోదపు పన్నులో 2 శాతం అకాడమీలకు ఇచ్చేటట్లు అభ్యర్థించాలని ఆంధ్ర ప్రదేశ్ అకాడమీ చేసిన ప్రతిపాదనలను కూడ చిరు మార్పులతో సమావేశం ఆమోదించింది.

♦ ♦ ♦

సంగీత నృత్యాలలో అభిరుచిని కలిగించి ఆయా కళలను అవగతం చేసికొనడానికి కృషిచేసే నిమిత్తం రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ ఏర్పరచిన "డాన్స్ అండ్ మ్యూజిక్ సర్కిల్" కన్వీనర్ల సమావేశం జూన్ 21 న అకాడమీ కార్యాలయంలో జరిగింది. ప్రధాన కన్వీనర్ శ్రీ ఎం. ఎన్. పద్మారావు, కన్వీనర్లు శ్రీ నటరాజ రామకృష్ణ, శ్రీ నూకల చిన సత్యనారాయణ.

♦ ♦ ♦

జూన్ 28 న తేదీన విజయ నగరంలో భాగవత గురుకులం ప్రారంభించబడింది. శ్రీ వరదా ఆదినారాయణగారు దీనికి గురుకులపతి. శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలో ఇదివరకు బహుళ ప్రచారంలో నుండిన భాగవత కళలో శిక్షణ యిచ్చుటకు ఈ గురుకులం ఉద్దిష్టమైనది.





విజయనగరం నృత్యోత్సవంలో జరిగిన పోటీలలో భరతనాట్యం
సీనియర్ తరగతిలో ప్రథమ స్థానం సంపాదించిన
కుమారి కందుల సత్యవతి, గుంటూరు
అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల
సూర్యచంద్రరావుగారి నుండి
బహుమతిని స్వీకరిస్తున్న
దృశ్యం



భరతనాట్యం జూనియర్ ప్రథమ బహుమతిని
అకాడమీ అధ్యక్షుల నుండి స్వీకరిస్తున్న
కుమారి డి. రాధాకుమారి, విజయనగరం



కూచిపూడి సీనియర్ ప్రథమ బహుమతిని అకాడమీ
అధ్యక్షులనుండి స్వీకరిస్తున్న కోట త్రిపురసుందరి, ఏలూరు



కూచిపూడి జూనియర్ ప్రథమ బహుమతిని అకాడమీ
అధ్యక్షులనుండి స్వీకరిస్తున్న కుమారి గద్దె లత, ఏలూరు

# వార్తావాహిని

## రాష్ట్ర శాసన మండలికి శ్రీ సూర్యచంద్రరావుగారి నామినేషన్

ప్రముఖ రంగస్థల, చలనచిత్ర నటులు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు అయిన శ్రీ పసల సూర్యచంద్ర రావు గారిని రాష్ట్రగవర్నర్ శ్రీ పట్టంథాను పిళ్లె రాష్ట్ర శాసనమండలికి నామినేట్ చేశారు. వీరు ఆరు సంవత్సరాలు శాసన మండలి సభ్యులుగా ఉంటారు.



శ్రీ సూర్యచంద్రరావు గారిని శాసన మండలికి నామినేట్ చేయడం సంగీత, నృత్య, నాటక కళలకు శాసన మండలిలో ప్రాతినిధ్యం కల్పించినట్లు రాష్ట్రం నలుమూలల నుంచి కళాకారులు హర్షం ప్రకటించారు.

శ్రీ పసల సూర్యచంద్రరావు గారు 1909 లో జన్మించారు. వీరు మెకానికల్ ఇంజనీరింగు చదివినా వీరికి సంగీతం, నృత్యం, నాటకము పైననే అభిమానం మెండు. విద్యార్థి దశలోనే ప్రేమ విలాసినీ నాట్య మండలిని స్థాపించి జయప్రదంగా కొంత కాలం నిర్వహించారు. అనేక తెలుగు, హిందీ నాటకాలను దేశమంతటా ప్రదర్శిం చారు. చంద్రగుప్త, తానీషా, ఔరంగ జేబు, అక్బరు మొదలయినవి వీరి అభిమాన పాత్రలు.

క్విట్ ఇండియా ఉద్యమములో వీరు ప్రముఖపాత్ర వహించారు. అప్పటినుండి వీరు రాజకీయాలలో ప్రవేశించి రాష్ట్ర కాంగ్రెస్ వ్యవస్థలో వివిధహోదాలు నిర్వ హించారు. కొన్నాళ్ళు వీరు ఆంధ్రరాష్ట్ర శాసనసభ డిప్యూటీ స్పీకరు పదవిని నిర్వహించారు. రాజకీయ రంగంలో ఉంటూ ఉండినా సాహిత్య, లలితకళా సేవలను విస్మరించలేదు. కొన్ని ప్రముఖ హిందీ రచనలను తెలుగులోనికి అనువదిం చారు. పెక్కు సాహిత్య వ్యాసాలు రచిం చారు. 1945 నుండి నేటివరకున్నూ ఆంధ్ర నాటక కళాపరిషత్తు ప్రధాన కార్యదర్శి పద

విని నిర్వహిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ గౌరవ కార్యదర్శిగా, 1961 నుండి 1964 వరకున్నూ, 1964 నుండి అధ్యక్షులుగాను ఉంటూ సంగీత, నాట్య, నాటక కళల పురోభివృద్ధికి వీరు ఎంతగానో కృషిచేస్తున్నారు.

x x x

## అహమ్మదాబాదులో కూచిపూడి నాట్య ప్రదర్శనలు

భారత దేశ ప్రసిద్ధ నర్తకి శ్రీమతి మృణాళిని శరభాయి వేసకాలపు విరామ దినములలో కూచిపూడి నాట్య పునశ్చరణ తరగతులను ఏర్పాటుచేసి మే 1వ తేదీ నుండి నెలాఖరు వరకును నడిపిరి. దానిలో ప్రధాన అధ్యాపకులుగా భరతాచార్య శ్రీమాన్ సి. ఆర్. ఆచార్యులగారు పని చేసిరి. టి. కె. నరసింహాచార్య (ఏలూరు) కూచిపూడి నాట్య నేపథ్య గాయకులుగా పని చేసిరి. కుమారి సునతి (బొంబాయి) చి॥ రంగమణి (ఏలూరు) సుధాదేవి (బొంబాయి) దర్శిని, స్మిత, మొదలుగాగల పదునైదుగురు నాట్యకారులు తరిఫీదు బొందిరి. ది. 31 వ, తేదీన స్థానిక మంగళదాసు టౌన్‌హాలులో శిక్షణ పొందిన కళాకారులచే ప్రదర్శనము ఏర్పాటు చేయబడినది. సదరు ప్రదర్శనమునకు శ్రీ నిత్యానంద కనుంగో (గుజరాతు గవర్నరు) గారు అధ్యక్షత వహించిరి. శ్రీ డాక్టరు విక్రమ శరభాయి, స్వామి చిన్మయానంద, శ్రీమతి ఇందుమతీదేవి (గుజరాతు విద్యాశాఖమంత్రి) మున్నగు ప్రముఖులు సభను అలంకరించియుండగా ప్రప్రథమముగా కూచిపూడి నాట్య ప్రదర్శనములు అహమ్మదాబాదు పట్టణములో ప్రదర్శింపబడినవి. శాస్త్ర సంప్రదాయ సిద్ధమైన రంగపూజా విధులతో నాట్య ప్రారంభము జరిగినది. జయదేవ విరచితమైన "నిజగాథ సాయదునందనే" అను అష్టపదిని పలు తెరగులగు అభినయ విన్యాసములతోను, పాద భేదములతోను ప్రదర్శించిరి.

నటరాజు తాండవము కూచిపూడి సంప్రదాయమునకు మరింత వన్నె తెచ్చినది. మండూక శబ్దము స్వదేశ విదేశీయులను గూడ ముగ్ధుల గావించినది. నారాయణ తీర్థులవారు రచించిన "బాల గోపాల" తరంగము పళ్లెముపై పాద భేదములతో నృత్యము గావించుట ప్రేక్షకులను ఉత్తూతలూగించినది. ఆంధ్ర దేశములో అనేక తావులలో ప్రదర్శించి ప్రఖ్యాతి గాంచిన "అమృత మథన'' మను నృత్య నాటకము, కూచిపూడి భాగవత మేళ నాటకములకు అత్యంత కీర్తిని ఆర్జించినది. నెల రోజులలో శిష్యులను తయారు చేసి రంజకముగ ప్రదర్శింప జేయించిన శ్రీ నాట్యాచార్యులవారి కృషిని శ్రీ నిత్యానంద కనుంగో (గుజరాతు గవర్నరు)గారు ప్రశంసించి కూచిపూడి నాట్యము మిక్కిలి ఉన్నత స్థాయికి రాగల

దని చెప్పిరి. అనివార్య కార్యభారములచే ప్రదర్శనములకు రాజాలని భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి, ఆంధ్ర ప్రదేశ గవర్నరు శ్రీ పట్టం తానుపిల్లె గారలు తమ శుభకాంక్షలను అందజేసిరి. స్వదేశములోనే గాక విదేశములోగూడ ప్రదర్శనములు యిచ్చి అఖండ కీర్తిని భారతదేశ నాట్య కళ పొందుటకు శ్రీ సి. ఆర్. ఆచార్యులగారు అధిక కృషిని చేయుచున్నారనియు, వారి సహకారముతో నాట్య కళా మతల్లిని ఆరాధించుటకును, తమ తరువాత వారుగూడ నాట్య కళను ఆరాధించుటకును యీ పునశ్చరణ తరగతులు యేర్పాటు జేయడమైనదనియు శ్రీమతి మృణాళిని శరభాయిగారు చెప్పిరి. నాట్యాచార్య శ్రీ ఆచార్యులగారిని చందన తాంబూల శాలువాలతో సత్కరించిరి.



## ఒక తరం కథ

ఈనాడు మనం నివసిస్తున్న యీకాలం చరిత్రలో అత్యంత ప్రధానమైనది. నేడు భారత దేశం ఆదర్శవంతమైన అభ్యుదయ పథంలో అతి వడిగా పురోగమిస్తున్నది. ఎదురవుతున్న అనేక జాతీయ, అంతర్జాతీయ సమస్యల్ని అధిగమించి ప్రగతిలోకి ప్రయాణిస్తున్నాం మనం. మనం చేస్తున్న ఈ మహాయాత్ర యొక్క సమగ్ర స్వరూపాన్ని తెలుసుకోవాలంటే ——

సమాచార పౌర సంబంధ శాఖ ప్రచురిస్తున్న

# "ఆంధ్రప్రదేశ్"

## సచిత్ర మాస పత్రిక

## చదవండి

ప్రతి నెలా

90,000 కాపీలు

అమ్ముడవుతున్నాయి.

***

విడి ప్రతి

వెల 30 పైసలు.

*

టి. రామచంద్రరావు,

డైరెక్టరు,

సమాచార, పౌర సంబంధ శాఖ,

ఆంధ్రప్రదేశ్.

# సంగీత రత్నాకరము.

సంస్కృత మూలము

శార్ఙ్గదేవుడు

తెలుగు అనువాదము

గంధం శ్రీరామమూర్తి

ప్రచురణము

ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

కళాభవన్, హైద్రాబాదు-4

1966

# పరిచయము

శార్ఙ్గదేవుని పేరు, ఆయన రచించిన సంగీత రత్నాకరము పేరు సంగీతజ్ఞు లందరకును సుపరిచితములే. ఇంక అగాధమైన ఈ రత్నాకరము యొక్క స్వరూప స్వభావములను కూడ సుపరిచితములను చేయుటయే ఈ అనువాదమును తలపెట్టుటలోని అకాడెమీ ఉద్దేశ్యము.

## శార్ఙ్గదేవుడు

శార్ఙ్గదేవుడు క్రీ. శ. 13 వ శతాబ్దిలో జీవించి యుండెను. గ్రంథ ప్రారంభమందు చెప్పుకొన్న దానినిబట్టి ఇతడు కాశ్మీరీయుడు. తాతగారగు భాస్కరుడు కాశ్మీరమునుండి దక్షిణ దేశమునకు వలసవచ్చెను. తండ్రి సోఢలదేవుడు దేవగిరిని (నేటి దౌలతాబాదును) క్రీ. శ. 1210 నుండి 1247 వరకు పరిపాలించిన సింఘణ దేవుని ఆస్థానమం దుండెను. శార్ఙ్గదేవుడు కూడ సింఘణదేవుని ఆస్థానమందు 'శ్రీకరణ-అగ్రణి' (ప్రధాన రాజగణకుడు) పదవిని నిర్వహించినట్లు తెలియుచున్నది. అధ్యాయాంతగద్య ఈ విధముగా నున్నది. "శ్రీమదనవద్య విద్యావినోద-శ్రీకరణాధిపతి-శ్రీ సోఢలదేవనందన-నిశ్శంక-శ్రీ శార్ఙ్గదేవ......". ఇందలి 'నిశ్శంక' పదము సంగీత విద్యావిషయమున శార్ఙ్గదేవుని అసందిగ్ధ జ్ఞానమును సూచించు చున్నది. ఇతడు 'నిశ్శంక' అనెడి ఒక వీణను, ఒక ప్రబంధమును ఒక తాళమును, 'శార్ఙ్గదేవ' అనెడి ఇంకొక తాళమును రూపొందించెను. మరియు శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరమునే కాక అధ్యాత్మవివేకము అనెడి వేదాంత గ్రంధమును రచించెను.

గీత - వాద్య - నృత్యములు మూడును సంగీత మనబడుననని శార్ఙ్గదేవుడు నిర్వచించెను. అందుచేత ఇందు ఈ మూడు కళలును విపులముగా వివరింపబడినవి. ఇది ఏడు అధ్యాయములుగా విభజింపబడినది.— 1. స్వరాధ్యాయము, 2. రాగాధ్యాయము, 3. ప్రకీర్ణాధ్యాయము, 4. ప్రబంధాధ్యాయము, 5. తాళాధ్యాయము, 6. వాద్యాధ్యాయము, 7. నృత్యాధ్యాయము. ఇందు ప్రతి అధ్యాయము మరల ప్రకరణములుగా విభజింపబడి యున్నది. ఉదాహరణమునకు ప్రథమాధ్యాయమందు ఎనిమిది ప్రకరణము లున్నవి—1. పదార్థ సంగ్రహ ప్రకరణము, 2. పిండోత్పత్తి ప్రకరణము, 3. నాద-స్థాన-శ్రుతి-స్వర-జాతి, కుల - దైవత - ఋషి - ఛందో-రస ప్రకరణము, 4. గ్రామ-మూర్ఛనా-క్రమ-తాన ప్రకరణము, 5. సాధారణ ప్రకరణము, 6. వర్ణాలంకార ప్రకరణము, 7. జాతి ప్రకరణము, 8. గీతి ప్రకరణము.

తాను బహు ప్రాచీన సంగీత విశారదుల మతపయోనిధిని మథించి సారరూపమున సంగీత రత్నాకరమును రచించినట్లు శార్ఙ్గదేవుడు గ్రంథ ప్రారంభమున చెప్పుకొనినాడు. కాగా సంగీత రత్నాకరము నిజమునకు ఒక స్వతంత్ర గ్రంధము కాదన్నమాట. శార్ఙ్గదేవుడు తననాటి వరకు వ్యాప్తియందున్న సమస్త

మతములను వడబోసి, బహుజన సమ్మతములైన వాటిని గ్రహించి, తన గ్రంధమందు విశిష్ట మొనర్చినాడు. పెక్కుచోట్ల అభినవ గుప్తాదుల వాక్యములను అట్లే శ్లోకరూపమున మలచుకొని గ్రంథస్థము చేసినాడు. ఇట్టిది సమస్త మతముల సారము కావుననే నాటినుండి నేటివరకును ఇది సంగీత విషయమున పరమప్రమాణ గ్రంధముగా విలసిల్లినది. శార్ఙ్గదేవుని కొన్ని సిద్ధాంతములతో ఏకీభవింపని అర్వాచీన గ్రంధకర్తలు కూడ పెక్కు విషయములందు శార్ఙ్గదేవుని పూర్తిగా అనుసరించి యుండుటనుబట్టి సంగీత రత్నాకరము యొక్క విశిష్టతను గ్రహింపవచ్చును.

## వ్యాఖ్యలు

సంగీత రత్నాకరము ప్రమాణ గ్రంధ మగుటచేతను, అందలి శ్లోకములు బహు క్లుప్తములును, పారిభాషిక పదజటిలములును అగుటచేతను దీనికి వ్యాఖ్యానములు ఆవశ్యకములైనవి. ఈ విషయమున దీనిని నాట్య శాస్త్రముతో పోల్చవచ్చును. సంగీత రత్నాకరమును వ్యాఖ్యానించుటకు పూనుకొనిన వారిలో ముఖ్యులు సింహభూపాలుడు, చతుర కల్లినాధుడు, కేశవుడు, గంగారాముడు, ఐతలుడు. ప్రసిద్ధ అలంకార గ్రంధమైన 'రసార్ణవ సుధాకర' కర్తయగు సింహభూపాలుడే ఈ సింహభూపాలుడు. 'రేచర్ల వంశస్థుడగు ఈ సింహభూపాలుడు క్రీ. శ. 14 వ శతాబ్ది చివరి భాగములో రాజుకొండ రాజధానిగా రాజ్యమేలెను. సింహభూపాలుని అధ్యాయాంత వ్యాఖ్యానగద్య ఈ విధముగా మన్నది–" ...శ్రీమదంధ్ర మండలాధీశ్వర–ప్రతిగండ భైరవ–శ్రీ అనపోత నరేంద్రనందన–భుజబలభీమ–శ్రీ సింహభూపాల...."

ఇంక కల్లినాధుడు విద్యానగరవాసి. యాదవ వంశస్థుడైన ఇమ్మడి దేవరాయల (క్రీ. శ. 1446–65) ఆస్థానమందుండి, రాయల కోరికపై సంగీత రత్నాకరమునకు ఒక వ్యాఖ్య వ్రాసెను. కల్లినాధుని తాత వల్లభదేవుడు, తండ్రి లక్ష్మీధరుడు, తల్లి నారాయణి.

సింహభూపాలుని వ్యాఖ్యపేరు 'సుధాకరము' కల్లినాధుని వ్యాఖ్యపేరు 'కలానిధి'. ఇందు సింహభూపాలుని వ్యాఖ్య సూటియును, సంక్షిప్తమును కాగా కల్లినాధుని వ్యాఖ్య పాండిత్య ప్రకర్షతో కూడియున్నది. కల్లినాధుని అధ్యాయాంత వ్యాఖ్యానగద్య ఈ విధముగా నున్నది. —"...శ్రీమదభి నవభరతాచార్య–రాయ–బయకార–తోడరమల్ల–లక్ష్మణాచార్య నందన–చతుర కల్లినాథ విరచిత....".

సంగీత రత్నాకర కర్త రాజు; దాని తొలి వ్యాఖ్యాత కూడ రాజే. ఇంక మలి వ్యాఖ్యాత రాజాస్థానములో ప్రధానోద్యోగి. దీనినిబట్టి ఆనాడు రాజాస్థానములకు, కళలకు గల సన్నిహిత సంబంధము సుస్పష్టమగుచున్నది.

కేశవుడను నాతడుకూడ సంగీత రత్నాకరమునకు 'కౌస్తుభ'మనెడి వ్యాఖ్య రచించినట్లు 'సంగీత సుధ'లో గోవింద దీక్షితుడు పేర్కొని యుండెను. శార్ఙ్గదేవుడే కాక పై ముప్పురు వ్యాఖ్యాన కర్తలును గోవింద దీక్షితుని తీవ్ర విమర్శలకు గురియైనారు.

'సంగీత రత్నాకర చంద్రిక' యనెడి ఇంకొక వ్యాఖ్యానమున్నట్లు తెలియుచున్నది. (Catalogue of Sanskrit Manuscripts in South India by Oppert No. 6258). ఈ 'చంద్రికా' కర్త ఎవ్వరో తెలియదు.

పై నాలుగును సంస్కృత వ్యాఖ్యానములు. ఇవికాక దేశభాషలందు కూడ వ్యాఖ్యానములు వెలసి యున్నవి. విఠలుడను నాతడు తెలుగులో ఒక వ్యాఖ్య రచించెను. వఘేలరాజగు విశ్వనాథ సింహుని (A. D. 1833–54) ఆస్థానమందలి గంగారాముడను నాతడు 'సేతువు' అను పేర హిందీలో ఒక వ్యాఖ్య రచించెను. ఇది తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఉన్నది. సంగీత రత్నాకరమునకు తమిళ పద్యానువాద మొకటి పై లైబ్రరీలోనే కలదు. ఇటీవలనే తొలి అధ్యాయమునకును, చివరి అధ్యాయము నకును ఆంగ్లానువాదములు ప్రకటితములైనవి.

ఇన్నివ్యాఖ్య లున్నప్పటికిని సంగీత రత్నాకరము కొన్నిచోట్ల ఇంకను దుర్గ్రాహ్యముగానే యున్నది. శార్ఙ్గదేవుని తరువాత సంగీత సిద్ధాంతములందు పెక్కు మార్పులు చేర్పులు కలుగుటయే యిందులకు కారణము. అయినప్పటికిని, రచన పూర్తి అయిన నాటినుండి నేటివరకును దాని విశిష్టత చెక్కు చెదరలేదు.

## ముద్రణములు

సింహభూపాల వ్యాఖ్యతో కూడిన సంగీత రత్నాకర ప్రథమాధ్యాయము క్రీ. శ. 1879 లో (న్యూ ఆర్యా ప్రెస్, కలకత్తా) ప్రకటితమైనది. అటుపిమ్మట కల్లినాథుని వ్యాఖ్యతో కూడిన సంగీత రత్నాకరము సంపూర్ణముగా రెండు భాగములుగా 1896 లో ప్రకటితమైనది (ఆనందాశ్రమ సంస్కృత ప్రచురణలు. నెం. 35). ఇంక మూడవ ప్రచురణము మద్రాసు అడయార్ లైబ్రరీవారు చేపట్టినది. కల్లినాథ, సింహభూపాలుర వ్యాఖ్యలతో కూడ సంపూర్ణముగా నాలుగు భాగములుగా ముద్రింపబడిన ప్రచురణ మిది.

## ప్రస్తుతాంశము

సింహభూపాల, కల్లినాథుల వ్యాఖ్యలను ఆధారముగా చేసికొని సంగీత విద్వాంసుల సహాయమున ఈ తెలుగు అనువాదము సాగినది. ఇది సహృదయుల మన్ననలను బడయగలదని. ఇట్టి విశిష్ట శాస్త్ర గ్రంథములను తెలుగులోనికి తీసికొని రావలయుననెడి అకాడెమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావుగారి ఆశయమునకు ఇతోఽధిక ప్రోత్సాహ సహకారములు లభించగలవని విశ్వసించు చున్నాను.

పొణంగి శ్రీరామ అప్పారావు

---

*References :*


1 Introduction. to 'Bharatha Kosa' by Sri Manavalli Rama Krishna Kavi (1951).

2. Introduction to Sangita Ratnakara by Sri C. Kunhan Raja (1943).

3. "Later Sangita Literature" by Dr. V. Raghavan (1960).

## శార్ఙ్గదేవ విరచిత

# సంగీత రత్నాకరము

## స్వరగతాధ్యాయము

### పదార్థసంగ్రహ ప్రకరణము

బ్రహ్మగ్రంధిజ మారుతానుగతినా చిత్తేన హృత్పంకజే
సూరీణామనురంజకః శ్రుతిపదం యోఽయం స్వయం రాజతే
యస్మాద్గ్రామ విభాగ వర్ణరచనా లంకార జాతిక్రమో
వందేనాదతనుం తముద్ధుర జగద్గీతం ముదే శంకరమ్ ॥

ఇట శార్ఙ్గదేవ కవి తన రచింపంబూనిన గ్రంథము నందలి ప్రధానాంశమును సమాసోక్తిచే సూచించుచు శిష్టాచార పద్ధతిని విశిష్ట నిజాభీష్టదేవతా నమస్కృతిని గ్రంథాదిని గావించుచుండెను.

అందుముందుఁ బ్రస్తుతమును వాచ్యంబునగు శంకరపక్షము చెప్పఁబడుచున్నది.

యోగిజనుల హృదయస్థానము నందలి ద్వాదశదల చక్రంబున బ్రహ్మగ్రంధి పేరిటి నాభి కందంబునఁ బొడము ప్రాణవాయువు ననువర్తించు సంతః కరణంబున శ్రుత్యుత్పత్తి స్థానంబగు ప్రణవంబున నే యీ దేవుండు స్వయంప్రకాశమానుఁ డగుచుండునో యెవ్వనివలన లోకవిభాగములయు బ్రాహ్మణాది వర్ణరచనలయు తదుత్పన్నాలంకార జాతులయు క్రమము వరగుచుండునో యా నాదాత్మకుఁడు సకలలోక వినుతుఁడునగు శంకరునిఁ బరమానందలబ్ధికై ప్రణమిల్లుదును.

ఇఁక నప్రస్తుత ప్రతీయమానస్వర పక్షము చెప్పఁబడు చున్నది. కోవిదజనుల హృత్పద్మగత మంద్ర స్థానమున బ్రహ్మగ్రంధినుండి యుత్పన్నమగు ప్రాణవాయువు ననుసరించు నాత్మప్రేరితమగు మనస్సుచే షడ్జాది సప్తస్వరములను వ్యక్తపఱచుచు ఛందోవత్యాది శ్రుతిస్థానముల రంజిల్లఁజేయు నే యిది స్వయం విరాజమాన మగుచుండునో యెద్దానంజేసి షడ్జగ్రామాది విభాగము స్థాయ్యాది వర్ణరచన ప్రసన్నాద్యలంకారములుఁ షాడ్జ్యాది జాతులు నను వానిక్రమము వర్తిల్లుచుండునో యా సుఖకరమగు నాదాత్మకగీతమును బ్రఖ్యాతింతును.

2. అస్తిస్వస్తి గృహంవంశః శ్రీమత్కాశ్మీర సంభవః ।
ఋషేర్వృషగణాజ్ఞాతః కీర్తి శోభిత దిఙ్ముఖః ॥

శ్రీమంతంబగు కాశ్మీర దేశంబున శుభనికేతంబును యశోధవళిత దిశావ్రాతంబును వృషగణ మహర్షి వంజాతంబునగు నొక సుప్రసిద్ధ వంశంబు కలదు.

3. యజ్వభిర్ధర్మధీధుర్యైర్వేద సాగరపారగైః యోద్విజేంద్రైరలంచక్రే బ్రహ్మాభిర్యాగతైరివ॥

ఆ వంగడము వేద పారావార పారంగతులును యాజ్ఞికులును ధార్మికులును భూతగలగత బ్రహ్మ సన్నిభులు నగు ద్విజోత్తములచే నలంకృతంబై యుండు.

4. తత్రాభూద్భాస్కర ప్రఖ్యోభాస్కరస్తేజసాంనిధిః
అలంకర్తుం ధక్షిణాశాం యశ్చక్రే దక్షిణాయనమ్ ॥

ఆ వంశంబున భాస్కరుండునుం బోలెఁ దేజోరాశియై భాస్కర నామధేయుండు దితుండయ్యె. అతండు దక్షిణాశ అలంకరింప దక్షిణాయనం బొనరించెను.

5. తస్యాభూత్తనయః ప్రభూతవినయః శ్రీసోఢలః ప్రౌఢధీః
యేన శ్రీకరణ ప్రవృద్ధ విభవం భూవల్లభం భిల్లమమ్
ఆరాధ్యాఖిలలోక శోకశమనీ కీర్తిస్సమాసాదితా
జైత్రేజైత్రపదంస్యథాయి మహతీ శ్రీ సింఘణే శ్రీరపి ॥

ఆ భాస్కరునకు శ్రీమద్విభవోల్లసితుఁడును ప్రౌఢమతియు వినయసంపన్నుఁడు నగు శ్రీ సోఢలుండను నతండు తనయుండయ్యె. అతండు మహావైభవ శోభితుండగు భిల్లమ్మఁడను భూవల్లభునకు సకల లోక శోకనివర్తినియగు కీర్తిని గల్గించెను. మఱియు శ్రీ సింఘణభూపతికి జైత్రనగరంబున లోకోత్తర జయశ్రీ నాపాదించెను.

6. ఏకఃక్ష్మావలయేక్షితీశ్వరమిల న్మౌళీంద్రనీలావలి
ప్రోదంచద్ద్యుతి చిత్రితాంఘ్రిని కర శ్రేణిర్నృపాలాగ్రణీః
శ్రీమత్సింఘణదేవ ఏవ విజయీ యస్య ప్రతాపానలో
విశ్వవ్యాప్యపి దందహీతి హృదయా న్యేవద్విషామున్నుంః

క్ష్మామండలంబున భూపాలురమౌళి భాగంబులందలి యింద్ర నీలోపలద్యుతులచే వింత రంగులనీను చరణ నఖశ్రేణిగల రాజాగ్రణియగు సింఘణ దేవుఁడొక్కఁడే విజయశ్రీ విభ్రాజితుఁడు. ఆ భూపవరేణ్యుని జాజ్జ్వల్యమానంబగు ప్రతాపానలము విశ్వమంతయు వ్యాపించినను దండిపగతుర గుండియలను మాత్రమే మెండుగా మండించు.

7. తంప్రసాద్య సుధీర్యోగుణినం గుణరాగిణం గుణగ్రామేణ యోవిప్రానుపకారైరతీ తృపతీ ॥

7. తం ప్రసాద్య సుధీర్యో గుణినం గుణరాగిణం
గుణగ్రామేణ యో విప్రానుపకారైరతీ తృపతీ ॥

గుణాఢ్యుండును గుణలాలసుండునగు నా సింహణప్రభుని బ్రసన్నుం జేసి సోఢల నామధేయుండగు వాసుధీపుంగవుండు తన గుణగణంబులం జేసియునుపకృతులం జేసియు విప్రవరులందన్పుచుండె.

8. దదౌ న కిం న కిం జజ్ఞౌ న దదౌ కాంచనసంపదమ్
కం ధర్మం విదధౌ నైష నబభౌ కైర్గుణైరయమ్ ॥

ఆ మహాభాగుఁడొసఁగని దానము లేదు. చేయని యజ్ఞము లేదు. పొందని సంపద లేదు. పూనని సుగుణములు లేవు.

9. తస్మాద్దుగ్ధాంబుధేర్జాతః శార్ఙ్గదేవస్సుధాకరః
ఉపర్యుపరి సర్వాన్యః సదౌదార్యస్ఫురత్కరః ॥

పాలకడలినుండి జాబిల్లియుంబోలె నమ్మహామహానుండి శార్ఙ్గదేవుండు వొడమె. అతండు నిరంతరమౌదార్య విభ్రాజితకరుండై సర్వాతిశాయియై యుండెను.

10. కృతగురుపదసేవః ప్రీణితాశేషదేవః
కలిత సకలశాస్త్రః పూజితాశేషపాత్రః
జగతివితత కీర్తిస్మన్మథోదారమూర్తిః
ప్రచురతరవివేకః శార్ఙ్గదేవోఽయమేకః

గురుపాదసేవాపరాయణుఁడు, సమస్త దేవతా ప్రీతికరుఁడు, సకలశాస్త్ర పారంగతుఁడు జగద్విస్తృత కీర్తివిభవుఁడు మార సుకుమారాకారుఁడు విమల వివేకధనుండునగు నీ శార్ఙ్గదేవుండు కడుంగడుం బ్రకంపనీయుఁడు.

11. నానాస్థానేషు సంభ్రాంతా పరిశ్రాంతా సరస్వతీ
సహవాసప్రియా శశ్వద్విశ్రామ్యతి తదాలయే॥

పలుచోట్ల పరిభ్రమించి డస్సిపోయిన సరస్వతీదేవి సహవాసప్రియ యగుచు నా శార్ఙ్గదేవుని యింట శాశ్వతముగ విశ్రమించుచుండె.

12. వినోదైక రసికో భాగ్యవైదగ్ధ్య భాజనమ్
ధనదానేన విప్రాణామార్తిం సంహృత్య శాశ్వతీమ్ ॥

వినోదైక భూమియు మహా భాగ్యరాశియునగు నా శార్ఙ్గదేవుఁడు ధనదానములచే విప్రుల యుత్కటార్తిని భూర్తిగఁదొలఁగించెను.

13. జిజ్ఞాసూనాం విద్యాభిర్గదార్తానాం రసాయనైః
అధునాఖిలలోకానాం తాపత్రయ జిహీర్షయా

విద్యాదానముచే జిజ్ఞాసువుల రంజింపఁజేసెను. రసాయన దానముచే రోగార్తుల ననుగ్రహించెను.

14. శాశ్వతాయచ ధర్మాయ కీర్త్యైనిశ్శ్రేయసాప్తయే
అవిష్కరోతి సంగీతరత్నాకరము దారధీః ॥

ఇప్పు డుదారబుద్ధియగు నీతండు సకలలోక తాపత్రయ నివృత్త్యర్థమై శాశ్వత ధర్మమును గీర్తిని, శ్రేయస్సును బడయ సంగీత రత్నాకరమును బ్రకటించుచుండె.

15-19. సదాశివః శివా బ్రహ్మభరతః కశ్యపోమునిః
మతంగోయష్టికోదుర్గాశక్తిః శార్దూలకోహలా
విశాఖిలోదత్తిలశ్చకంబలోZశ్వతరస్తథా
వాయుర్విశ్వావసూరంభాZర్జునో నారదతుంబురూ
అంజనేయో మాతృగుప్తోరావణో నందికేశ్వరః
స్వాతిర్గణో బిందురాజః క్షేత్రరాజశ్చరాహలః ॥
రుద్రటోనాన్య భూపాలో భోజభూవల్లభస్తదా
పరమర్థిచ సోమేశో జగదేకమహీపతిః
వ్యాఖ్యాతారో భారతీయే లోల్లటోద్భటశంకుకాః
భట్టాభినవగుప్తశ్చ శ్రీమత్కీర్తిధరంః పరంః ॥

సదాశివుఁడు, పార్వతి, బ్రహ్మ, భరతుఁడు, కశ్యపముని, మతంగుడు, యష్టికుడు, దుర్గాశక్తి, శార్దూలుడు, కోహలుడు, విశాఖిలుడు, దత్తిలుడు, కంబలుడు, అశ్వతరుడు, వాయువు, విశ్వావసువు, రంభ, అర్జునుడు, నారదుడు, తుంబురుడు, అంజనేయుడు, మాతృగుప్తుడు, రావణుడు, నందికేశ్వరుడు, స్వాతిర్గణుడు, బిందురాజు, క్షేత్రరాజు, రాహులుడు, రుద్రటుడు, నాన్యభూపాలుడు, భోజరాజు, పరమర్ది సోమేశుడు, జగదేక భూపాలుడు, లోల్లటుడు, ఉద్భటుడు, శంకుకుడు, భట్టాభినవగుప్తుడు, శ్రీమత్కీర్తిధరుడు.

20. అన్యేచబహవః పూర్వేయే సంగీత విశారదాః
అగాధబోధమంథేన తేషాంమతపయోనిధిమ్ ॥

21. నిర్మథ్య శ్రీశార్ఙ్గదేవ సారోద్ధారమిమం వ్యధాత్
గీతం వాద్యం తథానృత్తం త్రయం సంగీతముచ్యతే ॥

మఱియు నన్యులగు తొల్లిటి సంగీత ప్రవీణులు పెక్కురు భారతీయులు సంగీత శాస్త్రమును వ్యాఖ్యానించిరి. వారి మత సాగరము నగాధ జ్ఞానమంథాచలమున మథించి శ్రీ శార్ఙ్గదేవుడు సంగీతసారమను నవనీతమును వెలువరించెను. గీతము, వాద్యము నృత్తమునను నీ మూడును సంగీతమని చెప్పబడు.

22. మార్గో దేశీతితద్ద్వేధా తత్రమార్గస్స ఉచ్యతే
యోమార్గితో విరించాద్యైః ప్రయుక్తోభరతాదిభిః

త్రివిధమైన యీ సంగీతము మార్గము, దేశియని రెండువిధములు. అందు బ్రహ్మాదులచే నన్వేషింపఁబడి భరతాదులచే బ్రయోగింపబడినది మార్గ

23. దేవస్యపురతశ్శంభోర్నియతాభ్యుదయప్రదః
దేశదేశజనానాంయద్రుచ్యా హృదయరంజకమ్ ॥

మని చెప్పంబడు. అది శంభుదేవుని పురోభాగమున నియతాభ్యుదయ ప్రదంబైయుండు. ప్రతిదేశంబునను దేనిరుచిచే జనులకు మనోరంజన

24. గీతంచవాదనంనృత్తం తద్దేశీత్యభిధీయతే
నృత్తం వాద్యానుగంప్రోక్తం వాద్యం గీతానువర్తిచ ॥

మగుచుండునో గీతవాద్యనృత్తమయమయిన యీ సంగీతము 'దేశి' యని చెప్పఁబడుచున్నది. నృత్తము వాద్యము ననుసరించి యుండును. వాద్యము గీతము ననువర్తించియుండును.

25. అతోగీతం ప్రధానత్వాదత్రాదావభిధీయతే
సామవేదాది సంగీత సంజగ్రాహపితామహః ॥

కావున ప్రధానమైనదగుటంజేసి గీతము తొలుతఁజెప్పఁబడుచున్నది. బ్రహ్మదేవుఁడు సామవేదము నుండి యీ గీతమును సంగ్రహించెను.

26. గీతేనప్రీయతేదేవతే సర్వజ్ఞ పార్వతీపతిః
గోపీపతిరనంతోఽపి వంశధ్వని వశంగతః ॥

సర్వజ్ఞుడగు పార్వతీపతి గీతముచేఁ బ్రీతుఁడగు గోపీవల్లభుఁడగు శ్రీ కృష్ణుఁడు నాదిశేషుఁడును వేణునాద వశంగతులగుదురు. బ్రహ్మదేవుఁడు

27. సామగీతిరతో బ్రహ్మ వీణాసక్తా సరస్వతీ
కిమన్యేయక్ష గంధర్వదేవదానవ మానవాః ॥

సామగాననిరతుండగు, సరస్వతీదేవి వీణానురక్తయగు అన్యులగు యక్షులు, గంధర్వులు దేవతలు దానవులు, మానవులు వేఱచెప్పనేల?

28. అజ్ఞాత విషయాస్వాదోబాలః పర్యంకికాగత
రుదన్గీతామృతం పీత్వాహర్షోత్కర్షం ప్రపద్యతే

విషయాస్వాదము నెరుగని బాలుఁడు మంచము నందుండి యేడ్చుచు గీతామృతమును గ్రోలి తోడనే యేడ్పుమాని పరమానందమును బొందుచుండును.

29. వనేచర స్తృణాహారశ్చిత్రం మృగశిశు పశుః
లుబ్ధోలుబ్ధక సంగీతేగతేయచ్ఛతి జీవితమ్ ॥

అడవిం దిరుగాడెడు తృణాహారమైన మృగడింభకము పశువ్యాధునిచేఁ బాడఁబడిన గీతముచే ప్రలోభమును బొంది జీవిత నిరపేక్షమైయుండు.

30. తస్యగీతస్యమాహాత్మ్యం కేప్రశంసితుమీశతే
ధర్మార్థ కామమోక్షాణా మిదమేవైకసాధనమ్ ॥

అట్టి గీతమహిమను ప్రశంసింప నెవ్వరు శక్తులగుదురు. ఈ గీతమొక్కటే ధర్మార్థ కామమోక్షము లనెడు చతుర్విధ పురుషార్థములకు ముఖ్యసాధనము.

31. తత్రస్వరగతాధ్యాయే ప్రథమే ప్రతిపాద్యతే
శరీరం నాద సంభూతి స్థానాని శ్రుతయ స్తథా ॥

అందు ప్రథమమైన స్వరగతాధ్యాయమున నాదోత్పత్త్యాశ్రయమైన శరీరము, నాదోత్పత్తి ప్రకారము హృదయాది స్థానములు శ్రుతులు.

32. తతశ్శుద్ధాస్స్వరాస్స ప్త వికృతాద్వాదశాప్యమీ
కులాని జాతయోవర్ణాద్వీపాన్యార్షంచదైవతమ్

సప్తశుద్ధ స్వరములు, ద్వాదశ వికృతి స్వరములు కులములు జాతులు వర్ణములు ద్వీపములు ఆర్షము. దైవతము.

33. ఛందాంసి వినియోగాశ్చస్వరాణాం శ్రుతిజాతయః
గ్రామాశ్చమూర్ఛనాస్తానాః శుద్ధా కూటాశ్చసంఖ్యయా

ఛందస్సులు స్వరవినియోగములు, శ్రుతిజాతులు గ్రామములు, మూర్ఛనలు శుద్ధతానములు, కూటతానములు.

34. ప్రస్తారః ఖండమేరుశ్చనష్టోద్దిష్ట ప్రబోధకః
స్వరసాధారణం జాతి సాధారణమతఃపరమ్ ॥

35. కాకల్యంతరయో సమ్యక్ప్రయోగోవర్ణలక్షణమ్ ।
త్రిషష్టిరప్యలంకార స్త్రయోదశ విధంతతః ॥

36. జాతి లక్ష్మగ్రహాంశాది కపాలానిచకంబలమ్
నానావిధాగీతయేశ్చేత్యేతావాపీ వస్తుసంగ్రహః

ప్రస్తారము, ఖండమేరువు, నష్టోద్దిష్ట ప్రబోధకము స్వర సాధారణము జాతి సాధారణము మఱియు కాకల్యంతర సమ్యక్ప్రయోగము వర్ణలక్షణము త్రిషష్ట్యలంకారములు, త్రయోదశ విధ జాతి లక్ష్మములు-

37. అథరాగవివేకాఖ్యేzధ్యాయేవక్ష్యే మహేక్రమాత్
గ్రామరాగాంశ్చోపరాగానీ రాగానీ భాషావిభాషికాః ॥

38. తతోzభ్యంతర భాషాశ్చరాగాంగాణ్యఖిలాన్యపి
భాషాంగాణ్యప్యుపాంగాని క్రియాంగాణిచతత్త్వత

అనంతరము రాగవివేకాఖ్యమగు ద్వితీయాధ్యాయమున గ్రమముగా గ్రామ రాగములను ఉపరాగములను, రాగములను భాషలను విభాషికలను అంతర భాషలను సకల రాగాంగములను, భాషాంగములను ఉపాంగములను క్రియాంగములను యథాతథముగ జెప్పుదుము.

39. తతః ప్రకీర్ణకాధ్యాయే తృతీయేకథయిష్యతి
వాగ్గేయకారో గాంధర్వ స్వరాదిర్గాయనస్తథా

అటుపైని తృతీయమైన ప్రకీర్ణకాధ్యాయమున వాగ్గేయకారుడు, గాంధర్వము, స్వరాది

40. గాయనీగుణ దోషాశ్చతయోశ్శబ్దభిదాస్తథా
గుణదోషాశ్చశబ్దస్య శారీరం తద్గుణాస్తథా ॥

గాయనుడు, గాయని, తచ్ఛబ్దభేదములు, శబ్దగుణదోషములు, శారీరము, తద్గుణములు, తద్దోషములు.

41. తద్దోషాగమకః స్థాయా అలప్తిర్బృంద లక్షణమ్
తత ప్రబంధాధ్యాయేతుదాతదోzగాని జాతయః

గమకము స్థాయులనెడు గీతావయవములు ఆలాపము బృంద లక్షణము చెప్పబడును. పదంపడి చతుర్థమగు ప్రబంధాధ్యాయమున

42. ప్రబంధానాంద్విదాసూడ శ్శుద్ధచాయాలగస్తథా
అవిక్రమప్రబంధాశ్చ సూడస్థా అలిసంశ్రయాః

ఉద్గ్రాహాదిధాతువులు, స్వరాద్యంగములు మేదిన్యాది జాతులు, ప్రబంధములయ్యె లాదిశుద్ధ సూడము ధ్రువమందాది ఛాయాలగ సూడము సూడస్థములైన యీ విక్రమ ప్రబంధములు అవి సంశ్రయములు

---

* గ్రహాంశాదులు, కపాలములు కంబలము, నానావిధగీతములు, అవి వస్తు సంగ్రహమేతావన్మాత్రము. జాతిలక్ష్మములు పదుమూడు విధములు. 1. గ్రహము, 2. అంశము, 3. తారము, 4. మంద్రము, 5. న్యాసము, 6. అపన్యాసము, 7. సన్యాసము, 8. విన్యాసము, 9. బహుత్వము, 10. అల్పత, 11. అంతర మార్గము, 12. షాడవము, 13. ఔడువితము.

43. విప్రకీర్ణాస్తతశ్ఛాయాలగ సూథ సమాశ్రితాః
గీతస్థాగుణదోషాశ్చ వక్ష్యంతే శార్ఙ్గసూరిణా ॥

విప్రకీర్ణములు, ఛాయాలగ సూధ సమాశ్రితములు గీతస్తములైన గుణదోషములు, శార్ఙ్గదేవునిచే చెప్పబడ గలవు.

44. తాలాధ్యాయే పంచమేతుయార్గతాలాఃకలాస్తథా
పాతామార్గాశ్చచత్వారస్తథామార్గకలాష్టకమ్ ॥

పంచమమైన తాలాధ్యాయమున నిశ్శంక శార్ఙ్గదేవునిచే గ్రమముగా మార్గతాలములు కలలు నిశ్శబ్ద సశబ్ద క్రియలగు కలలు, పాతములు నాల్గుమార్గములు ఎనిమిది మార్గకలలు

45. గురులఘ్వాదిమానంచైక కలత్వాదయోభిదాః
పాదభాగాస్తథామాత్రాస్తాలే పాతకలావిధిః

గురులఘ్వాదిమానము ఏకకలత్వాది భేదములు పాదభాగములు, మాత్రలు తాలమునందు పాతకలా విధియు,

46. అంగులీనాంచనియమో భేదాయుగాదయస్తథా
పరివర్తోలయస్తేషాం యతయోగీతకానిచ

అంగులీనియమము యుగ్మాది భేదములు, పరివర్తము-లయలు తాలక్రియాంతర వర్తికాలము, యతులు, గీతులు

47. ఛందకాదీనిగీతాని తాలాంగనిచయస్తథా
గీతాంగానిచ వక్ష్యంతే దేశీతాలాశ్చతత్త్వతః

ఛందకాది గీతములు, తాలాంగనిచయము గీతాంగములు, దేశీతాలములును, తాల

48. నిశ్శంకశార్ఙ్గదేవేన తాలానాంప్రత్యయోస్తథా
షష్ఠేనానా విధం వాద్యం అధ్యాయే కథయిష్యతి

ప్రత్యయములును యథాతథముగ జెప్పఁబడును. షష్ఠాధ్యాయమున నానావిధవాద్యములు చెప్పఁబడును.

49. సప్తమేన ర్తనం నానారసభావా క్రమేణచ ॥

సప్తమాధ్యాయమున గ్రమముగా నర్తనమును నానారసభావములు చెప్పబడును.

---

ఇతిప్రథమే స్వరగతాధ్యాయేపదార్థ సంగ్రహాఖ్యమాదిమం ప్రకరణం

ఇది మొదటిదగు స్వరగతాధ్యాయమున పదార్థసంగ్రహమను మొదటి ప్రకరణము.

# స్వ ర గ తా ధ్యా య ము

## పిండోత్పత్తి ప్రకరణము

1. గీతం నాదాత్మకం వాద్యం నాదవ్యక్త్యా ప్రశస్యతే
తద్ద్వయానుగతం నృత్యం నాదాధీనమతస్త్రయమ్ ॥
2. నాదేన వ్యజ్యతే వర్ణః పదం వర్ణాత్పదాద్వచః
వచసో వ్యవహారోఽయం నాదాధీనమతో జగత్ ।
3. ఆహతోఽనాహతశ్చేతి ద్విధా నాదో నిగద్యతే
సోఽయం ప్రకాశతే పిండే తస్మాత్పిండోఽభిధీయతే

గీతము నాదాత్మక మైనది. వాద్యము వీణాదినాదాభివ్యక్తిచేతనే ప్రశస్తి వడయుచుండును. ఆ వాద్యగీతముల రెండిటి ననుసరించి నృత్త ముండును. గాన గీత వాద్య నృత్తములు మూడును నాదవశములై యుండును. నాదమునఁ గకారాది వర్ణము వ్యక్తమగును వర్ణమువలనఁ బదమును బదమువలన వాక్యమును వాక్యమువలన శబ్దసంబంధమైన యీ వ్యవహారము నగును. కావున నీ జగము నాదాధీన మైనది. నాదము ఆహత మనియు ననాహత మనియు రెండు విధములు. ఆ యీ నాదము పిండమునఁ బ్రకట మగును, గాన పిండ విషయము చెప్పఁబడుచున్నది.

4. అస్తి బ్రహ్మ చిదానందం స్వయంజ్యోతిర్నిరంజనమ్
ఈశ్వరం లింగమిత్యుక్తమద్వితీయమజం విభుమ్
5. నిర్వికారం నిరాకారం సర్వేశ్వరమనశ్వరమ్
సర్వశక్తి చ సర్వజ్ఞం తదంశా జీవసంజ్ఞకాః

జ్ఞానానంద మయము, స్వయంప్రకాశమానము నిర్లిప్తము, స్వతంత్రము కారణభూతము అద్వితీయము జన్మరహితము వ్యాపకమును మఱియు. షడ్భావ వికార రహితము నిరాకారము సర్వజ్ఞ న్నియామకము నాశనరహితము సర్వశక్తి మంతము సర్వజ్ఞమునగు పరబ్రహ్మము కలదు. జీవులు తదంశమాత్రులు.

6. అనాద్యవిద్యోపహతా యథాగ్నౌ విస్ఫులింగకాః ।
దేహాద్యుపాధిసంభిన్నాస్తే కర్మభిరనాదిభిః ॥
7. సుఖదుఃఖప్రదైః పుణ్యపాపరూపైర్నియంత్రితాః
తత్తజ్జాతియుతం దేహమాయుర్భోగం చ కర్మజమ్ ॥

8. ప్రతిజన్మప్రపద్యంతే తేషామర్థ్యపరంపునః
సూక్ష్మం లింగశరీరం తదామోక్షాదక్షయం మతమ్

అగ్న్యంశంబులు దారుతృణపర్ణాద్యుపాధ్యవచ్ఛిన్నంబులై విస్ఫులింగము లని చెప్పఁబడునట్లు మూలావిద్యచే నుపహతులై యాజీవులు సుఖదుఃఖ ప్రదములు పుణ్యపాపరూపములు నగు ననాది కర్మములచే విబద్ధులై మనుష్యాది తత్తజ్జాతియుత దేహంబును ఆయువును కర్మజన్యంబగు భోగమును, ప్రతి జన్మంబునఁ బొందుచుందురు. స్థూల శరీరధారులగు నా జీవులకు స్థూల శరీరేతరంబయిన సూక్ష్మమగు లింగశరీరము కలదు. అది మోక్షపర్యంతమక్షయమని శాస్త్ర సమ్మతము.

9. సూక్ష్మభూతేంద్రియ ప్రాణావస్థాత్మక మిదంజగత్
జీవానాముపభోగాయ జగమేతత్సృజత్యజః ॥

ఈ లింగశరీరము సూక్ష్మములైన పృథివ్యాది భూతములతోడను చక్షురాదీంద్రియములతోడను ప్రాణాదివాయువులతోడను అంతఃకరణములతోడను గూడినదని తదజ్ఞులు చెప్పుదురు. పరమాత్ముఁడు జీవుల యుపయోగమునకై యీ జగత్తును సృజించెను.

10. స ఆత్మాపరమాత్మాచ విశ్రాంత్యైసంహరత్యథ
తదేత్సృష్టిసంహారం ప్రవాహోనాదిసమ్మతమ్

ఆ పరమాత్మ పిమ్మట విశ్రాంతికై యీ జగత్తు నుపహరించును. సృష్టి సంహార క్రియ ప్రవాహమువలె ననాదియని బుధ సమ్మతము.

11. తేజీవానాత్మనోభిన్నాభిన్నం వానాత్మనోజగత్
శక్త్యాసృజన్నభిన్నో సౌసువర్ణంకుండలాదివ

ఆ జీవులాత్మకంటె భిన్నులు కారుజగతేనియునాత్మకంటెభిన్నము కాదు. ఈ యాత్మ స్వశక్తిచే జగత్తును సృజించుచుఁ గుండలమునుండి సువర్ణంబునుంబోలె నభిన్నుఁడై యుండును.

12. సృజత్యవిద్యయేత్యన్యే యథారజ్జుర్భుజంగమమ్ ॥
ఆత్మనః పూర్వమాకాశస్తతో వాయుస్తతోఽనిలః

13. అనలాజ్జలమేతస్మాత్పృథివీ సమజాయత
మహాభూతాన్యమూన్యేషా విరాజో బ్రహ్మణస్తను ః ।

(ఈ యాత్మ స్వశక్తిచే జగత్తును సృజించుచు) రజ్జువు సర్పంబునుంబోలె నవిద్యచే జగత్తును సృజించుచుండునని వేదాంతులు చెప్పుదురు. ఆత్మనుండి తొలుత నాకాశముద్భవించెను. అందుండి వాయువు దానినుండి యగ్నియు నందుండి జలము, జలము నుండి పృధివియుం బొడమెను. ఇవి మహాభూతములు. విరాడ్బ్రహ్మ తనువు పంచభూతాత్మక మైనది



వరంగల్ జిల్లా, పాలంపేటలోని
రామప్ప దేవాలయ మండపమందు
చెక్కబడిన ఒక నృత్యభంగిమ

...d, Printed and Published by Pasala Suryachandra Rao for Andhra Pradesh Sangeeta Nataka ...demy, Kalabhavan, Saifabad, Hyderabad-4 and Printed at Natyakala Press, Hyderabad-4.